# భారతి

మాసపత్రిక



సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్



మార్చి 1971



సంపుటము : 48 :    సంచిక : 3 :

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## మార్చి 1971

# ప్రసవోత్సవం

శ్రీ మిరియాల రామకృష్ణ

నా గొడవ చెప్పమన్నావు
అస్మాదృశ సహస్రజం వేదనా జలధరాల్ని నీ ముందు గర్జిల్ల జేస్తున్నాను
నా గొడవ చెబుతున్నాను

అటు శాస్త్రం ఇటు యంత్రం ఒకదానినొకటి వలచి
విద్యుత్తరంగాయిత శార్వరిలో గాఢాలింగనాసక్తి బారలు చాచుకు
కనులు కలిపి ఎదురెదురై వెడుతున్నప్పుడు
మధ్య నేను సమీరవలిత ఫలావనత ద్రాక్షాలతలా ఉన్నాను
రెండూ ఓరచూపు లొలికిస్తే మధ్య నేను ములిగేలా ఉన్నాను
రెండూ గుసగుసలాడుకుంటే మధ్య నేను ఊగేలాగున్నాను
కవోష్ణజ్వాలనంతో ఇరుగుండెలు కలిస్తే
మధ్య నేను నలిగేలాగున్నాను కమిలేలాగున్నాను

ఈ వేళ
శాస్త్రం శరన్మేఘంలా తారుణ్యంలోకి పరుగెడుతూంది
ధరిత్రి చకితకురంగంలా మార్గం మార్చుకుంటూంది
భూమి జగన్నాథ రథాంగంలా ఎటో జరుగుతూంది
యంత్రం సుఖలాలసుణ్ణి నన్నెత్తుకుంది
కాలం నవతావిలాసుణ్ణి నన్నగరవేస్తోంది

ఈ అతివిచిత్రస్థితిలో గంగాత్రిపథగలా
నా గతి నే నెరగలేను
ఈ అతిముగ్ధస్థితిలో ప్రణయపిపాసువులా
నా కర్తవ్యం నేను పాలించలేను
ఈ అతిలోలస్థితిలో ఆకృష్టలోహశకలంలా
నా నిలయంలో నేనుండలేను

ఎక్కడికో నన్నెవరో తరుముతున్నట్టు
    అర్ధరాత్రి యంత్రదళన చటులధ్వని
ఎక్కడో నా బాధ్యత నెవరో కికురించినట్టు
    ఉదయవేళ కాలతరంగవేగ నిబిడఘోష
నిశ్చేష్టుడినయి చీకటిపారవైపు చూసి
ఆశ్చర్యపడి వెలుగుతెరవంక చూసి
నన్ను నేను ప్రశ్నించుకుంటాను :

    'ఎండను విరజిమ్మేది ఇనుడు
    వెన్నెల లీనేది జాబిల్లి
    మరి, చీకటిని చిమ్మేదెవరు'

*            *            *

నా గొడవ చెప్పమన్నావు
అస్మాదృశ సహస్రజన వేదనా జలధరాల్ని నీముందు గర్జిల్లజేస్తున్నాను
నా గొడవ చెబుతున్నాను.

ఇన్నాళ్ళ పరతంత్రతను అకవిత్వంలా గిరవాటువేసి
    స్వతంత్రపాలనను స్వర్ణ లేఖినిలా అందుకున్నాను
ఎవరిచ్చిందీ హక్కు ఎవరు తెరిచిందీ తలుపు
    ఎవరప్పగించిందీ బాధ్యత ఎవరు వేసిందీ దారి
ఎక్కడ ఈ చెట్టువిత్తినం ఎక్కడ ఈ కొమ్మవిరులు
    జ్వాలన్మేధను ఎడదమంచుకొండ కెక్కించిందెవరు
వారివైపు నా జీవితం పుష్పితాశోకంలా
    పునర్నవపుంర్నతమవుతున్నది
వారివైపు నా ఆశ ఫలభరరసాలంలా
    మధుమాధురీ ధురంధర మవుతున్నది
ఈ అశోకపుష్పాలను చింపి చిందరవందరగా
    నా కుటీరంముందు పోస్తున్న దెవరు
ఈ రసాలఫలాలను రాల్చి అతిరహస్యంగా
    పాతాళగృహంలోకి పారబోస్తున్న దెవరు

# ప్రసవోత్సవం

బీభత్సరసం పూజ్యమస్తిష్కాలమీద పోసి
    శ్మశానజ్వాల సృష్టిస్తున్న దెవరు
దుస్సాహసంతో సౌభ్రాత్రహృదయాలమీద
    చురకత్తులు గ్రుచ్చుతున్న దెవరు

మన్నుమిన్ను నన్ను తట్టిలేపి చెబుతున్న దేమిటి
    'నన్ను నేను వశపరుచుకోవాలని'
సకలదిక్కుల సుకవివాక్కుల వినిపిస్తున్న దేమిటి
    'జాగ్రత్త పరిపంథి కాచుకున్నాడని'
చీకటిని నిశితంగా చూస్తూ రిక్కలు చెబుతున్న దేమిటి
    'వివేదనాలోచనం విప్పుకోవాలని'
నిద్రామహేంద్రజాలం రచించే రాత్రులు పలుకుతున్న దేమిటి
    'అతిభోగలాలసకు వీడ్కోలు చెప్పాలని'

ఇవన్నీ మౌనవ్యాఖ్యానాలు సృష్టి గొంతెత్తి పలకని వాక్యాలు
    టెలిఫోనుపీనుల కెట్లా వినిపిస్తాయి
ఇవన్నీ సత్యలోకదృశ్యాలు జగత్తు ప్రదర్శించలేని చిత్రాలు
    కెమేరా కన్నుల కెట్లా కనిపిస్తాయి
నువ్వు చెప్పే కొత్తమార్గమేదైనా
పర్జన్యగర్జామధ్యంలో శంపాలతలా మెరుస్తూ
నిర్ఝరజలపాతంలో విద్యుత్తులా వెల్గుతూ

*    *    *

నా గొడవ చెప్పమన్నావు
అస్మాదృశ సహస్రజనవేదనా జలధరాల్ని నీముందు గర్జిల్ల జేస్తున్నాను
నా గొడవ చెబుతున్నాను.

నేడు నేను తూర్పువైపు నడుస్తూండగా
    పడమరనుంచి నన్ను పొడిచేవారున్నారు
నేడు నేను మలయసమీరంలోకి వెడుతూండగా
    మహాగ్నిఝంఝులు కల్పించేవారున్నారు

## భారతి

నేడు నేను విశ్వావసు పిలుస్తూండగా
        విషక్రిమిధార విరజిమ్మేవారున్నారు

నా ఉద్యమాల ఉద్యానాల ఆకుపచ్చ పొదరిళ్లలో
        జ్రుసపాకే గరళసర్పాన్ని మంత్రరుద్ధంచేసి
నా మనోరథాల మందిరాంతరాలలో
        కర్కశగానంచేసే వృత్తమశకాలకు తెరవేసి
నా మంచితనపు పంటచేలమీద
        చేతగానితనాన్ని పారవేసే దవలపక్షుల్ని గెంటి
నువ్వు నా హృదయవాసివై ఉండు
నువ్వు నా జీవితేశ్వరీత్వం భజించు
నేను చిరంతన చిత్ పరిచితుణ్ణి పరిచితానేక రంభావుణ్ణి
రసభావభావనా జీవితుణ్ణి జీవితాధ్వ నిహితదయాదీధితిని

ఈ పరివర్తితకాలంలో ఒక నవోదయప్రతిష్ఠకోసం
        నేత నెన్నుకుంటాను—వివేదన రగిలించు
వివేదనతో కెగిరి విజ్ఞతాబీజాలు చల్లి
        ప్రజ్ఞాక్షేత్రం పండిస్తాను—మనస్సు రగిలించు
మనోగగనంలో ఘూర్ణిస్తూ తిరిగే
        అహంతను వేటాడతాను—సహనం రగిలించు
సహనతీర్థాలు చేరి సమిద్ధదైవీశక్తిలో
        నిర్మోహాన్ని చూస్తాను—నిర్మోకాన్ని తొలగించు

ఇది పరీక్ష—నాకియ్యి జ్ఞాపకానేక వరాలు
ఇది డోల—బిగించు దీని కాధార పటుతంతువులు
ఇది ఆశయం—నా చేతిలో వెయ్యి ఆచరణలు
ఇది రచన—నాకియ్యి పరిమళాలు పరాగాలు రాగాలు

అతిసంచయేచ్ఛతో కొందరు ముందుకు పారిపోయి
        సుధాలిప్త ప్రాసాదవాసులు షడ్రుచిరుచిరహాసులు
విధివంచనా వాగురలో పడి కొందరు వెనకబడి
        సాధారణ కుటీరగతులు నిరతబుభుక్షా పీడితులు

## ప్రసవోత్సవం

తృప్తిలేని హృద్యతావాప్తిలేని
జీవితాప్సరోలాస్య దర్శనంలేని ఇందరినీ ఒక్కగంట... ఆగమని
వేగుబోక వేగంగా నడిచే మనోయంత్రశకట
మెక్కి వెడుదురుగాని......ఆగమని
ప్రతిమజిలీలో పురానేక జన్మలనుంచీ ఉన్న
బకాయిపిపాస తీర్చుకొందురుగాని......ఆగమని
ప్రతికూడలిలో కాలానికి పురమాయించిన కోరికనగలు
ధర్మకాటాలో వేయించి, తీసుకొందురుగాని......ఆగమని
ప్రతిజన్మదినంనాడూ పునఃప్రసవోత్సవం పొందినట్లు కిలకిలా నవ్వి
జ్ఞానోదయం కల్గినట్లు బిక్కుబిక్కున ఏడ్చి
సంతోషితమానసంతో నృత్తగీతవాద్య కవితానందాలు అక్షయంగా
అందుకొందురుగాని......ఆగమని ఆజ్ఞాపించు.

---



# ద్రావిడ భాషలు

## డా. పి. ఎస్. సుబ్రహ్మణ్యం

### భాషలు

ద్రావిడభాషా కుటుంబంలో ఇప్పటి లెక్కప్రకారం ఇరవైఒక్క భాషలు ఉన్నాయి. ఇవి భారత దేశంలో ముఖ్యంగా దక్షిణప్రాంతంలోనూ, మధ్యోత్తర ప్రాంతాలలో అక్కడక్కడా వ్యవహారంలో ఉన్నాయి. వీటిలో తమిళం, మలయాళం, కన్నడం, తెలుగు— ఈ నాలుగు భాషలకీ ప్రాచీన సాహిత్యాలూ, లిపులూ ఉన్నాయి. కాబట్టి వీటిని 'సాహిత్యవంతమైన భాషలు' (Literary languages) అంటారు. మిగిలిన భాషలు ప్రాచీన సాహిత్యం, ప్రత్యేక లిపులూ లేక ప్రజావ్యవహారంలోనే ఉండడంవల్ల వాటికి 'సాహిత్య రహిత భాషలు' (Non – literary languages) అంటారు. (ఈ పేరు 'ఆటవిక భాషలు' (Tribal languages) అనే దానికన్న యుక్తతరమని తోస్తుంది.)

తమిళం తమిళనాడులో 305 లక్షల ప్రజల వ్యవహారంలోఉంది. తమిళులు సింహళం, మలేషియా, సింగపూర్, కొన్ని ఆఫ్రికాదేశాలు మొదలైన ఇతర దేశాలలో కూడా అధికసంఖ్యలో ఉన్నారు. ఈ భాషలో క్రీస్తు పూర్వంనించీ విస్తారమైన సాహిత్యం లభ్యమవుతోంది. దీనిలో మొదటిగ్రంథం తొల్కాప్పియర్ రచించిన తొల్కాప్పియం. ఇది ప్రధానంగా వ్యాకరణం. దీనిలో ఎళుత్తదికారం (వర్ణాధికారం), చొల్లదికారం (శబ్దాధికారం), పొరుళదికారం (అర్థాధికారం, కావ్యం, వస్తువు, అలంకారాలు మొదలైనవాటిని గురించినది) అనే మూడు భాగాలు ఉన్నాయి. దీనిలోని అతి ప్రాచీన సాహిత్యం ఎనిమిది సంపుటాలలో క్రోడీకృతమై ఉంది; దీనిని 'సంఘ వాఙ్మయం' అంటారు. సంఘ వాఙ్మయభాషకూ తరవాత భాషకూ చాలా వ్యత్యాసం ఉంది. తమిళంలో బ్రాహ్మీలిపిలో వ్రాసిన శాసనాలు క్రీస్తు పూర్వం మూడోశతాబ్ది నించీ, తమిళ లిపిలో వ్రాసిన శాసనాలు క్రీస్తు తరవాత ఆరోశతాబ్దినించి దొరుకుతున్నాయి.

మలయాళం ప్రధానంగా కేరళలో 170 లక్షల ప్రజల వ్యవహారంలో ఉంది. తమిళ మలయాళాలకి అతి సన్నిహితమైన సంబంధం ఉంది. ఈ భాషలో శాసనాలు క్రీస్తుతరవాత తొమ్మిదోశతాబ్దం నించి దొరుకుతున్నాయి. దీనిలో మొదటి గ్రంథం 'రామచరితం' (పన్నెండో శతాబ్ది).

కన్నడం ప్రధానంగా మైసూరు రాష్ట్రంలో 173 లక్షల ప్రజల వ్యవహారంలో వుంది. దీనిలో శాసనాలు క్రీస్తు తరవాత ఐదో శతాబ్దినించి దొరుకుతున్నాయి; మొదటి గ్రంథం నృపతుంగుడనే రాజు వ్రాసిన 'కవిరాజ మార్గ' (తొమ్మిదో శతాబ్ది). బడగ అనే దీని మాండలికం నీలగిరులలో 85 వేల ప్రజల వ్యవహారంలోఉంది.

తెలుగు ప్రధానంగా ఆంధ్రప్రదేశ్‌లో 376 లక్షల ప్రజల వ్యవహారంలో ఉంది. తమిళనాడులో కూడా సుమారు నలభై లక్షల తెలుగువారు ఉన్నారు. వీరి తెలుగు చాలా ప్రాచీన లక్షణాలని నిలుపుకొంది. దీనిలో శాసనాలు క్రీ. త. ఆరోశతాబ్దినించి దొరుకుతున్నాయి. అంతకు ముందున్న సంస్కృత ప్రాకృత శాసనాలలో ఊళ్లనీ వ్యక్తులనీ సూచించే తెలుగు మాటలు కూడా దొరుకుతున్నాయి. దీనిలో మొదటి గ్రంథం నన్నయభట్టు రచించిన మహాభారతం మొదటి రెండున్నర పర్వాలూ.

ఇప్పటికి తెలిసిన సాహిత్య రహిత భాషలు మొత్తం పదిహేడు. అవి కోత (నీలగిరులు, 900); తోద (నీలగిరులు, 800); కొడగు (మైసూరులో కూర్గ్ జిల్లా, 78 వేలు); తుళు (మైసూరులో దక్షిణ కనరాజిల్లా, కేరళతో కాసర్‌గోడ్ తాలూకా, తొమ్మిది లక్షలు. ఉడుపి, కర్‌కల్, కుందాపూర్ అనే దక్షిణ కనరాజిల్లా తాలూకాలలో కొరగ జాతి వారు సుమారు వెయ్యిమంది ఒక భాష మాట్లాడుతున్నారు. ఇది బహుశా తుళు మాండలికం కావచ్చు); గోండీ (ఆంధ్రప్రదేశ్ అదిలాబాద్‌జిల్లా, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్‌లలో కొన్ని భాగాలు; 14 లక్షలు; ఖమ్మం, వరంగల్, బస్తర్ జిల్లాలలో ఒకటిన్నర లక్షల ప్రజల వ్యవహారంలోఉన్న కోయభాష దీని మాండలికం); కొండ లేక కూవి (విశాఖపట్టణం, శ్రీకాకుళం, కోరాపుట్ జిల్లాలు, 12 వేలు); పెంగొ (కోరాపుట్‌జిల్లా, 1300); మండ (కోరాపుట్); కూయి (కోరాపుట్, కళహంది జిల్లాలు (ఒరిస్సా). 5 లక్షలు); కువి (విశాఖపట్టణం, కోరాపుట్, 2 లక్షలు); కోలామీ (ఆదిలాబాద్, వార్ధాజిల్లాలు, 45 వేలు); నాయకీ (చాందా జిల్లా); పర్జి (బస్తర్‌జిల్లా, 85 వేలు); గదబ (కోరాపుట్ జిల్లాలో ఒల్లారి మాండలికం, సాలూరు దగ్గిర కొండేకోర్ మాండలికం); కూడుఖ్ (మధ్యప్రదేశ్‌లో ఛోటా నాగపూర్ ప్రాంతం, 11లక్షలు;) మాల్తో(బీహారులో రాజమహల్ కొండలు, 89వేలు); బ్రాహుయీ (పశ్చిమ పాకిస్తాన్‌లో బలూచిస్తాన్, 3 లక్షలు).

## ప్రత్యేక లక్షణాలు

ద్రావిడ భాషలలోని కొన్ని ప్రత్యేక లక్షణాలు వాటిని మిగిలిన ప్రపంచభాషలనించి వేరుచేస్తున్నాయి. ఈ కింద ఇచ్చినవి వాటిలో ముఖ్యమైనవి.

1. మూలద్రావిడంలో అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఎ, ఏ, ఒ, ఓ అనే పది అచ్చులు ఉండేవి. హల్లులలో ఆరు స్పర్శలూ (కంఠ్యం, తాలవ్యం, మూర్ధన్యం, దంతమూలీయం (ఆ) దంత్యం, ఓష్ఠ్యం), అయిదు అనునాసికాలూ (తాలవ్యం, మూర్ధన్యం, దంతమూలీయం, దంత్యం, ఓష్ఠ్యం), రెండు పార్శ్వికాలూ (మూర్ధన్యం, దంతమూలీయం), ఒక మూర్ధన్య పార్శ్వికాంతస్థం (ఇది ఇప్పుడు తమిళ, మలయాళాలలోనే నిలిచిఉంది), ఒక దంతమూలీయరేఫం, రెండు అంతస్థలు (తాలవ్యం, దంతోష్ఠ్యం) ఉండేవి. మూలద్రావిడంలో నాద స్పర్శాలు ప్రత్యేకవర్ణాలుకావు కాని తరవాత కాలంలో తమిళ మలయాళాలు తప్ప మిగిలిన భాషలలో అవి ప్రత్యేక వర్ణాలుగా రూపొందేయి. దంతమూలీయ స్పర్శం ఇప్పటికీ మలయాళం. కోత, తొద భాషలలో నిలిచిఉంది; మిగిలిన భాషలలో అది దంత్య స్పర్శంతోకాని, మూర్ధన్య స్పర్శంతోగాని, తాలవ్య స్పర్శంతోకాని ఏకమైపోయింది. అద్విరుక్తరూపంలో అది అతిప్రాచీన కాలంలోనే రేఫంగా మారిపోయింది. ప్రాచీన తమిళంలో దంత్య దంతమూలీయానునాసికాలు ప్రత్యేక వర్ణాలు. మూలద్రావిడంలో కూడా అవి ప్రత్యేక వర్ణాలుగా ఉండేవని చెప్పవచ్చు. ఇండో-యూరపియన్ భాషా కుటుంబంలో ఉపకుటుంబమైన ఆర్యభాషలలో మూర్ధన్యవర్ణాలు ద్రావిడభాషలతో సాంగత్యంవల్లనే ఏర్పడ్డాయని పండితుల అభిప్రాయం.

2. మూలద్రావిడంలో లింగభేదం ఏక వచనంలో మహత్తు (పురుషులు)—అమహత్తు, బహువచనంలో మనుష్యులు—అమనుష్యులు — ఈ విధంగా ఉండేది. ఈ లింగభేదం తెలుగు, కూడుఖ్, మాల్తో లలో ఇప్పటికీ నిలిచిఉంది. తొద, బ్రాహుయీలలో లింగభేదం పూర్తిగా నశించింది. దక్షిణ ద్రావిడ భాషలలో ప్రథమ పురుష సర్వనామాలలోనూ సమాపక క్రియలలోనూ స్త్రీలింగం ప్రత్యేకంగా ఏర్పడింది. తెలుగు తప్ప మిగిలిన మధ్య ద్రావిడభాషలతో ఏకవచనంలోని మహదమహత్ భేదం బహువచనంలోకి కూడా వ్యాపించి బహువచనంలో కూడా స్త్రీలింగం అమహత్తులోకి చేర్చబడింది. మూల ద్రావిడంలోనూ దక్షిణోత్తర ద్రావిడభాషలలోనూ

అమహత్తులలో బహువచన ప్రత్యయం వైకల్పికం; మధ్య ద్రావిడభాషలలో అది నిత్యమైంది.

3. ద్రావిడభాషలలో ద్వితీయ, చతుర్థి, పంచమి తప్ప మిగిలిన విభక్తి సంబంధాలన్నీ ప్రత్యేక పదాల మూలంగా (Postpositions) వ్యక్తమవుతాయి. బహువచనంలో విభక్తి ప్రత్యయాలు బహువచన ప్రత్యయం తరవాత వస్తాయి.

4. చాలా ద్రావిడభాషలలో అస్మదర్థక బహువచన సర్వనామంతోబాటు ఉభయార్థక సర్వనామం కూడా ఉంది (మూ. ద్రా. *యామ్ 'మేము', *నామ్ 'మనం'). ఈ భేదం పురుష ప్రత్యయాలలో కూడా చాలా భాషలలో ఉంది.

5. మూలద్రావిడభాషలో వర్తమాన భవిష్యత్కాలాలు రెండింటికీ ఒకే ప్రత్యయం ఉండేది. చాలా భాషలలో వర్తమానకాల క్రియ పదసముదాయంగా గాని, తరవాతకాలంలో ఏర్పడినదిగా గాని ఉంది.

6. ద్రావిడభాషలలో వ్యతిరేక క్రియలు ఒక ప్రత్యేకత. వీటిలో వ్యతిరేకార్థాన్ని క్రియలో వ్యతిరేక ప్రత్యయం చేర్చడంవల్ల సూచించవచ్చు. వ్యతిరేకార్థక క్రియ నిర్మాణం ఇలా ఉంటుంది. ధాతువు—వ్యతిరేకార్థకం—పురుష ప్రత్యయం. ఇది సాధారణంగా వర్తమాన భవిష్యత్ కాలాలలో వ్యతిరేకాన్ని సూచిస్తుంది. భూతకాలంలో వ్యతిరేకాన్ని సూచించడానికి తుమున్నర్థకంతోగాని క్త్వార్థకంతోగాని వ్యతిరేక క్రియారూపాలు చేర్చడంవల్ల ఏర్పడిన పదసముదాయాలు ఉపయోగిస్తాయి. మధ్య ద్రావిడభాషలు చాలా వాటిలో భూతకాల వ్యతిరేక క్రియలు వ్యతిరేక ప్రత్యయం తరవాత భూతప్రత్యయం చేర్చడంవల్ల ఏర్పడతాయి.

7. క్రియావిశేషణాలు (Verbal Adjectives), అసమాపక క్రియలూ ద్రావిడభాషల ప్రత్యేకతలు. చాలా భాషలలో మూడు క్రియావిశేషణాలూ (భూతం, అభూతం, వ్యతిరేకం) మూడు అసమాపక క్రియలూ (భూతం, వర్తమానం, వ్యతిరేకం) ఉన్నాయి. సంస్కృత భాషలో క్త్వార్థకక్రియ ప్రవృత్తి ద్రావిడభాషలలో క్త్వార్థక క్రియలవల్ల ప్రభావితమైనదని పండితుల అభిప్రాయం. ద్రావిడ భాషలలో క్రియావిశేషణాలు ఉండడమే వాటిలో యదర్థక సర్వనామాలు లేకపోవడానికి కారణం.

8. ద్రావిడభాషలలో కర్మ క్రియకి ముందు వస్తుంది.

9. ద్రావిడభాషలలో సముచ్చయక్రియ (Copula Verb) లేకుండా రెండు నామ పదసముచ్చయాలు (Noun Phrases) ఒక వాక్యంగా ఏర్పడగలవు. (ఉదా. వాడు మంచివాడు).

## పరిశోధన

ఎ. డి. కేంబెల్ వ్రాసిన 'A Grammar of the Teloogoo Language' (1816) అనే గ్రంథానికి 'Note to the Introduction' వ్రాసిన ఫ్రాన్సిస్ డబ్ల్యు. ఎల్లిస్ అందులో తమిళం, మలయాళం, కన్నడం, కొడగు, తుళు, తెలుగు, మాల్తోలు పరస్పరం సంబంధం గలవి అని మొట్టమొదటి సారిగా గుర్తించేరు. బిషప్ రాబర్ట్ కాల్డ్వెల్ 'A Comparative Grammar of the Dravidian or south–Indian Family of Languages' [1856) అనే తమ గ్రంథంలో యీ భాషల పరస్పర సంబంధాన్ని అతివిపులంగా నిరూపించారు. ఈయన కాలం నాటికి ఈ కింద ఇచ్చిన పన్నెండు భాషల వివరాలు మాత్రమే తెలిసేయి : తమిళం, మలయాళం, కన్నడం, తెలుగు, కోత, తొద, కొడగు, తుళు, గోండీ, కూయి, కూడుఖ్, మాల్తో, బ్రాహుయీని గురించిన వివరాలు కూడా తెలిసినా అందులో ద్రావిడ భాషా లక్షణాలు చాలా స్వల్పంగా ఉండడంవల్ల ఈయన దానిని ద్రావిడ భాషగా పరిగణించలేదు. కాని తరవాత కాలంలో బ్రాహుయీమీద విశేష పరిశోధన చేసిన సర్ డేనిస్‌బ్రే అది ద్రావిడ భాషే అని నిష్కర్షగా తేల్చి చెప్పేరు. ఈ భాషా కుటుంబానికి

'Dravidian' అని పేరుపెట్టి, యీ భాషలకీ సంస్కృతానికీ జన్యజనక సంబంధంలేదని నిరూపించిన ఘనత కాల్డ్‌వెల్‌కే దక్కింది. ఈయన గ్రంథం ఆధునిక భాషాశాస్త్రం వృద్ధిపొందకముందే వ్రాసినా యీ భాషలలోని ప్రధాన పరిణామక్రమాలు ఇందులో నిర్దుష్టంగా సూచించారు. తరవాత 1906 లో ప్రకటించబడిన Linguistic Survey of India, Volume IV (ఎడిటర్: స్టెన్‌కొనో)లో అన్ని భాషలకీ సంగ్రహ వ్యాకరణాలూ, ఆయా భాషలలో కథలూ చేర్చబడ్డాయి. ఇందులో కోలామీ, పర్జీలని గురించిన వివరాలు ఇవ్వబడ్డాయి. (కాని పర్జీ గోండీ మాండలికమని తప్పుగా గ్రహించబడింది)

పంతొమ్మిదో శతాబ్ది చివరి భాగంలోనూ, ఇరవైయో శతాబ్ది మొదటి భాగంలోనూ సాహిత్య రహిత భాషలైన తుళు (మేనర్) గోండీ (ట్రెంచ్, విలియంసన్), కూయి (విన్‌ఫీల్డ్), కువి (ఫిట్‌జరాల్డ్, లక్ష్మోజీ, షుల్జ్), కూడుఖ్ (హాన్, గ్రిగ్నర్డ్), మాల్తో (డ్రూస్), బ్రాహుయీ (సర్ డేనిస్ బ్రే)లకి వ్యాకరణాలూ, నిఘంటువులూ తయారయ్యాయి. వీటిలో కూయి, బ్రాహుయీలు తప్ప మిగిలిన భాషల వ్యాకరణాలు అసమగ్రాలే అయినా ఇటీవల కాలంవరకూ ఆయా భాషలకి ఇవే ఆధార గ్రంథాలుగా ఉపయోగిస్తూ వచ్చాయి. జూల్ బ్లాక్ ద్రావిడ భాషల వ్యాకరణ నిర్మాణంపై వ్రాసిన గ్రంథం (Structure Grammaticale des langues dravidiennes, 1946, English translation by R. G. Harshe 1954) లో యీ కొత్త గ్రంథాలలోని విశేషాంశాలని ఉపయోగించుకున్నారు.

ఎల్. వి. రామస్వామి అయ్యర్ 1925—1940 మధ్యకాలంలో ద్రావిడ భాషలపై తులనాత్మక పరిశోధన జరిపి అనేక వ్యాసాలూ, ఒక గ్రంథం వ్రాశారు. ప్రాచీన తమిళం, ప్రాచీన మలయాళంలోని గ్రంథాలూ, శాసనాలూ పరిశీలించి ఆ భాషల ప్రత్యేక లక్షణాలని వీరు వివరించారు. ద్రావిడ భాషలలో తులనాత్మక పరిశోధనతో భాషా చారిత్రకాంశాలని ఉపయోగించడం ఈయనతోనే ప్రారంభించిందని చెప్పవచ్చు. మలయాళంలో ప్రాచీన శాసనాలని పరిశీలించి మలయాళం మధ్యకాల తమిళంనుంచి సుమారు తొమ్మిదో శతాబ్దంలో విడిపడిందని ఈయన నిరూపించారు. ఈయన గ్రంథాలు, వ్యాసాలలో 'Dravidic Sandhi', 'Morphology of the old Tamil Verb', 'Evolution of the Malayalam Morphology' అతిముఖ్యమైనవి.

టి. బరో 1940—50 ప్రాంతకాలంలో తమ వ్యాసాలలో ద్రావిడ భాషలలో వర్ణనిర్మాణ తులనాత్మక పరిశోధనకి నాంది చేశారు. ఈయన వ్యాసాలతోనే ద్రావిడ భాషలలో శాస్త్రీయ పరిశోధన ప్రారంభమైనదని చెప్పవచ్చు. సంస్కృత భాషలో చేరిన ద్రావిడభాషా పదాలని కనుగొనడంలో కాల్డ్‌వెల్, గుండర్ట్, కిట్టెల్ ప్రారంభించిన కృషిని కూడా ఈయన కొనసాగించారు. ఇటీవల కాలంలో సుధీభూషణ్ భట్టాచార్యతో కలిసి ఈయన ఈ కిందిభాషలమీద పరిశోధన సాగించి గ్రంథాలూ, వ్యాసాలూ వ్రాశారు. పర్జీ, గోండీ మాండలికాలు, కువి, కూయిమాండలికం, పెంగో, మండ (పర్జీ, పెంగో, మండలు వీరి కృషివల్లనే ప్రపంచానికి తెలిసేయి). భట్టాచార్య స్వయంగా కొండ (కోరాపుట్ మాండలికం), నాయకీ (చాందా), గదబ (ఒల్లారి)లపై పరిశోధనలు చేసేరు.

ఎం. బి. ఎమెనో 1935—38 లో ఈ కిందిభాషలపై పరిశోధన చేశారు. కోత, తోద, కొడగు, కోలామీ, బ్రాహుయీ. ఎమెనో బరో కలిసి A Dravidian Etymological Dictionary (1961) తయారుచేశారు. ద్రావిడభాషలలో అర్థ వర్ణ సామ్యంగల సమాన పదాలని సంగ్రహించి 4572 సముదాయాలుగా వీరు ఇందులో ఇచ్చారు. దీనికి ఒక అనుబంధ గ్రంథాన్ని కూడా 1968 లో ప్రకటించారు. ఇందులో 889 కొత్త సమానపద సముదాయాలని ఇవ్వడమేకాక మొదటి గ్రంథంల్లో

చేరని అనేక పదాలని కూడా ఆయా సముదాయాలలో చేర్చి, చేర్పులు మార్పులు సూచించారు.

భద్రిరాజు కృష్ణమూర్తి తెలుగుధాతువులపై తులనాత్మక పరిశోధనచేసి వర్ణనిర్మాణ తులనాత్మక పరిశోధనతోనూ సమాన పదసంచయనంలోనూ కృషిచేశారు. వీరి రచనలో ముఖ్యమైనది 'Telugu Verbal Bases: A Comparative and Descriptive study'. అరకులోయలోని కొండజాతివారి భాషపై పరిశోధనచేసి ఆ భాషకి వ్యాకరణం, నిఘంటువుకూడా వీరు తయారు చేశారు.

ఎం. బి. ఎమెనో Dravidian Comparative Phonology (A Sketch) (అణ్ణామలైనగర్. 1970) వర్ణ నిర్మాణ తులనాత్మక పరిశోధనలో ఇంతవరకు జరిగిన కృషి ఫలితాలు వివరిస్తుంది. కాని పద నిర్మాణ తులనాత్మక పరిశోధన ద్రావిడ భాషలలో ఇంకా బాల్యదశలోనే ఉంది ఇందులో పేర్కొనదగిన రచనలు: ఎమెనో 'Toda, a Dravidian Language) (1957), 'The South Dravidian Language' (1967), పి. ఎస్. సుబ్రహ్మణ్యం, 'Two Problems in Panji verb forms' (1964), 'The Gender and Number Categories in Dravidian' (1969), 'The Personal Pronouns in Dravidian' (1968), 'Dravidian Verb Morphology (A Comparative study) (అణ్ణామలైనగర్ 1971).

సాహిత్యవంతమైన భాషలలో ప్రాచీన గ్రంథాలనీ శాసనాలనీ పరిశోధించి రచించిన గ్రంథాలలో ముఖ్యమైనది. ఎస్. అగస్త్యలింగం, ఎస్. వి. షణ్ముగం 'The Language of Tamil Inscriptions (1250—1350 A.D.)' (1970), ఎ. సి. శేఖర్ 'Evolution of Malayalam' (1953), ఎ. ఎన్. నరసింహయ్య, 'A Grammar of the oldest Kanarese Inscriptions' (1941), జి. ఎస్. గై 'Historical Grammar of old Kannada' (1946), గంటి జోగి సోమయాజి, 'ఆంధ్రభాషా వికాసము' (1947), కోరాడ మహాదేవశాస్త్రి, 'Historical Grammar of Telugu (1969).

సాహిత్య రహితమైన భాషలపై ఇటీవల వచ్చిన గ్రంథాలు: డి. ఎన్. శంకరభట్, 'Descriptive Analysis of Tulu' (1967), పి. ఎస్. సుబ్రహ్మణ్యం, 'A Descriptive Grammar of Gondi' (1968), భ. కృష్ణమూర్తి, 'Konda or Kubi, a Dravidian Language' (1969), టి. బరో, ఎస్. భట్టాచార్య, 'The Pengo Language' (1970).

## ఉపకుటుంబ విభజన

అతి ప్రాచీనకాలంలో ఒకే భాషగా ఉన్న మూల ద్రావిడ భాష ఇప్పటి ఇరవైయొక్క భాషలుగా ఏ విధంగా మారింది? అనే సమస్య పండితులని ఇటీవల కాలంలోనే ఆకర్షించింది. సాహిత్య రహిత భాషలపై వివరాలు సుమారు ఇరవై ఏళ్ళనించి మాత్రమే తెలుస్తూ ఉండడం సాహిత్యవంతమైన భాషలలోకూడా సమగ్ర పరిశోధనలు ఇటీవల కాలం లోనే ప్రారంభమవడం దీనికి కారణాలు. అంతకు ముందు కాల్డ్వెల్, జూల్ బ్లాక్ మొదలైన పండితులు కొన్ని భాషలు అతిసన్నిహితమైనవి, కొన్నిటి మధ్య ఎక్కువభేదం ఉంది అనే విషయాలు సూచించి తారతమ్య నిరూపణతో సంతృప్తిచెంది ఊరుకునే వారు. కాని సోదర భాషల చరిత్ర నిజంగా తెలుసుకోడానికి అవి మూలభాష కాలక్రమంలో ఎటువంటి మార్పులు పొందడంవల్ల ఏర్పడ్డాయో తెలుసుకోవడం ముఖ్యం. దీనికి మొదటి మెట్టు ఇప్పటి భాషలలో ఏవి అతిసన్నిహితంగా ఉండి, మూల భాషా కాలానికీ ఇప్పటికీ మధ్యకాలంలో ఒకే భాషగా ఉండేవో తెలుసుకోవడం. ఇది తెలుసుకోవడానికి రెండు లేక అంతకన్న ఎక్కువ సోదర భాషలలోఉన్న 'తుల్య పరిణామాలు' (Shared Innovations) ముఖ్యాధారం. ఒక పరిణామం రెండు సోదర భాషలలో తుల్యంగా ఉండి, మిగిలిన సోదర భాషలలో లేనట్టయితే అది ఆ రెండు సోదర భాషలూ విడిపోక ఒకే భాషగా ఉన్నకాలంలో ఏర్పడిందని ఊహించవచ్చు. కాబట్టి

మూలభాష విడిపోయిన తరవాతకూడా ఏయే సోదర భాషలు ఏకభాషగా ఉండేవో తుల్యపరిణామాల సహాయంతో నిర్ణయించవచ్చు.

ఈ సూత్రం ఆధారంగా తీసుకొని మూల ద్రావిడ భాష కాలక్రమంతో మూల దక్షిణ ద్రావిడ భాష, మూలమధ్య ద్రావిడభాష, మూలోత్తర ద్రావిడ భాష అనే మూడు భాషలుగా విడిపోయిందని పండితులు నిర్ణయించారు.

మూల దక్షిణ ద్రావిడ భాష కాలక్రమంలో ఇప్పటి తమిళం, మలయాళం, కొడగు, కోత, తోద, కన్నడం, తుళు భాషలుగా మారింది. మూల దక్షిణ ద్రావిడ భాషనించి తుళు మొట్టమొదట విడిపోయింది (పి. ఎస్. సుబ్రహ్మణ్యం 'The Position of Tulu in Dravidian', Indian Linguistics 29 (1968): 47–66). తరవాత కొంత కాలానికి కన్నడం విడిపోయింది. ఆ తరవాత కొంత కాలానికి మూల కోత—తోద భాష విడిపోయి అది కాలక్రమంలో, కోత, తోద అనే రెండు భాషలుగా చీలిపోయింది. ఇక మిగిలిన తమిళం మలయాళం కొడగు భాషలలో కొడగు ముందుగా విడిపోయింది (కొడగు కన్నడానికి సన్నిహితమని మొదట్లో భావించేవారు కాని యీ అభిప్రాయం సరికాదని ఈ మధ్యనే తేలింది) తరవాత తమిళం నించి మలయాళం 10 వ శతాబ్ది ప్రాంతంలో ప్రత్యేక భాషగా విడిపోయింది.

మూలమధ్య ద్రావిడ భాషనించి ఉత్పన్నమైన భాషలు తెలుగు, గోండీ, కొండ, పెంగో, మండ, కూయి, కువి, కోలామీ, నాయకీ, పర్జీ గదబ. (మొదట్లో తెలుగు దక్షిణ ద్రావిడ భాషగా పరిగణించబడేది కాని ఇటీవల కాలంలో తెలుగుమధ్య ద్రావిడ భాష అనీ దానికి గోండీ—కువి భాషలతో అతిసన్నిహితమైన సంబంధం ఉందనీ తేలింది, చూ. భ. కృష్ణమూర్తి, Telugu Verbal Bases, పి. ఎస్. సుబ్రహ్మణ్యం 'The Central Dravidian Languages,' JAOS 89 (1969): 739-750). మూలమధ్య ద్రావిడభాష మొదట్లో మూల తెలుగు—కువి, మూల కోలామీ—పర్జీ భాషలుగా విడిపోయింది. మూల తెలుగు – కువినించి మొదట తెలుగు, తరవాత గోండీ, తరవాత కొండ విడిపోగా మిగిలిన మూల పెంగో, మండ, కూయి, కువి మూల పెంగో—మండ, మూల కూయి—కువి అనే రెండు భాగాలుగా విడిపోయింది. ఆ తరవాత ఆ రెండు భాగాలూ పెంగో, మండ, కూయి, కువిలుగా మారేయి. మూల కోలామీ—పర్జీ మొదట మూల కోలామీ—నాయకీ, మూల పర్జీ—గదబ అనే రెండు భాగాలుగా చీలి అవి తరవాత కోలామీ, నాయకీ, పర్జీ, గదబ భాషలుగా చీలిపోయాయి.

మూలోత్తర ద్రావిడ భాషనించి మొట్టమొదట బ్రాహుయీ విడిపోయింది. ఆ తరవాత చాలాకాలంవరకూ కూడుఖ్, మాల్తో లు కలిసేఉండి అవి ఇటీవల కాలంలోనే వేరు భాషలుగా మారేయి. ఈ కారణంవల్లనే కూడుఖ్—మాల్తోలమధ్య అతి సన్నిహిత సంబంధం స్పష్టంగా కనిపిస్తూ ఉండగా బ్రాహుయీకి వీటికీ అనేక విషయాలలో భేదం గోచరిస్తుంది.

పై చర్చలో యీ ఉపకుటుంబ విభజనకి గల ఆధారాలు విస్తరభీతివల్ల చెప్పలేదు. వాటిని గురించి తెలుసుకోగోరేవారు పి. ఎస్. సుబ్రహ్మణ్యం 'Dravidian Verb Morphology (A Comparative Study)' (Annamalai University, Annamalainagar 1971)–Appendix: Subgroups in Dravidian (505–531) చూడవచ్చు.

# జానపద సాహిత్య సంపద - కోలాటపాటలు

శ్రీ ఎస్. గంగప్ప

పామర ప్రజలకు వినోదం, ఆనందం కలిగించడమే గాక పనిలోని శ్రమను పోగొట్టడం గూడ జానపద సాహిత్య ప్రయోజనమన్నది సర్వజన విదితమే. నాట్లు వేసేటప్పుడు, కలుపుతీసే సందర్భంలో, కోతలుకోసే సమయంలో, విసుర్రాయి విసిరే వేళ—పాటకజనం పాడుతూంటే, శ్రమ, బాధ తొలగిపోయి, ఆనందం కలగడం సహజమే. కాని కోలాట విషయం అలాకాదు. అందులో పాల్గొన్న వాళ్ళకు శ్రమ, చూచేవాళ్ళకు వినోదానందాలు కలగడం జరుగుతుంది. మరి అలాంటప్పుడు శ్రమ పొందడానికి ఎందుకు కోలాటలో పాల్గొనాలి అనే ప్రశ్న ఉదయించడం సహజం. కాని ప్రేక్షకులకు వినోదానందాలు చేకూర్చి కాలక్షేపానికి పాటుపడే కోలాటగాళ్ళు, ఆడి, ఆడి అలసిపోయి చెమటలు గక్కుతూ, శ్రమపడిపోయి శారీరకవ్యాయామం చేసిన ఫలితాన్ని పొందడం చాల ప్రధానవిషయం. తాము కాలక్షేపంతోపాటు సంతోషం పొందడం అన్న ఆను షంగిక ప్రయోజనంగూడ కలదు. ఇట్లా కోలాట ఉభయత్ర ప్రయోజనకారిగా ఉన్నదని స్పష్టమవుతుంది.

సర్వసామాన్యంగా పల్లెటూళ్లలో జరిగే ఉత్సవాల్లో, పండగ పబ్బాల్లో కోలాటకు అవకాశం ఎక్కువ. పల్లెటూరి ప్రజలకు అవే తీరికసమయాలు. పండగ పబ్బాలు, ఉత్సవాలు రాబోతున్నాయనగానే కోలాట, పాటనేర్చిన ఒక వ్యక్తిని కుదుర్చుకుని ఉత్సాహవంతులైనవాళ్ళు ఒక జట్టుగా ఏర్పడి కోలాట నేర్పించుకొంటారు. అందరు బాగుందని అంగీకరిస్తే ఆట ఆడుతారు; లేదా కోలాటవేస్తారు. కోలాటము కోలన్న అని గూడ అంటారు. కోలాటలో ఆట, పాట అనే రెండంశాలు చేరిఉంటాయి. ఆటగాళ్లు ఉద్దులుద్దులు (జతలు జతలు)గా వర్తులాకారంలో ఏర్పడి కోలలపై క్రమపద్ధతిలో కొట్టుతూ, అవసరమైతే తమ చుట్టూ తాము తిరుగుతూ, గుండ్రంగా తిరుగుతూ ఆడుతూంటారు. కోలాట నేర్పినవ్యక్తి వాళ్లమధ్య ఉంటూగాని, లేదా వాళ్లతో ఒకడైగాని ఆటను కొనసాగిస్తాడు. దీనినే కోలన్నవేయడం అని గూడ వ్యవహరిస్తారు. కోలలను కోలన్న కట్టెలు అనే వాడుక గూడా వుంది. కోలాటగాళ్లు కాళ్లకు గజ్జెలు గట్టుకొని ఆడుతారు. ఆటలో మువ్వల సవ్వడి శ్రుతికాగా, కోలల శబ్దాలు తాళం కాగా, కమ్మగా కంఠమెత్తి, కోలన్నపాట పాడుతూ, ఉత్సాహంతో, ఊపుగా ఆడుతూంటే అమాయకమైన, అరమరికలేని అనురాగపూర్ణహృదయులైనవాళ్ల ఆటనుచూచి ఆనందించవలసిందేగాని చెప్పవీలుగాదు. మన నాగరకత బలిసి కేశాలంకరణ స్త్రీలలోనే మిగిలిపోయిందిగాని పూర్వం పురుషులు గూడ శిరోజాలు తెగబారెడు పెంచి, జుట్టు ముడివేసి, పూలు పెట్టి సంతోషించేవాళ్లు. కోలన్న వేస్తున్నప్పుడు గంతులువేస్తూఉంటే జుట్టు, జుట్టుతోపాటు పూలు ఎగురుతూంటే ప్రజలు పొట్టచెక్కలయ్యేట్టు నవ్వుతూ ఆనందించేవాళ్లు. ఇది పల్లెటూళ్లలో పరిపాటి అయిన విషయం. కాని తదితర జానపద సాహిత్యంలాగే ఇట్టి కోలన్నపాటలు గూడ — పాట లేమి, కోలాటే — క్రమక్రమంగా సన్నగిల్లిపోతూ ఉండడం అందరికీ తెలిసిన సంగతే. అందుకు కారణం ఆధునిక యుగలో మానవజీవితం యాంత్రికంగా తయారుకావడమేనని మనం గమనించవచ్చు. ఇట్టి కోలాట పాటలను సేకరించడం చాల అవసరం.

ఇతర జానపద గేయాలలాగే కోలాట పాటలను సేకరించడంలో మేమూ ప్రయత్నించాము. ఈ సందర్భంలో రాయలసీమ జానపదసాహిత్యోద్ధారకులు డా. తూమాటి దొణప్పగారి కృషిని ప్రశంసించడం ఉచితయినా అవసరం. వారే దీనికి మార్గదర్శకులవడం సముంచితము.

ఈ క్రింది పాటలు పాడినవారు శ్రీ కోలాట రామప్ప (సోమందేపల్లి, పెనుకొండ తాలూకా). ఆరంభంలో ఈపాట పాడడం ఆయనకు పరిపాటి.

'కోలు కోలన్న చెలియ మేలుకోలన్న ||కోలు||
ఒక్కడే రామప్పనాయుని కొక్కడే కుమారుడంట
మరోపాళెము సుళ్లదొర్లకు చుక్కవంటి అల్లు
డంటా ||కోలు||
బుక్కపట్నం బూసిదొర్లకు ముద్దుగా మేనల్లు
డంటా
కోలు కోలన్న చెలియ మేలుకోలన్న ||కోలు||'

—ఈ పాటలో తనపేరు రామప్ప అనీ, తన నిక్కైక పుత్రుడు సురేపాలెము, బుక్కపట్నాలకు అల్లుడు, మేనల్లుడు అయినట్లు ప్రారంభంలోనే తెలుపడం జరిగింది. 'చుక్కవంటి అల్లు'డనే ప్రయోగం గమనించదగింది.

కానుకలిమ్మని ఊరిపెద్దలను అడగడంలో వినమ్రత, అణకువ, కొంతవరకు బిడియంతో ఇలా అర్థించాడు.

'అందరివాలె అడుగలేమురా గోపాలబాల
కొందరివాలె కొసరలేమురా
అందరివాలె అడుగలేము కొందరివాలె కొసరలేము
ఒకనితోన 1ఓగులుచేసీ 2వరమాళ్లే అడుగలేదు
||అందరి||
ఏడాది 3కొకపట్టే వుగాది పండగా
ఉగాది పండగ 4ఎవ్వానికి ఏమిలేదు.
పచ్చల సమరుబాకు కుదిరించు నాస్వామి ||అందరి||
చిన్నవానిది పెండ్లయింది అడుగున నాకు సిగ్గయి
తుంది ||అందరి||
పాడి ఎనుము పట్టెమంచము
చిలుకుతాడు చేపించుస్వామి ||అందరి||
6ముచ్చట 7కొగిటి కుచ్చాలు దండా
ముంజేతి కొగటి వెండికడియమూ
9బండనరము పచ్చనవరము చాలుస్వామి ||అందరి||'

—ఇట్లా మొదటే అందరిలాగా అడగలేనని, కొందరిలాగా కొసరలేనని అంటూనే తన కోరికలన్నీ విన్నవించుకోవడంలో అతని నమ్రత స్పష్టమవుతుంది. ఈ విధంగా అడగడంలోనే అమాయకుల నిర్మల హృదయాలు, చమత్కారం గూడ [illegible]వరిస్తాయి.

ఈ క్రిందిపాట మహావేగంతో పాడుతూ కోలాటలో చమత్కారం చూపడం జరుగుతుంది.

'అమ్మారో పూలమ్మే దాన్ని పిలువ రాదమ్మ
భామరో పూలమ్మే దాన్ని పిలువరాదమ్మ
||అమ్మారో||
వీపున విరజాజా తేమొ కలిగిన వాడమ్మ
కాళిన కాలందియేమొ కలిగిన వాడమ్మ
భూజాన భూచక్రాలు కలిగిన వాడమ్మ||అమ్మారో||

—ఇందు 'అమ్మారో పూలమ్మే దాన్ని' అని కొందరు పాడిన వెంటనే మరికొందరు 'పిలువ రాదమ్మ'—అంటూ జోడించి పాడుతూ వేగంతో ఉత్సాహాన్ని, ఉత్సాహంతో వేగాన్ని ప్రకటిస్తూ గంతులువేస్తూ ఆడుతూంటే మహదానందంగా ఉంటుంది ఇలాంటి వేగంతోనే పాడేపాట మరొకటి వుంది ఆంగ్లేయులు మన దేశానికివచ్చి, తమ అధికారాన్ని స్థిరపరచుకొన్న వెనుక క్రొత్తగా మన దేశంలో రైలు ప్రవేశపెట్టబడింది. ఆ సమయంలో క్రొత్తదైన రైలును జూచి పామరకవి కట్టినపాట యిది.

---

1. వగలు; 2. వరములు; 3. ఒక పట్టే—ఒక పర్యాయము; 4. చెప్పమునకు; 5. అడుగుటకు; 6. ముచ్చటకు; 7. ఒకటి; 8 కడియము; 9. మంచి పగడాలతో కూర్చిన పెద్ద దండ (పూర్వం ధరించే వాళ్లట).

'బండీరా [10]పగబండీరా దొరలెక్కేది రైల్‌బండీరా
దొరసాన్లెక్కేది బండీరా దొరసానులెక్కేది బండీరా
రాణీలెక్కేది బండీరా రాజాలెక్కేది బండీరా
[11]జాతోడెక్కేది బండిరా బండిరా పగబండీరా
బండిమాస్తీ యినుమురా దానికూత ఎంత
నయమురా
బండీ ఎంత నయ్యమురా దానికూత ఎంత
చక్కనరా ॥బండీరా॥

—ఇందు ఆశ్చర్యచకితుడైన పామరకవి హృదయం స్పష్టమయినది. పైగా అది ఆరంభదశ కావడంవల్ల తెల్లవాళ్లలో దొరలు, దొరసానులు, రాజులు, రాణులు మొదలైన గొప్పవాళ్లకుమాత్రమే రైలు పరిమితమై ఉండడంగూడ గమనార్హం. తెల్ల దొరకు 'జాతోడు'అని నామకరణం గావించడంకూడ చాల బాగున్నది; భారతీయుడుగాక ఇతరజాతివాడని దీనికి అర్థం కాబోలు! 'బండీరా'అని కొందరు పాడినవెనుక అమితవేగంతో ఏమాత్రం వ్యవధిలేకుండా తక్కినవాళ్లు 'పగబండీరా' అని అందుకొంటూ పాడుతూ గంతులువేయడం ఆటగాళ్ల అమితోత్సాహానికి నిదర్శనం! ఇట్లే తక్కిన పాటంతా పాడడం జరుగుతుంది.

శృంగార సంబంధి అయిన కోలాట పాటలు అధిక సంఖ్యలో వున్నాయి. ప్రియా ప్రియులవిరహం, కలయికవల్ల కలిగిన కష్టనష్టాలు, అయినా ప్రేమను వదలుకోలేక, పూర్తిగా పొందములేక పడేవేదన, పరస్పర త్యాగం మున్నగు భావాలు శృంగార సంబంధమైన పాటలలో అభివ్యక్తమవుతాయి. ప్రేయసి ప్రియుని వదలి ఉండలేనని జంటగానే ఉంటే హాయిననుభవించవచ్చునని ఈ కింది పాటలో చెప్పుతూంది.

' కరిబెల్లమేసిప్సి కజ్జాయమురుకులు
గంటులేకట్టంపుడూ వరసా మూటలేకట్టంపుడూ
మరిచి నేనెట్లుందురా నరసా మాలకా పట్నమందూ
వెండిదీ[13] చిక్కంటి పగిడి దీ దువ్వాస[14]
[15]కొబ్బెరినూవి సీసా
నీ వెంటనే తెస్తుంటిరా నరసా జంటగా హొస్తుంటిరా ॥మరచి॥ ॥కరిబెల్లమేసిప్సి॥
పెనుగొండ సంతకు పేటంచు[16]రైకకు
మన యిద్దరమూ పోతుంటిమో నరసా జంటగా
పోతుంటిమో ॥మరచి॥
కొడికండ సంతకు కొబ్బెరి బెల్లానికి
మన యిద్దరమూ పోతుంటిమో నరిసా జంటగా
పోతుంటిమో ॥మరచి॥
గోరంట్ల సంతకు గోటంచువంచెకు
మన యిద్దరమూ పోతుంటిమో నరసా జంటగా
పోతుంటిమో ॥మరచి॥ ॥కరిబెల్ల॥

—ఇట్లు నాయిక నాయకుని యందలి మరులు విరుల సువాసనల నాఘ్రాణించడానికై పడే తహతహ స్పష్టంచేయబడింది. ఇందులో పెనుగొండ, కొడికొండ, గోరంట్ల—అనే దగ్గర ఊళ్లపేర్లుకూడ తెలుస్తున్నాయి.

ఇట్లే ఒకతె 'కముగుట్లకొండమీద' తాను వలచినవానిని కలుసుకోవడంవల్ల అపవాదు, దానివల్ల ఇంటాబయటాకూడా బాధ కలిగిందని తెలుపుతూంది.

'చిన్నిదో చిన్నిదాన్నిరా
కముగుట్లకొండమింద కలిసి నా స్వామి
చిన్నిదో చిన్నిదాన్నిరా
వజ్రాలుతెచ్చి వాగిట్లోనేపోసి
వదినా మరదండ్లతో [17] వాదొచ్చె రాజా ॥చిన్నిదో॥
పగడాలుతెచ్చి పంచలోనేపోసి
బావమరదులతో [18] బాదొచ్చె రాజా ॥చిన్నిదో॥
ముత్యాలుతెచ్చి ముంగిలిలోపోసి
ముండమోపులతోన వాదొచ్చె రాజా ॥చిన్నిదో॥
[19]దావులో [20]గూకోని దోసిలొగ్గుకోని
దోపూరి దొరబిడ్డ గురికాలుపాలాయ ॥చిన్నిదో॥

10. పొగబండి; 11. ఆంగ్లేయుడు
12. కరి — నల్లని; 13. చిక్కంటు;
14. దువ్వెన; 15. కొబ్బెర; 16. రవిక
17. వాదు వచ్చినది; 18. బాధ వచ్చినది
19. త్రోవలో; 20. కూర్చుండి.

—పాపం చివరికి ఆతనినే నమ్ముకొన్నందుకు తనగతి అధోగతి అయినదని విలపించినది.

ఈ క్రింది పాటలో ప్రియురాలు తన కోర్కెలను దెలిపి వాటిని తీర్చవలసిందని ప్రియుణ్ణి మొరబెట్టుకొంటూంది. ఇందులో అనంతపురం, పామిడి, ధర్మవరం, గుత్తూరు మున్నగు ముఖ్యమైన ఊళ్ళపేర్లు వాటి ప్రసిద్ధిగూడ స్పష్టం చేయబడింది.

'అదిగదిగో అనంతపురము అంచనా వెంకా వనము
ప్రక్కలోనే పామిడేరన్నా
ఓయమ్మ [21]జాన వాట్టి కొవ్విరి [22]వాలలాడన్నా
ధర్మారము సంతలోనా దండిగా పూలుండా యిగాన
నా కొక్క దండపంపరా
ఓయమ్మ జాన చాలుకుంటే చైనాలంపురా
గుత్తూరి సంతలోనా [23]గుండ్లు దండాల్లు
చాలగవ్వూ
నాకు వొక్క దండ పంపరా
ఓ యమ్మ జానా చాలుకుంటే చైనాలంపరా
॥అదిగదిగో॥

ఈ క్రింది పాటలో కోలన్న వేర్చిన వగకాడు వగలాడి అంగచందాలను మెచ్చుకొంటున్నాడు –

[24] తుమ్మీదలుండా ఏమిరా
దాని కురులూ[25] కుసుళ్ళు పైన [26]దామిరాలుండా
ఏమిరా
కోలన్న కట్టే చేతిలోన కోడిపుంజొక చంకలోన
కోలన్నచేతవుంటే [27]కోలుకానిమనసు ఎట్లావుండు
॥తుమ్మీద॥
ఇను కినుకదిన్నాలలోనా ఇమ్మైన రొమ్ములపిల్లా
[28]సోజ్యమైన జొన్న సేనులోన సొగసుగత్తె
జగడాసికొచ్చా ॥తుమ్మీద॥
అట్లవచ్చా [29]చుట్టుగాలి ఇట్లే లొక్కితీ
రేణిముల్లా
ఒంగిముల్లా తియ్యబోతే కన్నిప్రాయమే
కదిలిపాయ ॥తుమ్మీద॥

ఇందులో పామరకవి కవిత్వ మధికంగా గోచరిస్తుంది. 'తుమ్మెదలవంటి కురులు, సొగసుగత్తె, కన్యప్రాయము' మొదలైన పదాలు ప్రయోగించి, అంగాంగవర్ణన గావించు ప్రబంధ కవికంటె పామరకవి చాల మనోహరంగా, సున్నితంగా వర్ణించడం మనం గమనింపవలసిన ముఖ్యవిషయం. పామరకవితకిది పరకోటి అవడం సాహసం కాజాలదు.

సంకేతంతోపాటు ధ్వని, వ్యంగ్యంగూడ పామరుల కవిత్వంలో లేకపోలేదు. ధ్వని, వ్యంగ్యం ఉన్న కావ్యం చాల ఉత్తమమైనదిగా చెప్పబడుతుందిగదా మరి? అట్టి కవిత కీ క్రిందిపాట నిదర్శనం. తనను కాదని మరొక ప్రియుని జేరినదేమోఅనే అనుమానంతో ఒకడు ప్రశ్నిస్తే దానికి సమాధానం నాయిక వ్యంగ్యంగా చెప్పడం గమనార్హం.

ఆమె : అంతరంగా నాగుతోట ఆకుతోటలో
నిమ్మతోట
నిమ్మతోటలో బొమ్మలాటరా
ఓ రెరికిరీ ! నిమ్మతోటలో బొమ్మలాటరా
అతడు : ఇప్పుకుంటి వింటిలోన నీ కొప్పు లో
పూలెక్కడా వీ
ఆమె : పొందులో జాలారికొమ్మురా
ఓ రెరికిరీ ! కొమ్మ [30]జాడిసి కొప్పు
నిండారా ॥అంత॥
అతడు : రాచేటి చిన్నదానా రాయికంటె గట్టిదానా
రావె రాగిమాను క్రిందికో
ఆమె : ఓ రెరికిరీ !.........మాటలాడేనో
॥అంత॥

---

21 జాణ, 22. ప్రేలాడు, 23. గుండ్ల దండలు, 24. తుమ్మెదలు, 25 సందిట ధరించు ఒక ఆభరణము కావచ్చును. 26. తామర కాబోలు. 27. ఈ సందర్భంలో వగలుకాడు కావచ్చును. 28. ఆశ్చర్యమైన; 29. సుడిగాలి. 30 జడిసి, తలించి.

మంచిదీ మావోళ్లుపిల్ల [31]మజ్జిక్కంట
నేమపోతి
అంతలోనే పొద్దుమునిగెరా ॥అంత॥
బాయిలోన [32]బొల్లి [33]పలికెరా బండసరము
కొలికలూడ
బిల్లలమ్మ తాడు తెగిరా ఓ రెరికిలీ బిల్ల
అమ్మతాడు తెగిరా
కట్లుకట్లు ఎదురుగట్టి కాముగొండ
తేరుకట్టి
తేరుకన్నా రాకపోయేనా
ఓ రెరికిలీ! తేరుకన్నా రాకపోయేనా ॥అంత॥
బొగ్గులాకి రంగులాయె [34]మొగిలిచెండ్లు
రేకులిడిగ
[35]వాసనాకి [36]మొబ్బు [37]కప్పెరా
ఓ రెరికిలీ! వాసనాకి మొబ్బు కెప్పెరా
॥అంత॥

కల్లమింద కాకిపిల్ల నా పేరు నాగిపిల్ల
చేతిలోని దేగపిల్లేరా!
ఓ రెరికిలీ! చేతిలోని దేగపిల్లేరా ॥అంత॥'

— ఇందులో కొప్పులో పూలెక్కడివని అతడడిగితే కొమ్మ జడిసికొప్పునిండిందని ఆమె సమాధానం. బల్లి శకునంగూడ ఆమెకు బాగా తెలిసినట్లుంది. అత్తసితో కొంతవరకు వ్యవహారం బెడిసిపోగా 'కాముగొండతేరుకు అనగా రథోత్సవానికి రాకపోతావా?' అని ఆమె భావిస్తోంది. మొగలిచెండ్లు రేకువిడగా నల్లని బొగ్గులకు రంగు వేసినట్లయినదని, వాసనకు మబ్బు కప్పుతుందని ఆమె బాధపడుతూంది. 'వాసనకు మబ్బుకప్పెను' అనగా మొగలిరేకుల పరిమళం ఉండీలేనిదవుతుందని ఆమె భావం. కాకిపిల్లను పేర్కొంటూ తనపేరు 'కల్లమింద కాకిపిల్ల నా పేరు నాగిపిల్ల' అని సంకేతం చేస్తోంది. ఇంకా ఆ 'నాగిపిల్ల చేతిలోని దేగపిల్లట!' ఇంతకంటె సొగసుగా, నాజూకుగా కవిత్వం చెప్పడం సాధ్యమా? ఇందులో ఉక్తివైచిత్రి, వ్యంగ్యం, ధ్వని, సంకేతం—అన్నీ ఒకచోట కలిసి సహృదయ హృదయ రంజకంగా ధ్వనిస్తూ, ఆనందాపాదియై ఉన్నవనడం సహజమే! ఈ విషయంలో జానపద సాహిత్యం ప్రౌఢ సాహిత్యంతో ఏ మాత్రం తీసిపోదు పైపెచ్చు పాండిత్య ప్రకర్ష, ఛందోజ్ఞానం లేని పామరుని నోటినుండి వెలువడిన ఈ మాటలు దానికంటె సర్వవిధాలా శ్రేష్ఠమైనవనే చెప్పాలి.

ఒక్కో తన ప్రేమను, త్యాగాన్ని ఒకతె ఇలా తెలియజేస్తోంది—

'నిన్ను నేను మరువలేనురా
నా చక్కని సరిహాల గొండ్లసామి అమాసలింగా
నిన్ను నేను మరువలేనురా
నీ పొందెడ బాయలేనురా
ఉంటే ఈ వూరిలో ఉండు పోతే మీ వూరికి పోరా
చుట్టుపట్టు [38]పల్లెల్లోవుంటే చూడక మనసు
వుండదు ॥నిన్ను నేను॥
కూలిపోతే నా సేనికి రారా! నాలిపోతే నా పేనికి
రారా

నీ మునుము నా మునుమూ నేనె కోసి
[40]కోసిని మూనాలు కట్లుకట్టి
కట్లలన్నీ నే గూటికిపెట్టి గూట్రికిందనిను
గూర్చుండబెట్టి
నాకు తెచ్చిన దుత్త [41]అంబలిపోసి కన్నాలుచూతు
॥నిన్ను నేను॥'

— ఇందామె ప్రేమైకజీవి అని స్పష్టమవుతుంది. ఉంటే తన ఊరిలో పోతే వాని ఊరికి— లేకపోతే చుట్టూ ప్రక్కపల్లెలలో ఉండడానికి

31. మజ్జిగకొరకు, 32. బల్లి, 33. పలికినది, 34. మొగలి, 35. వాసనకు, 36. మబ్బు, 37. కప్పు. 38. పల్లెలు, 39 చేనుకు 40. కోసిన, 41. అంబలి.

పిల్లోడట తనవద్దనే ఉంటే ప్రియుని పనులన్నీ తానే చేస్తుందట! అంతటి దామె త్యాగం!

దేవతలపై పాడినపాటలుగూడ లేకపోలేదు. నరసింహస్వామి పై చెప్పబడిన దీ క్రిందిపాట—

'ఒడిఒడీగంధాలు మెడనిండ [42]వనమాలు
[43]మగమాల చిన్నపోయినదీ నరసింహా మగమాల [44]కలదప్పినాదీ
[45]యాడవడిపోయెనో ఎరగ నీ వనమాలు ఎవరిల్లు చేరినాదో
కూర్చిన్నీ [46]ముత్తాలు కుచ్చుచేసినిదండ
బంగారిగుండ్లు పేరన్నా నరసింహా బంగారిగుండ్లు పేరన్నా ॥యాడవడి॥ ఒడిఒడీ॥
[47]దావనావుండేటి ద్వారపాలకులార మీరన్న చూడలేదా
వనమాలు మీరన్న కానలేదా ॥యాడవడి॥
గరగరనా తిరిగేటి [48]గరకమంతుల్లార మీరన్న చూడలేదా
వనమాలు మీరన్న చూడలేనా
॥యాడవడి॥ ఒడిఒడీ॥'

దీనికంటె శ్రీకృష్ణలీలావిలాసాలు వర్ణించే పాట ప్రధానమైంది. కృష్ణుడు లీలామానుష విగ్రహుడుగదా! కృష్ణుడు బాల్యంలో గొల్లవారిండ్లలో చేసిన ఆగడాలు అన్నిన్ననరాదు. ఆ ఆగడాలు భరించలేక యాదవస్త్రీలు యశోదతో మొరబెట్టుకొన్న ఘట్టం వారి ప్రసిద్ధమైనదేగాదు, మిక్కిలి ప్రచారం గలదికూడ. అందుకు నిదర్శనం ఈ క్రింది పాట—

'అమ్మనినవె యశోద నీ వరతనయుడా
చేసిన్ని పనులు [49]విచారించపోతే భారతము భాగవతమాయెనో
ఎట్లనే తల్లీ ఎట్లనే యశోదమ్మా ఎట్లనే ॥అమ్మ॥
చిలిపి వానికి యిన్ని చేష్టలు ఎన్నడూ ఎరుగాము మేము
పనులు విచారింపబోతే భారతము భాగవతమాయనో
ఎట్లనే తల్లీ ఎట్లనే యశోదమ్మ తల్లి ఎట్లనే ॥అమ్మ॥
నిన్న [50]సందివేళలో మా కన్నె[51] చిన్నది జలక మాడగ
కన్ను [52]తిప్పులుపెట్టి చెక్కునొక్కి పరుగెత్తి వచ్చినాడంట
అడగవే తల్లీ! అడగవే యశోదమ్మ తల్లీ అడగవే
అమ్మా గొల్లపిల్ల వాండ్లగూడి వీదులంబడి ఆటలాడగ
[53]ఒక్కుముద్దిమ్మాని రక్కసివలె చెక్కునొక్కితే ఒక్కు[54]పాల్లు సోకెనేమో? ఎరుగనేతల్లీ ఎరుగనే
యశోదమ్మ తల్లీ ఎరుగనే
నిన్న[55]పద్దన లేచి మాచెలి పెరుగు చిలుకుతుండగా
[56]చారుడూతో పెరుగుతీసి జారి పరుగెత్తి వచ్చినాడంట
అడగవే తల్లీ! అడగవే యశోదమ్మ తల్లీ అడగవే
ఏమిరా మనా చిన్నితనయా నీ కడిగివంత
వెన్నముద్ద ఇస్తుగదరా కన్నకొడుకా
గొల్లవారిండ్లలోనా [57]దొంగరిచ్చొస్తీవంట
ఏలరా తనయా! ఏలరా!
అమ్మనాకొల్లీ [58]దేవినాకితిపి దేవుడేమో [59]తినిపోతే
జారి నాపై ఏసినాడే తల్లీ! ఏసినాడో.'

—ఇందులో బాలకృష్ణుని చిలిపి చేష్టలు పామరకవి చక్కగా వివరించాడు. సామాన్యంగా ఏదైన పని అతిగా మితిమీరితే 'రామాయణమైందే' అనడం లోకసహజం! కాని ఇక్కడ పామరకవి కృష్ణుడు

42. వనమాల, 43. మొగమేల, 44. కళ, 45. ఏడవడిపోయెనో, 46. ముత్యాలు, 47. దోవ–త్రోవ, 48. గరుత్మంతులార. 49. విచారింప, 50. సంధ్య 51. కన్నె 52. తిప్పలు, 53. ఒక్కి 54. పల్లు, 55. ప్రొద్దున, 56. చారెడు. 57. దొంగిలించి వచ్చితివట, 58. దేవుట–పాత్రలో చేయివెట్టి దేవుట, 59. తిని.

'చేసిన పనులు విచారింపబోతే భారతము భాగవత మాయనో' అని పల్కడంలో ఎంతయినా ఔచిత్యం ఉన్నది. కృష్ణ సంబంధి కథలు భాగవత భారతాల లోనేగదా ఉన్నాయి మరి? అందుచేతనే రామాయణమైందని పేర్కొనలేదు. కాని ఇదయినా మనం విమర్శనాత్మక దృష్టితో మెచ్చుకొనేదేగాని పాపం! పామరకవి ఇంత ఆలోచనాత్మక దృష్టితో పాటకట్టి ఉంటాడనడం సత్యదూరం! ఏమైనా సున్నితమైన పదప్రయోగంతో నాజూకుగా చెప్పడం నిజమైన మౌలికత (originality) గల కవికిమాత్రమే సాధ్యమవుతుందనడం సమంజసం. అట్టిదీ జానపద కవిలో కలదు.

ఇట్లు జానపద సాహిత్యంలో కోలాట పాటలకుగూడ ఒక ప్రత్యేక స్థానం కలదనడం పై పరిశీలనవలన స్పష్టమయినది. ఇలాంటి పాటలుపాడుతూ పండగ పబ్బాలలో, ఉత్సవాలలో జానపదులు సంతోషిస్తూ పూర్వం హాయిగా కాలం వెళ్ళబుచ్చుతూ ఉండేవాళ్ళు. మరి జీవితం యాంత్రికంగా మారిపోయిన ఈ ఆధునిక యుగంలో కోలాటలాడేవాళ్ళు కరువైపోయారు; తీరికాలేదు; ఒకవేళ ఉండిరా చూచి ఆనందించేవాళ్ళు లేక్కున; అవకాశంగూడ లేదు. కనుకనే ఈ జానపద సాహిత్యం సాధ్యమైనంత వరకు సేకరించి నిజమైన తెలుగుదనం, నుడికారం పలుకుబళ్ళు మొదలైన వాటిని పరిరక్షించి రాబోవు తరం వారికందివ్వడం ప్రతివ్యక్తి చేయవలసిన ప్రథమ కర్తవ్యం! అందుకై అందరు ప్రయత్నిస్తారని ఆశిస్తున్నాను!



# ప్రాచీన ఈజిప్టులో మతం

శ్రీ శిష్ట్లా కాళిదాసు

ప్రాచీన ఈజిప్టు దేశంలో క్రీ. పూ. 3000 సంవత్సరాలనాడే ఒక ఉత్కృష్టమైన నాగరికత విలసిల్లింది. ఇది ప్రపంచ చరిత్రలో అతిముఖ్యమైన నాగరికతలలో ఒకటి. ప్రాచీన గ్రీకు, రోమను నాగరికతలు తద్వారా ఇతర నాగరికతలూ యీ నైలునదీ నాగరికతవల్ల చాలా ప్రభావితమైనాయి. మొట్టమొదటి నాగరిక సమాజం ఈజిప్టులోనే ఉదయించిందని చాలామంది చరిత్రకారుల అభిప్రాయం. దాదాపు మూడువేల సంవత్సరాలు అవిచ్ఛిన్నంగా సాగిన యీ నాగరికత ప్రపంచంలో అనేక విషయాలకు దారిచూపటమేకాక కళలూ, సంస్కృతిలో అఖండమైన అభివృద్ధిని సాధించింది. ఇతర నాగరికతలలోలాగే ఈజిప్టు ప్రజాజీవితంలో మతం, మత విశ్వాసాలూ అతిముఖ్యమైన స్థానాన్ని ఆక్రమించాయి. నిజానికి ఈజిప్టులోని ప్రతివ్యవస్థ, ప్రతిసంప్రదాయం మతవిశ్వాసాలతో ముడివడి వున్నాయి. ఈ మత విశ్వాసాలను తెలుసుకోవటం ద్వారా ప్రాచీన మానవుడి మతస్వరూప స్వభావాలు మనకు తెలుస్తాయి.

ప్రతినాగరికత అది విలసిల్లిన ప్రదేశాన్నిబట్టి, భౌగోళిక విశేషాలనుబట్టి తన ప్రత్యేకతను సంతరించుకుంటుంది. అట్లాగే మత విశ్వాసాలు కూడా భౌగోళిక పరిస్థితులమీద చాలావరకూ ఆధారపడి వుంటాయి. ఈజిప్టు ప్రజల జీవితంలో అతిముఖ్యమైనది నైలునది. అట్లాగే ఈజిప్టులోని శీతోష్ణ పరిస్థితులు. అక్కడ ఏ వస్తువు కుళ్ళిపోవడం, ఎక్కువ పాడయి పోవటం జరుగదు. ఈ రకంగా ప్రతివస్తువుకు కొంతవరకూ శాశ్వతత్వం కలిగింది. రాతియుగంనుంచీ మానవుడు, సూర్యుణ్ణి, సూర్యశక్తిని జీవన హేతువులుగా గ్రహించాడు. ఈ రకంగా నైలునదీ, 'శాశ్వతత్వం', సూర్యుడు— ఈజిప్టు మతానికి ప్రాతిపదికలు అయ్యాయి.

## మత విశ్వాసాలు

ఒక మతాన్ని గురించి తెలుసుకోవాలంటే ముందుగా ఆ మత విశ్వాసాలను గురించి తెలుసుకోవాలి. ఈజిప్టు ప్రజలు పరలోకంలో విశ్వాసం వున్నవారు. మరణానంతరం పరలోకానికి వెళ్లటం, అక్కడ భోగాలు అనుభవించటం జరుగుతుంది. ఈ పరలోకానికి వెళ్లేది 'బా' అనే పదార్థం. 'బా' అనేది ప్రతిమనిషికీ ఉంటుంది. మరణానంతరం అది సమాధివద్దకానీ, పరలోకంలోగాని ఉంటుంది. 'బా' అంటే ప్రేతాత్మ అని మనం అర్థం చెప్పుకోవచ్చు. ఇది మానవ శిరస్సుతో పక్షిరూపంలో వుంటుందని వారి నమ్మకం. ఇలాంటిదే వేరొక ప్రేతరూపం 'కా' అనేటటువంటిది. 'కా' ప్రతి మనిషితోనూ పుడుతుంది. ఇది ఒక రకమైన శక్తిలాంటిది. ఇది సర్వదా మనిషితోవుండి అతడిని కాపాడుతూ వుంటుంది 'కా' శరీరాన్ని వదలివేస్తే మరణం సంభవిస్తుంది. మరణానంతరం భౌతిక దేహాన్ని వదలి 'కా' పరలోకం వెడుతుంది. 'బా' 'కా'ల తత్వాలను గురించి పండితులలో అనేక భేదాభిప్రాయాలు ఉన్నాయి. (ఈజిప్టు మతంలో యీ రకమైన, పరస్పర విరుద్ధమైన నమ్మకాలు అనేకం ఉన్నాయి). ప్రాచీన ఈజిప్టు జనులకు

శాశ్వతమైన ఆత్మపదార్థాన్ని గురించి తెలియదని బ్రెస్టెడ్ పండితుని అభిప్రాయం.

పరలోకాన్ని గురించి అనేక విశ్వాసాలు ఉన్నాయి. వాటిలో కొన్ని పరస్పర విరుద్ధమైనవి. ఈజిప్టు నాగరికతను గురించి కూలంకషంగా పరిశోధించిన సర్ ఫ్లిండర్స్‌పెట్రీ వాగి పరలోక విశ్వాసాలను మూడు రకాలుగా విభాగించాడు. 1. మనిషి మరణాన తరం అతని 'బా' సమాధివద్దనే అదృశ్యంగా సంచరిస్తూ వుంటుంది. సమాధిదేవత దానికి కావలసిన సదుపాయాలు, ఆహార, పానీయాలు సమకూరుస్తూ వుంటుంది. లేదా మరణించిన వ్యక్తియొక్క సంతతి సమాధివద్ద భోజనాదికాలు నైవేద్యం పెడతారు. 2. మరణానంతరం 'బా' పరలోకమైన పాతాళానికి వెడుతుంది. అక్కడ పాతాళాధిష్ఠానదేవుడు ఒసిరిస్ జీవియొక్క పాపపుణ్యాలను విచారిస్తాడు. ఆయన తన న్యాయస్థానంలో జీవియొక్క హృదయాన్ని త్రాసులో తూకం వేస్తాడు. త్రాసులో ఒకవైపు హృదయాన్ని రెండవవైపు ఉష్ట్రపక్షి ఈకను (ఇది సత్యానికి ప్రతీక) పెట్టి తాత్ అనే దేవుడు తూస్తాడు. జీవి తాను 42 మహాపాపాలను చేయలేదని చెబుతాడు. నిర్దోషిత్వం రుజువయితే 'బా' పూర్వరూపం ధరించి ఒసిరిస్‌యొక్క స్వర్గధామంలో నివసిస్తుంది. ఈ స్వర్గం ఈజిప్టులాగే వుంటుంది. అక్కడకూడా నైలునది ఉంది. పుణ్యజీవులు పంటలు పండిస్తూ భోగభాగ్యాలు అనుభవిస్తూ నిరంతరం ఆనందంగా వుంటారు. 3. మరణానంతరం 'బా' పశ్చిమంలోవున్న సూర్యలోకానికి వెడుతుంది. అక్కడ సర్వదా దేవనౌకలో విహరిస్తూ ఆనందంగా వుంటుంది. ఆ లోకం ఎల్లప్పుడూ కాంతిమయం. భయానికి, చీకటికి అక్కడ తావులేదు.

ఇదేకాక భౌతికకాయం తిరిగి జీవిస్తుందని, బా తిరిగి భౌతికకాయాన్ని చైతన్యవంతం చేస్తుందన్నీ, జీవి మరలా భూలోకజీవితాన్ని అనుభవిస్తుందని కూడా ఈజిప్టు ప్రజలు విశ్వసించేవారు. అందువల్ల భౌతికకాయాన్ని రసాయనిక ద్రవ్యాలద్వారా విలువచేసి (వీటినే మమ్మీలంటారు), దానిని భద్రమైన సమాధిలోపెట్టి, దానికి కావలసిన సర్వసదుపాయాలనూ కూర్చేవారు. ఈ సమాధిగృహాలే పిరమిడ్లు. ఈజిప్టురాజులు (ఫారోలు) తమకోసమై బ్రహ్మాండమైన పిరమిడ్లను నిర్మించుకున్నారు. మమ్మీతోపాటు, ఆ వ్యక్తికి సంబంధించిన సర్వవస్తుసముదాయాన్ని పిరమిడ్లలో భద్రపరచేవారు. గోడలమీద ప్రకృతినీ, స్వర్గదృశ్యాలను చిత్రించేవారు. జీవి తన నిర్దోషిత్వాన్ని స్వర్గంలో నిరూపించుకోవటానికి అవసరమైన మంత్రాలను గోడలమీద వ్రాశేవారు.

అమృతత్వంకోసం, ఇహలోకంలోనూ, పరలోకంలోనూ సౌఖ్యంకోసం ఈజిప్టు ప్రజలు తమ దేవతలను ఆరాధించేవారు. వారు అనేకదేవతలను పూజించేవారు. రా, ఒసిరిస్, హోరస్, ఐసిస్ మొదలైన దేవతలనేకాక అనేకమైన ప్రకృతి దేవతలనూ, జంతుదేవతలనూకూడా ఆరాధించేవారు. వీరిలో ముఖ్యమైనవారు ఆమోన్ (వాయుదేవుడు), ఎపిస్ (వృషభం), ముత్ (రాబందురూపం), సెబెక్ (మొసలి), అనుబిస్ (నక్క, సమాధిని రక్షించే దేవుడు), హాథోర్ (గోదేవత), మొత్తంమీద రెండువేల దేవతలున్నట్లు పండితుల అంచనా. ఈ దేవతలను ప్రార్థనలతోనూ ధూపదీపనైవేద్యాలతోనూ, బలులతోనూ తృప్తిపరచేవారు. మతంలో మంత్రతంత్రాలకు, కర్మకాండకు అతిముఖ్యమైన స్థానం వున్నది. మంత్రశక్తి పేరు హికే. ఈ శక్తికి సర్వప్రకృతీ, మానవులు, దేవతలుకూడా లోకువే. దీనిద్వారా మానవులూ, దేవతలూ తమకు కావలసిన దానిని సాధించవచ్చు. కర్మకాండద్వారా మంత్రాలద్వారా యీ శక్తిని వశపరచుకుని కావలసిన పనిని చేయించుకోవచ్చు. ఉదాహరణకు అంత్యక్రియలలోనూ, సాంవత్సరిక శ్రాద్ధంలోను జరిగే ఒక ముఖ్యమైన కర్మకాండను తీసుకోవచ్చు. ఇది 'నోరు తెరిపించటం' అనే ప్రక్రియ. దీనిని చనిపోయిన ఫారో విగ్రహంవద్ద

కానీ, మసీదువద్దకానీ జరిపేవారు. ముందుగా రక రకాల పాత్రలలోని పవిత్రజలంతో విగ్రహాన్ని సంప్రోక్షించి ధూపం వేయాలి. ఈ ధూపం విగ్రహాన్ని పూర్తిగా చుట్టివేయాలి. తర్వాత ఉప్పుముద్దలను విగ్రహానికి సమర్పించాలి. విగ్రహంయొక్క కళ్లనూ, ముక్కునూ, చెవులనూ రాగివులి మొదలైన మంత్ర దండాలతో స్పృశించాలి. మంత్రదండాలలో ముఖ్యమైనది మహామంత్రదండం. దీని చివరిభాగం గొర్రె తల కాయ రూపంలో వుంటుంది. మతగురువు దీనితో విగ్రహాన్ని తాకుతూ మంత్రం చదువుతాడు.' 'సర్వ దేవతల నోళ్లనూ తెరిచే యీ మహామంత్ర దండంతో నీ నోరును తెరుస్తున్నాను'. అంటే దీనిద్వారా విగ్రహానికి ప్రాణం వచ్చినట్లు నమ్మకం. మరణించిన ఫారో ఒసిరిస్ దేవత అయిపోతాడు. అమృతత్వాన్ని పొందుతాడు. పరలోకంలో అమిత విశ్వాసం వుండటం వల్ల మంత్రక్రియలద్వారా ప్రతిమనిషీ స్వర్గానికి వెళ్లే అవకాశం వుండడంవల్ల ఒసిరిస్ ఆరాధన చాలా ప్రాచుర్యాన్ని పొందింది ప్రత్యక్ష దైవమైన సూర్యుని ఆరాధనకూడా ఈజిప్టు మతంలో చాలా ముఖ్యమైంది. ఐతే ఇది ఎక్కువగా రాజకుటుంబానికి రాజరికానికి పరిమితంగా వుండిపోయింది. సామాన్య ప్రజానీకానికి ఒసిరిస్ ముఖ్యదైవం అయినాడు. ఒసిరిస్ పరలోక ప్రభువేకాక, నైలునదికీ, తద్వారా ప్రకృతి జీవనానికి, పంటలకు అధిష్ఠాన దైవం. నైలునదిపొంగి భూమిసారవంతం కావటానికి, పంటలు పండటానికి, చెట్లు చిగిర్చటానికి ఒసిరిస్ కారణ భూతుడు.

## దేవతలు

ఈజిప్టు మతం చాలా క్లిష్టమైనది. ప్రతి తెగకు, ప్రతినగరానికి ప్రత్యేక దేవతలు వుండేవారు. అతిప్రాచీన కాలంలో ప్రతితెగ తానొక జంతువు నుంచో, చెట్టునుంచో, గ్రహంనుంచో పుట్టినట్లు నమ్మేవారు. కనుక వాటిని కులదేవతలుగా పూజించేవారు. ఈ జంతుదేవతలు, గ్రహదేవతలూ క్రమంగా ప్రాముఖ్యాన్ని వహించి ఆయా తెగలకు, నగరాలకు చిహ్నాలై ముఖ్యదేవతలుగా రూపొందారు. ఈజిప్టులో దేవతలు పక్షి, పశు, మానవ రూపాల్లో పూజింపబడ్డారు. డేగ సూర్యరూపమైన హోరస్‌కు చిహ్నమైంది. వృషభరూపంలోవుండే ఎపిస్, ప్టాహ్ యొక్క అవతారం.హాథోర్ గోరూపంలో వుంటుంది. సమాధిని రక్షించే అనుబిస్ నక్క తలకాయతో వుంటాడు.

ప్రసిద్ధి పొందిన వీరులూ, రాజులూకూడా కాలక్రమాన దేవతలుగా మారారు. ఇటువంటి దేవతలలో ముఖ్యుడు ఒసిరిస్. ఫ్రేజర్ పండితుడి ప్రకారం ఒసిరిస్ ఒక తెగకు నాయకుడు. అతడు వ్యవసాయము మొదలైన నాగరిక వృత్తులను ప్రవేశపెట్టాడు. అతడు వేరొక తెగనాయకుడైన సెత్ అనే వానివల్ల చంపబడ్డాడు. ఒసిరిస్ కుమారుడైన హోరస్ సెత్‌తో పోరాడి, అతనిని వోడించి పగసాధించాడు. తండ్రి రాజ్యాన్ని తిరిగి పొందాడు. మరికొందరి పండితుల ప్రకారం ఒసిరిస్ నైలునదీ దేవత. సౌరమతం ప్రబలిన తరువాత ఒసిరిస్ సౌర దేవతలలో ఒకడైనాడు. అతడు ఆకాశదేవుడైన నుత్‌కూ, భూదేవత గెబ్‌కు కుమారుడు అయినాడు. అంతేకాక సూర్యదేవుడైన ఆతుమ్ సంతతివాడుగానూ, ఈజిప్టు రాజులకు మూలపురుషుడుగానూ చిత్రింపబడ్డాడు. సూర్యారాధన ప్రబలిన తరువాత చనిపోయిన ప్రతిరాజూ ఒసిరిస్‌గానూ, పరిపాలించే రాజు అతడి కుమారుడు హోరస్‌గానూ చిత్రించబడ్డారు. ఐసిస్ ఒసిరిస్‌యొక్క సోదరి. ఆమె అతడి భార్యకూడా. వారి కుమారుడు హోరస్. ఈజిప్టు రాజవంశంలో సోదరీ సోదరులు వివాహం చేసుకోవటం ఆచారమైంది.

ఒసిరిస్ ఈజిప్టుకు మొట్టమొదటి రాజు. అందువల్ల అతడు రాజలాంఛనాలతో చిత్రింపబడ్డాడు. రెండు ఈజిప్టుల (ఎగువ దిగువ ఈజిప్టు) ఐక్యానికి చిహ్నమైన రెండు రంగుల (ఎరుపు,

తెలుపు) కిరీటాన్ని ధరిస్తాడు. రాజరిక చిహ్నమైన సర్పం దానిచుట్టూ పెనవేసుకుని వుంటుంది. కిరీటానికి రెండు ఈకలు వుంటాయి. ఇవి సత్యానికి సంకేతం. ఒక చేతిలో చామరమూ, రెండవ చేతిలో దేవదండమూ వుంటాయి. హోరస్‌కూడా యిలాంటి రాజలాంఛనాలతో చిత్రింపబడ్డాడు. ఐసిస్‌కూడా రాజలాంఛనాలతో చిత్రించబడింది. ఆమె ప్రకృతి దేవత. పచ్చటి పొలాలకు, ధాన్యానికి అధిష్ఠానదేవత. పురుష, ప్రకృతులకు ఒసిరిస్, ఐసిస్‌లను సంకేతాలుగా మనం చెప్పుకోవచ్చు.

సౌరదేవతలు అనేకమంది వున్నారు. వారిలో ముఖ్యుడు 'రా'. అతడు సూర్యుడు. సూర్యబింబం అతడి సంకేతం. సూర్యారాధన వ్యాప్తి చెందటంతో అనేకమంది స్థానిక దేవతలకు 'రా'నామం తగిలింపబడి, వారందరూ సౌరదేవతలుగా పరిగణించబడ్డారు. థీబ్సు నగరానికి చెందిన ఆమున్ – రా, హెలియోపోలిస్‌కు చెందిన ఆతుమ్—రా ప్రముఖ దేవతలైనారు. రా ముఖం గ్రద్దరూపంలో వుంటుంది. అతడు గుండ్రని సూర్యబింబాన్ని తలమీద ధరిస్తాడు. దానిచుట్టూ సర్పం వుంటుంది. ఆతుమ్–రా ఈజిప్టు రాజకిరీటాన్ని ధరిస్తాడు. ఆమోన్ తలమీద ఉష్ణపక్షి ఈకల కిరీటం వుంటుంది. అతడి చేతిలో కొరడా వుంటుంది. అతడు సృష్టికర్త. ఆమోన్ భార్య ముత్ రాబందు రూపంలో వుంటుంది. వారి కొడుకు ఖోంసు చంద్రుడు. అతడు డేగరూపంతో కూడా చిత్రింపబడ్డాడు.

నిజానికి ప్రతిదేవతలోనూ కాస్తోకూస్తో సూర్యాంశ వున్నది. నుత్‌అనే ఆకాశదేవత వున్నప్పటికీ రా కూడా ఆకాశదేవతగానే రూపొందాడు. సూర్యుడు 'రా' గద్దవలె ఆకాశంలో పయనిస్తాడు. ఉదయసూర్యుడు యువకుడైన ఖేప్రి. అస్తమయ సూర్యుడు వృద్ధుడైన ఆతుమ్. హోరస్ మరొక సూర్యదేవుడు. అతడు గద్దరూపంలో వుంటాడు. తూర్పుఆకాశంలో నలుగురు హోరసులు వుంటారు.

మెంఫిస్‌నగరదేవత ప్టాహ్ మరొక ముఖ్యమైన దేవుడు. కాలక్రమాన అతడు కూడా సృష్టికర్తగా రూపొందాడు. ఒక సంప్రదాయం ప్రకారం రా, ఆమోన్, ప్టాహ్‌లు ముఖ్యదేవతలు. వారిలో సర్వదేవతలూ నిహితమై వున్నారు.

దేవతలు జంతురూపాలతోనూ, పక్షిరూపాలతోనూ చిత్రించబడ్డారు. వారు అనేకచిహ్నాలను ధరించివుంటారు. వీటిలో ముఖ్యమైనవి సూర్యునికి చిహ్నమైన బింబం, ఈజిప్టురాజుల కిరీటం, ఉష్ట్రపక్షిఈకలూ, మంత్రదండం. మంత్రదండంలో మూడు ముఖ్యభాగాలు వున్నాయి: 1. ప్రాణచిహ్నమైన అంఖ్ 2. శాశ్వతత్వచిహ్నమైన దెద్ 3. దేవతలు ధరించే దండం.

## పు రా ణ గా థ లు

దేవతల పుట్టుపూర్వోత్తరాలూ, వారి చర్యలూ, సృష్టిస్థితి లయాలకు సంబంధించిన గాథలు ప్రతి మతంలోనూ చాలా ముఖ్యమైనవి. ఇవి మతానికి పునాదిరాళ్లలాంటివి. ఈజిప్టుగాథలు అనేకం వున్నాయి. వాటిలో ముందుగా సృష్టిగాథను చూద్దాం. చాలా మంది దేవతలు సృష్టికర్తలుగా చెప్పబడ్డారు. క్లిష్టమైన ఈజిప్టుమతంలో గాథలుకూడా రకరకాలుగా, కొంతవరకూ పరస్పరవిరుద్ధంగా కనుపిస్తాయి. సృష్టికిముందు సర్వం జలమయంగా వున్నది. దీనిలో సృష్టికర్త ఆతుమ్‌ముందు ఒక కొండగుట్టను సృష్టించాడు (ఇదే తర్వాత భూమి అయింది). స్వయంభువుఅయిన ఆతుమ్ షు అనే వాయుదేవుణ్ణి, టెఫ్‌నుత్‌అనే తేమదేవతనూ సృష్టించాడు. వారికి గెబ్‌అనే భూదేవుడు, నుత్‌అనే ఆకాశదేవతా పుట్టారు. వీరినుంచి ఒసిరిస్, సెత్‌అనే మొగదేవతలూ, ఐసిస్, నెఫ్తిస్‌అనే స్త్రీదేవతలూ పుట్టారు. ఐసిస్, నెఫ్తిస్‌లను ఒసిరిస్, సెత్‌లు వివాహమాడారు. క్రమంగా మిగిలిన దేవతలందరూ ఉద్భవించారు. మానవసృష్టికి ఈజిప్టులో ప్రత్యేక ప్రాధాన్యం లేదు. సృష్టిలోని జంతుజాలంలో అతడు ఒకభాగం

మాత్రమే. జంతువులమీద, ప్రకృతిమీద మానవుని ఆధిక్యత గుర్తింపబడలేదు.

షు, తెఫ్‌నుత్‌లను ఆతుమ్ తన లాలాజలంలోంచి పుట్టించినట్లు ఒక కథ. తన వీర్యంలోంచి వారిని పుట్టించాడని వేరొక కథ, మరొక కథ ప్రకారం షు భూమ్యాకాశాలను రెండుగా చీల్చివేశాడు. మెంఫిస్‌నగరదేవత ప్టాహ్ కళలకు అధిష్ఠానదేవత. అతడు సర్వవస్తుజాలాన్ని సృష్టించి మానవలోకానికి ప్రసాదించిన విశ్వకర్మ. మెంఫిస్‌నగరం ఈజిప్టుకు రాజధాని అయినతరువాత ప్టాహ్ ముఖ్యదేవత అయినాడు. అతడే సృష్టికర్తగా చిత్రింపబడ్డాడు. సంప్రదాయానుసారం సృష్టికర్తఅయిన ఆతుమ్ యొక్క శక్తిసామర్థ్యాలకు, మేధకు కారణం ప్టాహ్అని కల్పించారు. ప్టాహ్ ఆతుమ్‌యొక్క జిహ్వగానూ, హృదయంగానూ వర్ణింపబడ్డాడు.

ఒసిరిస్‌నుగురించిన గాథలలో మూడు ముఖ్యాంశాలు వున్నాయి. 1. ఈజిప్టుకు మొదటిరాజు; రాజవంశానికి మూలపురుషుడు. 2. నైలునదీదేవత. ప్రకృతివికాసానికి హేతువు. 3. పరలోకప్రభువు. సృష్టిక్రమాన్ని యింతకుముందే చూచాం. అతడు గెబ్, నుత్‌ల కుమారుడు, ఐసిస్‌కు సోదరుడూ, భర్త. ఒసిరిస్ ఈజిప్టుకు మొట్టమొదటి ప్రభువు. తమ్ముడైన సెత్ ఒసిరిస్‌ను మోసంచేసి చంపివేశాడు. ఒక గొప్పవిందు జరిగింది. అందులో వినోదంకోసం ఒసిరిస్‌ను ఒక పెట్టెలో కూచోమన్నారు. సెత్, అతని అనుచరులూ పెట్టెను మూసివేసి, దానిని నైలునదిలో పారవేశారు. ఆ పెట్టె తేలిపోతూ బిబ్లోస్‌నగరం చేరింది. ఆ పెట్టె ఒడ్డుచేరగా క్రమంగా దానిచుట్టూ ఒక పెద్దవృక్షం మొలిచింది. ఆ నగరపురాజు ఆ చెట్టును నరికి తన భవనంలో ఒక స్తంభంగా తయారుచేసుకున్నాడు. ఐసిస్ విలపిస్తూ తిరుగుతూవుంటూంది. తన భర్త బిబ్లోస్‌లో స్తంభరూపంలో వున్నాడని తెలుసుకుని, అక్కడికివెళ్ళి ఆ రాజును ప్రార్థించి స్తంభాన్ని తెచ్చుకుంటుంది. సెత్ వేటాడుతూ ఒసిరిస్ మృతదేహాన్ని చూచాడు. దానిని ముక్కలు, ముక్కలుగా నరికి ఈజిప్టు అంతటా వెదజల్లుతాడు. ఐసిస్ ఈజిప్టుఅంతా తిరిగి తన భర్త దేహఖండాలను ఒకదరికి చేరుస్తుంది. (ఒక్కజననేంద్రియంతప్ప మిగిలిన భాగాలన్నీ దొరుకుతాయి); తన సోదరి నెఫ్తిస్ సహాయంతో దేవతలను ప్రార్థించి, మంత్రశక్తి ద్వారా భర్తకు ప్రాణంపోస్తుంది. ఒసిరిస్‌దేహంమీద వ్రాలి హోరస్‌అనే కొడుకును కంటుంది. ఒసిరిస్ పాతాళలోకానికెళ్ళి ఆ లోకానికి రాజు అవుతాడు. హోరస్ తన తండ్రికి జరిగిన అపచారానికి ప్రతీకారం చేస్తాడు. హోరస్‌కు సెత్‌కుమధ్య భయంకరమైన సమరం సాగుతుంది. యుద్ధంలో హోరస్ ఒక కన్నును పోగొట్టుకుంటాడు. సెత్ చివరకు ఓడిపోతాడు. దేవపరిషత్తు (ఎన్నియాడ్)లో న్యాయవిచారణ జరుగుతుంది సెత్ దురాగతాన్ని దేవతలు ఖండిస్తారు. గెబ్ హోరస్‌ను సమర్థించి అతనికి న్యాయంగా రావలసిన ఈజిప్టు సింహాసనాన్ని అతడికి యిస్తాడు. ఈ రకంగా హోరస్ పగ సాధించి తన తండ్రి సింహాసనాన్ని గెల్చుకుని ఈజిప్టురాజుల మూలపురుషుడైనాడు. ఈ కథ ఈజిప్టులో అతిప్రాచీనకాలంలో జరిగిన ఒక అంతర్యుద్ధాన్ని, అందులో డేగతెగకు (హోరస్‌డేగరూపంలో వుంటాడు) చెందిన హోరస్ యొక్క విజయాన్ని సూచిస్తున్నట్లు కొందరు పండితుల అభిప్రాయం. ఈ హోరస్ ఎగువ, దిగువ ఈజిప్టులను ఏకంచేసి ఐక్యఈజిప్టురాజ్యానికి మొదటి రాజు అయివుంటాడు.

ఈజిప్టుకు నైలునది జీవనాధారం. నైలునది జూన్, జులై నెలలలో పొంగటం ప్రారంభిస్తుంది. క్రమంగా సెప్టెంబరు నాటికి పంటపొలాలన్నీ జలమయమైపోతాయి. క్రమంగా వరదతగ్గి జనవరి నాటికి నది యథాస్థానానికి చేరుతుంది. ఈ రకంగా పంటలకు నీరువచ్చి వ్యవసాయానికి అవకాశం కలుగుతుంది. నైలునది పొంగటం ప్రజలకు పెద్దపండుగ. ఒసిరిస్‌కొరకు ఐసిస్ విలపిస్తున్నదనీ, ఆమె కన్నీరు నైలునదిగా పొంగుతుందని ప్రజల విశ్వాసం. ఆ

సమయంలో ఒసిరిస్, ఐసిస్‌లకు పెద్ద ఉత్సవం చేసేవారు. ఎండాకాలంలో పొలాలు బీటలువారి, ప్రకృతి స్తంభించి పోతుంది. అంటే ఒసిరిస్ మరణించాడన్నమాట. ఒసిరిస్ భూలోకాన్ని విడడంవల్ల క్షామపరిస్థితులు ఏర్పడ్డాయన్నమాట. నైలునది పొంగటం, పంటలు పండటం, చెట్లు చిగర్చటం మొదలు పెడితే ఒసిరిస్ భూలోకంలోకి వచ్చినట్లు నమ్మకం. అందువల్ల విత్తనాలు చల్లేటప్పుడు ఒసిరిస్‌ను ప్రార్థించేవారు. అతడి విగ్రహాన్ని నైలు నదిలో పడవమీద వూరేగించి ఒక పవిత్ర స్థలంలో సమాధి చేసేవారు. ఈ విగ్రహాన్ని తడిమట్టితోనూ, ధాన్యంతోనూ చేసేవారు. పంటవచ్చే కాలానికి ఈ విగ్రహంనుంచి మొక్కలు పుట్టేవి. అంటే ఒసిరిస్ తిరిగి జన్మించాడన్నమాట. ఈ రకంగా ఒసిరిస్ పుట్టటం, చనిపోవటం ప్రకృతితో ముడి పడి వుంది. ప్రకృతి యీ విధంగా ఒసిరిస్‌మీద ఆధారపడి వున్నది వసంతకాలారంభంలో (సంవత్సరాదినాడు) గొప్ప ఉత్సవం జరిపి, ఒసిరిస్ ప్రీత్యర్థం జెడ్ అనే ధ్వజస్తంభాలను నాటేవారు.

ఒసిరిస్ వధను గురించి యింతకుముందు చూచాము. దేవపరిషత్తు ఒసిరిస్ వధను గొప్ప హత్యానేరంగా పరిగణించింది. దానికి పరిహారంగా ఒసిరిస్‌ను స్వర్గలోకాధిపత్యం ఇవ్వబడింది ఈరకంగా ఒసిరిస్ పరలోక ప్రభువు. జీవుల పాప, పుణ్యాలను విచారించే న్యాయాధిపతి అయినాడు. పుణ్యాత్ములు పరలోకమైన 'ఇయారు'లో సర్వసౌఖ్యాలను అనుభవిస్తూ వుంటారు. పాపాత్ములు దహింపబడుతారు. అతిప్రాచీనకాలంలో ఒసిరిస్ రాజ్యం భూమికింద పాతాళలోకంలో వున్నట్లు నమ్మకం. సూర్యారాధన ప్రబలిన తరువాత, ఒసిరిస్‌కు సూర్యాంశ తగిలించబడి అతడి లోకంకూడా భూమిపైన ఆకాశంలో వున్నటు చిత్రింపబడింది.

మానవజాతి వినాశనానికి సంబంధించిన ఒక కథ యీ విధంగా వున్నది. 'రా' వృద్ధుడైనాడు. దేవతలమీద, మానవులమీద అతడి అధికారం సన్నగిల్లుతున్నది. అందువల్ల అతడు మానవులమీద కోపించాడు. అతడు దేవతలను సమావేశపరచి మానవులు తనమీద కుట్రపన్నుతున్నారనీ వారిని శిక్షించాలనీ నిర్ణయించాడు. రాజ్యేష్ఠపుత్రుడైన నున్ గోరూపంలోవుండే హాథోర్ దేవతను (హాథోర్ 'రా' యొక్క నేత్రం) మానవులమీద ప్రయోగించమని చెప్పాడు. ఆ ప్రకారం హాథోర్ భూలోకానికివచ్చి తన హింసాకాండ సాగించింది. కొన్నాళ్ల తర్వాత రా కు మానవులమీద దయకలిగి హాథోర్‌బారినుంచి వారిని రక్షించాలనుకున్నాడు. ఏడువేల కుండలనిండా బార్లీ సారాయాన్ని తయారు చేయించి, దానిలో ఎర్రరంగు కలిపి రక్తంలా తయారు చేయించి భూమిమీద పోయించాడు. హాథోర్ దీనిని మానవ రక్తమనుకుని కడుపునిండా త్రాగింది. దానితో హాథోర్‌కు విపరీతమయిన మత్తు కలిగి మానవుల మీద కోపాన్ని మరచి, వారిని వధించటం మాని వేసింది.

వేరొక కథ నిజ నామంయొక్క శక్తిని వర్ణిస్తుంది. ప్రతిదేవతకు మానవుడికి నిజమైన నామం గోప్యంగా వుంటుందని అది చాలా శక్తివంతమైందని ఈజిప్టు ప్రజల విశ్వాసం. ఈ కథలో ఐసిస్ 'రా'యొక్క నిజనామాన్ని తెలుసుకుని దా ద్వారా తన శక్తిని వృద్ధిచేసుకోవాలనుకుంటుంది. ఆమె ఒక సర్పాన్ని సృష్టించి రా నడచే దోవలో పెడుతుంది. సర్పదష్టుడైన రా విపరీతంగా బాధపడి దేవతలను పిలిచి తన బాధను పోగొట్టమంటాడు. ఐసిస్ తాను బాధను పోగొడతాననీ అందుకు రా తన నిజ నామం చెప్పాలనీ అంటుంది. రా తాను ఉదయ కాలంలో ఖీప్రీననీ, మధ్యాహ్నం 'రా'ననీ, సాయం కాలం అతుమ్‌ననీ చెబుతాడు. ఇవి ఏవీ అతడి నిజ నామంకాదు అంటుంది ఐసిస్. చివరకు ఎవ్వరికీ తాను వెల్లడి చేయనని ఐసిస్ ప్రమాణం చేసిన మీదట రా తన నిజనామాన్ని చెబుతాడు. దాని శక్తిని వుపయోగించి ఐసిస్ రా యొక్క సర్ప బాధను నివారిస్తుంది.

దేవాలయాలు, పూజావిధానం: – వివిధ దేవతలకు ఈజిప్టులో అనేకగొప్పదేవాలయాలు నిర్మింపబడ్డాయి. మెంఫిస్‌లో ప్టాహ్‌కు, థీబ్సులో ఆమొన్–రాకు, హెలియోపోలిస్‌లో అతుమ్–రాకు బ్రహ్మాండమైన దేవాలయాలను ఫారోలు నిర్మించారు. మొదటమొదట పూజారులనే ప్రత్యేకవర్గం ఏర్పడలేదు. వివిధతెగల నాయకులే పూజారులుగా వ్యవహరించేవారు. మతమూ, కర్మకాండ క్లిష్టం కావటంతో కాలక్రమాన ప్రత్యేకమైన పూజారులవర్గం ఏర్పడింది. ఈజిప్టురాజు దైవాంశసంభూతుడు, అతడే సర్వదేవతలకూ ప్రధానార్చకుడు. అతడు అన్నిచోట్లా అర్చనాదికాలు జరపటం సాధ్యంకాదుకనుక తన అధికారాలను పూజారులకు బదిలీచేశాడు. ఈజిప్టుదేశం అంతా దేవతలసొత్తు. పంటభూముల్లో మూడో వంతు దేవాలయాల క్రింద వుండేది. ప్రతిదేవాలయంలోనూ అనేకమంది అర్చకులూ, బానిసలూ, దేవదాసీలు ఉండేవారు; ధనధాన్యాలూ వుండేవి. దేవాలయాల్లో ప్రతినిత్యమూ అర్చనాదికాలు జరిగేవి. పర్వదినాలలో, పండగలలో పశుబలులూ, క్రతువులూ, ఊరేగింపులూ జరిగేవి. ఉత్సవవిగ్రహాన్ని పడవఆకారంతో వున్న పల్లకిలో పెట్టి అర్చకులు మోసుకు ఊరేగించేవారు. ప్రతిదినం గర్భగుడిలో పూజారులు ధూపం వేసి, విగ్రహాన్ని స్నానంచేయించి, బట్టలు వేసేవారు. ప్రార్థనాదికాలు ముగిసినతర్వాత దేవునికి ఆహారాన్ని నైవేద్యం పెట్టేవారు. ఫారోలకు, అర్చకులకు మాత్రమే గర్భగుడిలోకి వెళ్లటానికి, అర్చించటానికి అధికారం వుండేది. సామాన్యప్రజలు ముఖమంటపం వద్దనేవుండి ప్రార్థనలూ, నివేదనలూ చేసేవారు. దేవతల ప్రీత్యర్థం జంతుబలులు జరిగేవి

## ఏ కే శ్వ రా రా ధ న

ప్రపంచ చరిత్రలో క్రీ. పూ. 14వ శతాబ్దికి ప్రత్యేక ప్రాముఖ్యం ఉన్నది. ఈ శతాబ్దంలో ఈజిప్టు ఫారో ఏఖ్‌నాటన్ ఏకేశ్వరోపాసనను ప్రవేశపెట్టాడు. దేవుడు ఒకడేనని అతడు ఏటన్ అని ఆయన ప్రకటించాడు. ఏటన్ అంటే సూర్యుడు. ఈ దేవుడు సర్వప్రపంచానికీ పితృసమానుడు. ఏఖ్‌నాటన్ బహుదేవతారాధనను రద్దుచేసి ప్రజలందరూ ఏటన్‌నుమాత్రమే పూజించాలని శాసించారు. పురాతన దేవాలయాలను పడగొట్టించి పూజారులను వెళ్లగొట్టాడు. సంప్రదాయమతానికి పట్టుకొమ్మఅయిన థీబ్సునుంచి తన రాజధానిని మరొకచోటికి మార్చివేశాడు. ఈ రకంగా మతాన్ని సంస్కరించి ఏకేశ్వరారాధనను ప్రపంచంలో మొట్టమొదట ప్రవేశపెట్టిన ఘనత ఏఖ్‌నాటన్‌కు దక్కుతుంది.

## ఆ ధా ర గ్రం థా లు


1. Pre-Historic Religion by E. O. James.
2. History of Religions by E. O James.
3. Sacred Books of the World by A. C. Bouquet.
4. The Religion of Ancient Egypt by Sir Flinders Petrie.
5. An Introduction to Egyptian Religion by Alan W. Shorter.
6. History of Mankind, Volume I Part 2. by Sir Leonard Woolley.
7. Middle Eastern Mythology by S. H. Hooke.

# రాసలీల

శ్రీ గడియారం శేషఫణిశర్మ

హాయివుగా మిగుల నచ్చెరువుగా రంగు చి
త్తరుగా రొలతేటి దరువుగా సాగుతూ,
నడలలో క్రొత్తపోకడలలో చెలగుతూ,
యమునాతటిని రాసలీల సాగింది.

నింగిలో మిన్నేటి పొంగులా పొంగైన
రంగులో రేయెండ సింగార మొలికింది.
గిరులలో నిండింది చరులలో పండింది.
పిండివెన్నెలరేయి పండుగైపోయింది.

నింగిలో జాబిలి మిలమిలా మెరిసింది,
సిగ్గుతో తారక తెలతెలపోయింది,
నింగి దిగివచ్చింది నేలయేరు పొంగింది,
నేలయేటిలో కలువ నెలరేని చేరింది.

గండుకోకిల కోరి గడుసుగా కూసింది,
కన్నెకోకిల సిగ్గుమొగ్గ లేసింది,
విరిమల్లె విప్పారి తెల్లగా విరిసింది,
గండుతేటికి కనువిందు చేసింది.

మోహనకృష్ణుని మురళి రవళించింది,
వ్రజకాంత గజ్జెలు ఘల్లుమనిపించింది,
యమున పులకించింది జగతి మైమరచింది,
ప్రేమ వెల్లువపొంగి పొరలిపారింది.

రమణమై మండల భ్రమణమై అసకృద్వి
రమణమై అలరారు రాసమును కల్పించి

హారియై నటనానుసారియై మృదురావ
హారియై శిఖిపింఛధారి నర్తించెను.

ఒకవంక గిరిధారి ఒకవంక వ్రజనారి
వ్రజనారి వ్రజనారి నడుమ వంశిధారి
ఒకచేయి మురహారిది ఒకచేయి వ్రజసతిది
చేతులన్నీ కలిసి చెంగల్వపూదండ.

ఒకవేళ సతియాట ఒకవేళ హరిమాట
ఆటకూ మాటకూ నడుమ వేణువుపాట,
ఒకత్రోవ హరిపదము ఒకత్రోవ సతిపదము
పదములన్నియు కలిసి ప్రణయతా పదము.

చూపు నిలిచినవేళ వెన్నెల వెలిగింది,
నవ్వు రాలినచోట విరజాజి విరిసింది,
కనులు కలిసినవేళ కన్నీరు నిలిచింది,
తనువులో అణువణువు కదిలి కంపించింది.

కాంతే కర్పూరమై కరిగిపోయింది,
వలపు హోమాగ్నిలా వెలిగిపోయింది,
ఆటకొనసాగింది పాట చెలరేగింది
గోపిక గుండెలో బొజ్జంగి పూచింది.

నడలలో క్రొత్తపోకడలు కన్పింపగా,
పాటలో సరిక్రొత్తధాటి వినిపింపగా,
గతులలో నూత్నసంగతులు తెలపింగా,
వల్లవీసతి యుల్లముల్లసిల్లింది.

# నిశ్శంకదుర్గ శిలాశాసనము

## శ్రీ అరికట్ల సుబ్రహ్మణ్యం

కార్వేటి నగరము – చిత్తూరుజిల్లా పుత్తూరు తాలూకా కేంద్రమునకు ఎనిమిదిమైళ్ళ దూరమున చిత్తూరు – పుత్తూరు రహదారియందున్నది. గ్రామము అతిప్రాచీనమైనది జనసంఖ్య సుమారు ఏడువేలు కలిగియున్నది.

### నామోత్పత్తి

కాడు—వెట్టి నగరము—అని ద్రావిడభాష (తమిళము) పరముగ వ్యవహరింపబడుచున్నది. అడవిని కొట్టి నగరము కట్టిరని భావము.

కాడు - వేటి—నగరము యని సంస్కృతభాష పరముగ వ్యవహరింపబడుచున్నది. అడవిచే చుట్టబడిన నగరమని భావము.

### చరిత్ర

కార్వేటినగర సంస్థానమును మొదట సాళువ రెడ్లు పరిపాలించిరని, మొదటిరాజు సాళువ నరసారెడ్డియని (క్రీ. శ. 1020), ఇతని తరువాత సాళువ వెంకటపతినాయుడు రాజ్యము చేసినట్లు శ్రీ చాగంటి శేషయ్యగారు వ్రాసిరి.[1] మరియు కార్వేటినగర సంస్థానమును క్షత్రియ సాళువరాజులు ఎప్పుడును పరిపాలించలేదట. రెడ్డిరాజుల అనంతరము (కడపటి రెడ్డిరాజు శేషాచలరెడ్డియట) సంస్థానము బొమ్మరాజువంశమువారి స్వాధీనమైనదట. అందుచేత తరువాతి కార్వేటినగరపాలకులందరు రెడ్డిరాజుల గౌరవార్థమై 'సాళువ' బిరుదు వహించారట. ఈ విధముగ వ్రాయుటకు శ్రీ శేషయ్యగారికి ఏమి ఆధారములు లభ్యపడెనో తెలియకున్నది

'పరమత కఠారి సాళ్వవర'యను బిరుదమును కార్వేటినగరరాజులుకూడ ధరించినట్లు తోచుచున్నది. రెడ్డిరాజులుకూడ పై బిరుదమును ధరించుచుండిరేమోయని శ్రీ శేషయ్యగారు తమ సందేహమును చక్కగ వెలిబుచ్చిరి కార్వేటినగరమును 11—15 శతాబ్దములవరకు సాళువరెడ్డిరాజులు, పిమ్మట మాకరాజు వంశీయులు, తరువాత వెల్లంటివారు పాలించిరని వ్రాసిరి. శ్రీ శేషయ్యగారు పై విధముగ వ్రాయుటకు వారి కనుకూలముగా ఏ ఒక్క శిలాశాసనముగాని కానిపించదు

### రాజ్యచిహ్నము

తూర్పు చాళుక్యులలో కడపటివాడైన విక్రమాదిత్యవిమల (క్రీ. శ. 1016—1023 తిరువళ్ళిపాంత దేశమునకు సాళువ నరసారెడ్డి(3) సామంతునిగ జేయబడెనట. అందుచే కార్వేటినగర రాజులు తూర్పు చాళుక్యుల గౌరవార్థమై వారి రాజలాంఛనములు ధరించుచున్నారట. కాని కార్వేటినగర రాజుల రాజ్యచిహ్నము చోళులది.

### నిశ్శంకదుర్గము

కార్వేటి నగరమునకు ఆగ్నేయమున సుమారు నాలుగు మైళ్ళ దూరమున నిశ్శంకదుర్గము కలదు. దుర్గము అతిప్రాచీనమైనది. వైశాల్యమున, నిర్మాణమున చంద్రగిరి దుర్గమును పోలియున్నది. ఇది ఐదు ప్రాకారములు కలిగిన గిరిదుర్గము. దుర్గమును రెండు కొండలను కలిపి కట్టియున్నారు. దుర్గమున ఒక వేణుగోపాలస్వామివారి దేవాలయము, రెండు శివాలయములు, ఒక దుర్గమంటపము (ఆలయము) ఉన్నవి. దుర్గప్రవేశము చేసినంతనే మనకు దర్శనమిచ్చునది శ్రీ వేణుగోపాలస్వామివారి ఆలయ

1. ఆంధ్రకవితరంగిణి—పదవ సంపుటము.

ప్రాంగణము. తరువాత రజప్రాసాదమువంటి మందిరము. దుర్గమునందలి కట్టడములన్నియు శిథిలములయి నేలమట్టమగుచున్నవి దేవాలయమునందలి మూల విగ్రహములు స్థానభ్రంశములుచెంది ఆలయముల వెలుపలబడియున్నవి. శ్రీ వేణుగోపాలస్వామి వారి నిలువెత్తు విగ్రహము మాత్రము ప్రస్తుతము కార్వేటినగర దేవాలయమునందు ప్రతిష్ఠింపబడియున్నది. ఈ కార్వేటినగర శ్రీ వేణుగోపాలస్వామివారి దేవాలయమున చోళరాజైన త్రిభువన చక్రవర్తి రాజరాజచోళదేవుని శ్రీముఖమున వీర నరసింహరాజా కొన్నిదేవాలయములకు భూదానములు చేసినట్లు ప్రాచీన తమిళ భాషా శాసనము కలదు.[2] (క్రీ. శ. 1157.) దుర్గమునందే శ్రీ వీరాంజనేయుని నిలువెత్తు విగ్రహము ఒక పెద్ద బండరాతియందు అతిభయంకరముగ చెక్కబడియున్నది. ఈ విగ్రహ సాన్నిధ్యముననే రాజులు తమ సైనికులను యుద్ధమునకు ప్రబోధించెడివారు. శిలాశాసనము ఆంజనేయులవారి విగ్రహమునకు ఉత్తరముగ నున్నది. ఈ దుర్గమునుండి రాజధాని నగరమైన కార్వేటినగరమునకు ఒక సొరంగమార్గమున్నదట. కాని అది ఎచ్చటనున్నదో తెలియకున్నది. దుర్గమునందు నిధి నిక్షేపములు గలవని చాలామంది ఈ దుర్గమునందలి రహస్య ప్రదేశములను, దేవుని పీఠములను త్రవ్విరట. దుర్గమునుండి కార్వేటినగరమునకు దారిబాట యున్నది. నేడది చాలావరకు శిథిలమైపోయినది. ఈ దుర్గమునకు పోవుదారియందు 'రాయదుర్గ'మను మరియొక గిరిదుర్గము కలదు. ఇందు ఎలాంటి శిలాశాసనములుగాని కనిపించుట లేదు. దుర్గమునకు ఆనవాలుగ ఒక ప్రాకారముమాత్రము, శిథిలమైన ఒక మందిరము మాత్రమున్నవి. నిశ్శంకదుర్గము చిత్తూరుజిల్లాలోని చంద్రగిరిదుర్గమునకన్న ప్రాచీనమైనది.

*శిలాశాసనము—ఆకారాదికములు*

శిలాశాసనము ఒక పెద్దబండపై చెక్కబడియున్నది.[3] బండ చతురస్రగలేక ఎగుడు దిగుడుగ నుండి చాలా ఏటవాలుగ నున్నది. ఎండకు, వానకు శాసనపాఠము కొంత కొంత చెదరిపోయియున్నది. శిలాశాసనపు బండకు దిగువగ నొక దొవ (జలాశయము) యున్నది. శాసన పాఠము గ్రహించునపుడు ఏ మాత్రము అజాగ్రత్తగనున్నను క్రింద జలాశయమునందు వచ్చి పడెదము. సంస్కృతము తెలుగు శిలాశాసనములు కలసి 7' పొడవు, 5' వెడల్పు కలిగియున్నవి. మొదట సంస్కృత శాసనము దానిక్రిందుగ తెలుగు అనువాద శాసనము చెక్కబడియున్నది. సంస్కృత శాసనమునకు పైభాగమున చోళసామ్రాజ్య చిహ్నమైన వరాహము, కైజారు, సూర్యచంద్రులు చెక్కబడియున్నవి రాజ్యచిహ్నముక్రిందుగ శ్రీరామ యని రాజనామము చెక్కబడియున్నది. తెలుగు శిలాశాసనము మాత్రము 24 పంక్తులు కలిగియున్నది. సంస్కృత శిలాశాసనము మాత్రము చాలావరకు చెదరిపోయియున్నది.

*లిపి*

16 వ శతాబ్దమున ఆంధ్రదేశమున వాడిన లిపిని శాసనమునం దుపయోగించియున్నారు శాసనము వేయించినది మాకమహారాజా అల్లుడైన మాకరాజా. తెలుగు కన్నడలిపి వాడబడినది. అక్షరములు చాలా శ్రద్ధగా సుందరముగ చెక్కబడియున్నవి. పంక్తులు సరళముగ ఒకేకొలతలో చెక్కబడియున్నవి. శాసనము చెక్కిన శిల్పికి శాసనములు చెక్కుటయందు మంచిఅనుభవమున్నటుల తోచుచున్నది.

*భాష*

శాసనము ఆరంభమునుండి చివరవరకు తెలుగు వచనము నందున్నది. వచనము సంస్కృత శాసనమునకు అనువాదము. సంస్కృత శాసనము శ్లోకరూపమున వాటి తెలుగులిపియందున్నది. శాసనమునందు సూర్యభగవానుని ప్రశంస కలదు. ర కారమునకు పూర్వాక్షరము ద్విత్వముగనున్నది. ఈ ప్రాంతమున

2. Indian Epigraphy No. 392. 1911.
3. అప్రకటిత శిలాశాసనము.

సంస్కృత శిలాశాసనము నిశ్శంకదుర్గమునతప్ప మరెచ్చట లేనటుల తోచుచున్నది.

**శాసన విషయము**

ఈ శాసనమును మాకమహారాజు అల్లుడైన మాకరాజు వేయించెను మాకమహారాజు కరికాలచోళ మహారాజవంశమువాడు. ఈ మాకమహారాజు కరికాలుని వంశవృక్షమున 142 వ రాజు. కావేరినదిఒడ్డున నున్న కరికాలచోళమహారాజు తిరుపతిప్రాంతమునకు ఎటులవచ్చినాడని ఎందరికి సందేహమే. చిలుకూరి వీర భద్రరావుగారు కరికాలచోళునికి సంబంధించిన పై ప్రచారమును పూర్తిగా ఖండించిరి[4]. కాని కార్వేటినగర సంస్థానమున కొన్నిగ్రామములకు కావేరి రాజపురమని, శ్రీకావేరిరాజపురమని కర్వేటినగర రాజులపేర నిర్మింపబడియున్నవి. కార్వేటినగరరాజుల రాజ్యచిహ్నము చోళులది. చోళనారాయణ నామముతో నారాయణవనమను గ్రామమును కార్వేటినగరరాజులు నిర్మించియున్నారు. (నారాయణరాజు—) కరికాలుని మూడవరాజైన నారాయణరాజు శ్రీ వెంకటేశ్వర స్వామివారి ఆజ్ఞ ప్రకారము వసుధావరాజుకు తన రాజ్యమునుండి అర్ధరాజ్యము నిచ్చినటులు, పై దానము క్షణికాచల (తిరుత్తణి) దేవుని సన్నిధి యందు జరిగినట్లు తెలియుచున్నది. తరువాత నీ వసు ధావరాజును గురించిన విషయముగాని, అతనికి దానముగ లభించిన రాజ్యమును గురించిగాని, ఆ రాజ్యముయొక్క రాజధానిని గురించికాని తెలియవచ్చుట లేదు. నారా యణవనము వసుదావరాజుయొక్క రాజ్యమునకు రాజ ధానిగనుండియుండవచ్చును. తరువాత శాసనమున నారాయణరాజుమండి వారి అనంతర వంశపురుషులను పదిమందికి ఒకని చొప్పున పేర్కొనబడియున్నారు. అవగా పదితరముల తర్వాత ఒక రాజును పేర్కొనుట. ఈ విధముగ వంశక్రమమును పేర్కొనిన శాసనములు మరెచ్చటను కానరావడము లేదు. ఈ నిశ్శంకదుర్గ సమీపమందు సురపురి యను నగరమున్న టుల తోచుచున్నది. శిలాశాసనములో పేర్కొనబడిన మాకరాజు నిశ్శంకపురియను నగరమును నిర్మాణము చేసినట్లు తెలియుచున్నది. కాని ప్రస్తుతము ఈ నిశ్శంకదుర్గ పరిసరములన్నియు అరణ్యమయముగా నున్నవి. విస్తృత పరిశోధనలవలనగాని పై విష యములు తెలియవు. ఈ శిలాశాసనము ప్రకారము కార్వేటినగర రాజులు చోళులైనటుల తెలియుచున్నది.

శతృఘ్న విజయ ప్రబంధమును రచించిన గరుడాంధ్ర సుబ్రహ్మణ్యకవి క్రీ. శ. 865 కార్వేటినగరాజుల మూలపురుషులు సూర్యుడు, వైవస్వతమనువు—సగరాది చక్రవర్తులుగా—వర్ణించి మాకరాజు (నిశ్శంకదుర్గ శాసనములోని చివరి రాజుగా తోచుచున్నది) శాసన పాఠమును బలపరచు చున్నాడు. తన గ్రంథమున కొంత వంశక్రమమును ఇచ్చియున్నాడట.[5]

**కాలనిర్ణయము**

శిలా శాసనమునందు ఎటువంటి కాల నిర్ణ యములు చేసి యుండలేదు. కార్వేటినగర రాజులలో కడపటివాడైన శ్రీ రాజాకుమారస్వామిరాజ 1952 లో దివంగతులైనారు. వారికి మునుపు శ్రీరామభద్ర. రాజువరకు పదముగ్గురు రాజులున్నటుల తెలియుచున్నది. పురాతత్వ పరిశోధకులకు(హైదరాబాదు—మైసూరు) శాసనపాఠము పంపగా వారు త్వరలోవచ్చి పై దుర్గ మును పరిశోధించునటుల తెలియజేసియున్నారు. వారి పరిశోధనానంతరము యింకను అనేక క్రొత్త విషయ ములు తెలియవచ్చును.

శిలాశాసన పాఠమును గ్రహించునపుడు సహక రించిన మిత్రులకు నా కృతజ్ఞతలు.

*నిశ్శంకదుర్గ శిలాశాసనము-అప్రకటితము*

1. యె సూర్యుడు తన సుఖమును హ్వ...... సమస్తలోకాలను పోషిస్తుండు యెనాడు అంతా

2. మాత్రమేకాక సకలక్షత్రియకులములకు ఆదికారణమైనవాడై రాజుల...రక్షిస్తున్నాడు

---

4. ఆంధ్రదేశ కథాసంగ్రహము — మొదటి సంపుటము.

5. భారతి—1964 సెప్టెంబరు. శ్రీ కేత వరపు వేంకటరామకోటిశాస్త్రి—సంపుటము 41.

## నిశ్శంకదుర్గ శిలాశాసనము

3. యదిగ్కా సమస్తప్రపంచములకు ఆది కారణమైన శ్రీమన్నారాయణుడున్ను యాదవవంశ మందు అవతరించి

4. మో అటువంటి సూర్యుడు సత్యపురుషుల ప్రత్యక్షదైవమైనవాడు......కాశి సూర్యవంశమందు

5. యీ కలికాలమందు కలికాలచోళమహారాజు జన్మించెతణ్కి......భాగవంతుడైన చక్రవర్తి కుమారు డుదయించె

6. ఆ చక్రపతి కుమారుడి మనముడై నారాయణరాజు జన్మించె ఈ నారాయణరాజు వసుదావ రాజుకు శ్రీ వెంకటేశ్వరా

7. ......అర్థరాజ్యం యిచ్చి శణికాచల మందు సణనికి......అర్థరాజ్యం నారాయణరాజుకు అనం

8. తర వంశపర న్రదిచక్రరాజు పదోవాడున్ను ఆ న్రదిచక్రరాజుకు రాజోత్తముడైన తిరుమలరాజు పదోవాడైయ్యె

9. అత్యద్భుత పరాక్రమంగల్గిన ఆ తిరుమల రాజుకు నరశింహరాజు పదోవాడైయ్యే ఆ నరసింహ రాజుకు సుఖసాగరుడైన

10. కనకరాజు పదోవాడుంబైయ్యె ఆ కనక రాజుకు మద్రరాజు పదోవాడంబైయ్యె ఆ మద్రరాజుకు రామరాజు పదో

11. వాడంబయ్యే ఆ రామరాజు నారాయణ పురమందు శ్రీ కల్యాన వెంకటేశ్వరస్వామివారి విమానం గర్భగృహ ప్రాకారం గోపురం

12. మొదలైన ధర్మములుచేశె ఆ రామ రాజుకు సుదర్శనరాయని రెండోవాడంబైయ్యె వదాంన్యోత్తముడైన ఆ సుదర్శన

13. రాజుకు వుద్దండరాజు పదోవాడంబైయ్యె వుద్దండరాజుకు మృగాంకరాజు పదోవాడంబైయ్యె ఆ మృగాంకరాజుకు

14. పురర్వరాజస్వామి...రకై తన నామాంకితమైన దివ్యభవనశోభితమైన......నిర్మాణంబు చేశె ఆ మృగాంకరాజుకు పురర్వ

15. రాజు పదోవాడంబైయ్యె అతణ్కి వేలంకిరాజు పదోవాడంబైయ్యె ఆ వేలంకిరాజుకు...... ప్రథమూర్తిరాజు పదోవాడం

16. బైయ్యె ఆ రాజుకున్ అంబికేయరాజు పదోవాడంబైయ్యె ఆ అంబికేయరాజుకు రాజరాజ నఱదండ మాకరాజు యెనిమిదవ

17. వాడంబైయ్యె ఉరుదండ మాకరాజుకు పరాక్రమ ఖండిత శత్రురాజులు గలిగిన శింగరిరాజు జన్మించె ఆ మహారాజు గృహమందు

18. రణంకణ ద్విగుణిత ప్రత్యర్థి పృథ్వీపతి ప్రౌఢ ప్రౌఢి మదాక తోద్యట భటాహంకార హంకార శనుండైన మాకరాజు నదయించె

19. ఆ మాకరాజు నిశ్శంకదుర్గ సమీప మందు సురపురి సత్కారధికారి......నిశ్శంకపురి నిర్మాణంబు చేశే మాకమహారాజు.

20. ముప్పై సంవత్సరములు రాజ్యభారం జేసి వైరాగ్యం పొంద్ది తపముజేశె ... శ్రీ వెంకటాచలాం జన్మించెను

21. ఆయనకు అల్లుడైన మాకరాజు మూడేండ్ల వాడైన ఆ మాకరాజు కుమారుడు రామభద్రరాజుకు పట్టాభిషేకముజేశి ఆయనను

22. సర్వదా పూజించుకుంటున్ను సకల రాజ్య తంత్రముల భరించే ఆ యల్లుడైన మాక రాజులు ఈ వృత్తాంతమును సమస్త జనులకు

23. యెరుక చేశె కొరకై శిలాక్షరముల వ్రాయించె ఆ శిలాక్షరములు యీ లోకమందు ఆచంద్రార్కముగా సంతోషమును

24. జనులకు చేస్తును జయమును పొంద గాత ॥.

# చైత్రసూక్తము

శ్రీ శనగన నరసింహస్వామి

యుగయుగంబులనుండియు మసఁగుచుండ
తిరుగు ఋతుచక్ర మిప్పుడు తిరిగివచ్చె
మఱల నొకసారి చైత్రమాసం! సుప్ర
భాతము! చరాచరాఖిల ప్రణుతచరిత!

జీర్ణవసనము విడనాడి చివురుటాకు
వలువ గైకొని సుమమంజరులను దుఱిమి
చరణనూపుర రవములు సందడింప
మధుపునకు స్వాగతము పల్కుమా! వత్సరమ!

ఓయి! ఋతురాజ! నీ మధురోదయమున
కెపుడు సంపూర్ణఫలసిద్ధి హేతువైన
చెలికి విల్కాని రాక దిక్కులందు
చాటఁబంచితె దక్షిణాశాపవనము!

విశ్వజయకేతు నీ ప్రాణవిభుఁడు నేఁడు
కదలుచున్నాఁడు రతిదేవి! నుదుట వీర
తిలకము దిద్ది బిగి కౌఁగిలి నొసంగి
తీయవింటిని చేతి కందించినావె!

రండు! కోయిల కొమరులు! రండు! శుకకు
మారు లిటు రండు! మన్మథ కుసుమరథము
ముందు వందులై స్తుతిపాఠములు పఠింప
పొండు! ప్రతినదింపఁగ పొదరిండ్లెల్ల

## చైత్రసూక్తము

చంద్రుడా! పట్టుమా! సితచ్ఛత్రమీవు
మలయపవనము! నీవు చామరము నీవు
మదనసమ్రాట్టు వేంచేయు మార్గమందు
చల్లుము వసంత! నెత్తావి మల్లెపూలు.

విల్లు క్రొవ్విరి శరములు విరులు వింటి
నారి తుమ్మెద లిక పరివారము శుక
శారికా కోకిలంబులు సర్వకాల
జయము లక్ష్యము స్మరదేవ! జయము మీకు!

విశ్వజిత్త్వర! శృంగారవీరమూర్తి!
ప్రబలసంసారకారణ! బ్రహ్మాదారి
పరమరిపుకోటి! విస్మయపాత్ర సాధ
నా! అతను; కుసుమశరాసనా; నమోస్తు!



# మాండలిక పదకోశము

శ్రీ నిడుదవోలు వెంకటరావు

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారు పూనుకొన్న సమగ్రాంధ్ర నిఘంటు నిర్మాణ కార్యక్రమములో మాండలిక పదకోశాలు ప్రథమముగా ప్రకటించినారు. వానిలో వృత్తిపదకోశాలు రెండే పటుకు వెలువడ్డాయి.

1. వ్యవసాయ పదకోశము.
2. వాస్తు పదకోశము.

పై వానిలో రెండవదియగు వాస్తు పదకోశాన్ని నేనింతకుముందు 'భారతి'యందే సమీక్షించినాను.[1]

అకాడమీవారు ప్రకటించిన ప్రణాళిక ననుసరించి, ఇంకా మూడు కోశాలు ప్రకటింపవలసియున్నది.

1. చేనేతవృత్తి పదకోశము.
2. మత్స్యనౌకానిర్మాణ పదకోశము.
3. వడ్రంగి కమ్మర పదకోశము.

కాని యీ మూడు వెలువడకముందే—ప్రస్తుతమీ మాండలిక పదకోశ ప్రచురణ జరిగినది.

పేరునుబట్టియే—ఇందు వృత్తులకు సంబంధించిన పదములుకాక, ప్రజావ్యవహారములోనున్న పదములని స్పష్టమగుచున్నది. వృత్తిపదములు సాంకేతికములు కావడముచేత — 'మాండలికములు' అన్నవి — జనపదవ్యవహారములో ఆయా మండలాలలో వాడుకలో నున్నవిఅని మనము గ్రహింపవచ్చును.

405 పుటలుగల ఈ కోశానికి 'కూర్పరి' శ్రీ మడుపూరి కోదండరామరెడ్డి—దీనికొక పరిశోధక సంఘము గలదు. అందు డాక్టరు తూమాటి దొణప్ప, శ్రీ పురిపండా అప్పలస్వామి, శ్రీ గడియారం రామకృష్ణశర్మ, శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ గారలు కలరు.

పై వృత్తిపదకోశములవలె, ఈ పదకోశమునకు వివిధప్రాంతములనుండి పదములు సేకరింపబడినవి. పదములు సేకరించినవారి పేర్లిందు గలవు.

## మాండలిక పదసేకరణ

అవతారిక (13 వ పుట)లో—పదసేకరణను గూర్చి యీ క్రింది వివరాలున్నవి.

'మొదట రమారమి 2500 పదములు (నెల్లూరువి) ఒక ప్రాతిపదిక ప్రతిగా రూపొందించబడినది............1949 లో 'ఆంధ్రప్రభ' ఆదివారము సంచికలలో, వివిధప్రాంతములవారు, భాషాభిమానులు[2] ప్రచురించిన మాటలనుగూడ గ్రహించినాము. ఆవల ఒక సంపాదకవర్గము సమావేశమై వీటిని పరిశీలించి కోశనిర్మాణమునకు రూపురేఖలు నిర్ణయించినది.'

అవతారికయందిట్లున్నను, మాండలిక పద సేకరణ క్రీ. శ. 1949 కి ముందుగానే ప్రారంభమైనది. మాండలిక పదసేకరణయే ప్రధానముగా లక్ష్యమునం దుంచుకొని కొన్నిపదములను మొదట సేకరించినవారు శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావుగారు—నా కోరికపైనివారు నాకు ఈ క్రింది వివరాలు తెలిపినారు[3]. వానిలో కొన్నిభాగముల నుదాహరిస్తున్నాను.

---

1. భారతి. సం. 47. సం. 4. ఏప్రియలు 1970. పుటలు 23—32.
2. వీరి పేర్లన్నియు ప్రత్యేకముగా నీయబడినవి.
3. కామేశ్వరరావుగారి లేఖ తే12-9-1970ది

'భారతి 13 వ సంపుటములో (1934 ప్రాంతము) 'వ్యావహారిక రచనకు కొన్ని నియమములు'అను వ్యాసమును నేను ప్రకటించుచు కొన్ని మాండలికములను తెలిపితిని. పిమ్మట 1938 లో 'వాడుకభాష—రచనకి కొన్ని నియమాలు'అను పుస్తకము గిడుగు రామమూర్తిపంతులుగారి పీఠికతో ప్రకటించుచు; అనుబంధముగా తెలుగుజిల్లాలలోని మాండలికములను డెబ్బది పుటలలో అచ్చువేసితిని. నేను ఉద్యోగ సందర్భముగా తెలుగు జిల్లాలు తిరుగుచు, 1950 దాకా ప్రోగుచేసిన మాండలికములు బహుశః పదివేలుండును — వాటిని నిఘంటువుగా ప్రకటించు తలంపుతో అకారాదిగా వర్గీకరించితిని. అయితే ఆ పనిని ఏదైనా పత్రికలో మొదట ప్రకటించుట మేలని భావించి, వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి అనుమతితో 1951 లో ప్రతివారమును 'త్రిలిఙ్గ' పత్రికలో 5-2-1951 నుండి ప్రకటింప నారంభించితిని..................
..................................................
..................... మాండలికములను అచ్చువేయలేమని 14-9-1951 నాడు నాకు లేఖ వ్రాసినారు. అంతటితో వాటి ప్రకటన పూర్తియైనది. మరల నేను అచ్చువేయలేకపోయినాను.

1955 ప్రాంతములో మాండలిక పదముల విషయమై గంటి జోగిసోమయాజులుగారి వద్దనుండి యొకలేఖ వచ్చినది. నేను ఇతర విషయములలో మునిగినవాడనై దానికి సమాధానము వ్రాయలేకపోతిని. మాండలిక నిఘంటువుల అవసరము విశేషముగా నున్నది.'

మాండలిక పదములనుగూర్చి ఇంతపరిశ్రమ జరిగినను ప్రస్తుత కోశమునందు పై పరిశ్రమను గూర్చి సూచనయైనా లేదు. భాషా సాహిత్య ప్రపంచములో నింతకుముందు జరిగిన కృషిని మనము సంగ్రహించి దానిని పరిశీలించి, ఆ పైని మనము చేసిన నూతన పరిశ్రమను సమన్వయించి సంపుటీకరణము చేసినట్లయితే, అప్పుడా పరిశ్రమ సమగ్రమైనదీ, సాధికారమైనదీ కాగలదు. మనకంటె ముందు పరిశ్రమ చేసిన వారిని స్మరించుట మనకు న్యాయ్యము. వానిని గ్రహించుట మనకు ప్రధాన కర్తవ్యము. అయితే ఈ నాడీ రెండును జరుగుట లేదు. ఈ విషయమై నే నింతకు ముందొకమారు 'భారతి' పత్రికా ముఖముననే హెచ్చరించినాను.[4] సాహిత్య అకాడమీవారీ పరిస్థితిని గమనించి రాబోవు పదకోశములందంతకు పూర్వ మాయా విషయములను గూర్చిన కృషిని, పరిశ్రమను, సంగ్రహించి సమగ్రముగా రూపొందించెదరని కాంక్షించుచున్నాను.[5]

---

4. భారతి సం. 43 సం. 1. జనవరి 1966 పుటలు 63—75. తెలుగు సామెతలు—సాహిత్య అకాడెమీ ప్రచురణ. సంపాదకుడు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ. తెలుగు సామెతలనుగూర్చిన యీ సంపుటములో తెలుగున వేలుకాదు ఒక లక్ష సామెతలను సేకరించిన కీర్తిశేషులు చిలుకూరి నారాయణరావు కృషినిగూర్చి సరికదా, వారి పేరైనా స్మరింపబడలేదు!

5 భారతియందును నీ నడుమ మాండలిక పదములనుగూర్చి వ్యాసములు ప్రకటితమైనవి.

1. మాండలిక పదములు—శ్రీ బి. రా... రావుగారి వ్యాసము మార్చి - 1968.
2. మాండలిక పదములు—శ్రీ ఆవంచ సత్యనారాయణ—కలగూరగంప. ఏప్రియలు 1968.
3. ప్రాంతీయదేశ్యపదనిఘంటువు — శ్రీ ఉమాపతి పద్మనాభశర్మ. నవంబరు 1968.

ఈ వ్యాసములన్నియు, పదకోశకర్తలకాదు నిఘంటు కర్తలుసూ గ్రహింపదగినవి.

## మాండలిక పదకోశాలు: సాహిత్యము

సాహిత్య అకాడమీవారి పదకోశ ప్రణాళికలలో ఆయా మాండలిక పద సేకరణకుగాని, వృత్తిపద సేకరణకుగాని ఆయా ప్రాంతములకు మండలాలకు మనుష్యులనుపంపి వారిద్వారా పదములను సేకరించుచున్నారు. దీనికి కారణము లేకపోలేదు. ప్రణాళికా విధాతల దృష్టిలో—మాండలికపదాలు ప్రజావ్యవహారములోనే సజీవముగా నిలిచియుండును. కవులు కావ్యాలలో వానిని గ్రంథస్థము చేయరని వారి భావన. అందుచేత ఈ పదకోశాలన్నింటిలో కవి ప్రయోగాలకుగాని, కావ్యాలకుగాని స్థానమే లేక పోయినది. ఇది సరియైన పద్ధతిగాదని, వృత్తిపద కోశములకైనా సాహిత్యగ్రంథా లత్యంతావశ్యకముగా పరిగణితము కావలసిన ఆధారాలని నా పూర్వోక్త వ్యాసమున విపులముగా చర్చించినాను. (పుటలు 23—25). చాలా పదములకు ప్రాచీనకవి ప్రయోగాలు చూపినాను. ప్రజావ్యవహారములో, ప్రవాహరూపముననున్న మాండలికాలకు, కవిప్రయోగము వల్లనే—స్థిరత్వము, స్వరూపనిర్ణయము ఏర్పడుతుంది. ఈ సంఘటన యతిప్రాసలమూలమున జరుగుతుంది. ఇందువలన, సాహిత్యకావ్యప్రబంధాలని విస్మరించి, మాండలిక, వృత్తి పదకోశాలు—ప్రచురణము చేయుట 'నేలవిడిచి సాము చేయడం'వంటిది.

## కన్యాశుల్కము

ఇది మాండలిక పదకోశమైనా ఇందు తెలుగు భాషలో ఒక మాండలికభాషకు జీవన్నిఘంటువైన కన్యాశుల్క నాటకము[6] పూర్తిగా విస్మరింపబడుట వింతలలోవింత! కన్యాశుల్కము, ఆదినుండి అంతము వరకు—కళింగదేశ మనబడు, విశాఖ, శ్రీకాకుళము మండలముల నిత్యవ్యవహారముననున్న మాండలిక భాష. గురజాడవారే—ఈ విషయమును నాటకాదిని స్పష్టపరచినారు. తాము వాడినమాటలు కేవలము ప్రాంతీయములు — మాండలికములు—అని వారు ముందుగా 'కళింగరాజ్యములోని మాటలకొన్నిటికి కొన్నిమాటలకు అర్థము'అని ఇట్లా క్రిందివాని నుదాహరణముగా నిచ్చినారు.

గుంట—ఆడపిల్ల

పీక – కంఠము

పేకాట – చీట్లాట

బుఱ్ఱ—తల

సాని—వేశ్య[7]

---

6. కన్యాశుల్కమునుగూర్చి యీ తరువాత నొక వాఙ్మయమే బయలుదేరినది. దానికి 'గురజాడ ము'అని పేరు. ముఖ్యముగా నీ సందర్భమున శ్రీ బం. గో. రె గారి కన్యాశుల్క ప్రథమ ముద్రణము, శ్రీ రమణారెడ్డిగారి 'మహోదయం' పేర్కొనదగినవి. గురజాడనుగూర్చిన సంపూర్ణసాహిత్యవిమర్శ దీనియందు గలదు.

కన్యాశుల్కమువందలి భాష ఒక విశ్వవిద్యాలయ స్థాయిని ప్రత్యేక పరిశోధనచేసి, డాక్టరేటు పట్టము పొందదగినంత విశిష్టత, విస్తృతిగలది—అయితేనేమి? ఇంతవఱకును, తెలుగు విశ్వవిద్యాలయములు మూడింటిలోను నీ విషయమునుగూర్చి పరిశోధన నెవ్వరు తలపెట్టనేలేదు. తక్కిన విశ్వవిద్యాలయముల సంగతి యెట్లున్నను గురజాడ జన్మస్థానమైన విశాఖమండలమున విశాఖపట్టణము (వాల్తేరు)లోనున్న ఆంధ్ర విశ్వవిద్యాలయము దీనిని విస్మరించుట విచారకరము.

7. కన్యాశుల్కములోని భాషా పరిణామమును గూర్చి మొదట నేను శ్రీ తిరుమల రామచంద్రగారి సంపాదకత్వమున వెలువడిన పరిశోధన—'గురజాడ స్మారక సంచిక' (1956) లో 'కన్యాశుల్కము—అందలిభాష' అను వ్యాసమూలముగా వెల్లడించినాను. నాటకమునుగూర్చి 'గురజాడ—కన్యాశుల్కము' అన్నవ్యాసము మదరాసు తెలుగు మహాజన సమాజము వారి ఆరవ వార్షిక సంచిక (1961)లో ప్రకటించినాను.

పై అయిదు పదాల్లోను, నాల్గింటికి ఈపద కోశములో స్థానమే లేదు. చూడండి.

పుట. 139. గుంట = ఎటు పదకొండు గజాల కొలతగల చచ్చవకపు నేల (కరీ) ... అడపిల్ల అర్థము లేదు. కరీ—అనగా కరీంనగరంజిల్లా.

పుట. 271. పీకదీయు— బలవంత పెట్టుచు అని యున్నది. గాని 'పీక' లేదు—కంఠము అర్థము లేదు.

పుట. 306. బుఱ్ఱ. 4 అర్థములు. అందు బుఱ్ఱ అనగా తల అని అర్థము లేదు. తక్కినవి గలవు.

1. కొబ్బరిలేని టెంకాయచిప్ప (కర్నూ).
2. ఎండిన బోలు లాటికాయ బుఱ్ఱ (నె).
3. ఎండిన సొరకాయ బుఱ్ఱ
4. పురుగు తొలచిన గ్రంథములు (అ).

(కర్నూలు, నెల్లూరు, అనంతపుర మండలములు)

పుట. 392 సానిక, సానిమొయ్య పదము లున్నవిగాని 'సాని' లేదు.

పుట. 282 లో పేకాట = చీట్లాట. ఇస్పేటు కాగితాలాట అని కలదు.[8] (సర్కా)

కన్యాశుల్కములోని వందలకొద్దీ ప్రయుక్తమైన పదాలు, క్రియారూపాలు, పలుకుబళ్లు సూచనామాత్రముగానైనా తెలపడానికిం దవకాశము లేదు. అసలు ప్రస్తుత పదకోశములో కన్యాశుల్కము ప్రసక్తే లేనప్పుడా విషయ మప్రస్తుతము. ఈ పదకోశము మాండలికములకు సంబంధించినది కాబట్టి యింతగా వ్రాయవలసివచ్చినది — పాఠక లోకము మన్నించుగాక 9

## ప్రయోగములు : నిఘంటువులు

ఈ కోశమున, అవతారిక ప్రారంభములో పై విషయములనుగూర్చి యిట్లు కలదు.

'గ్రంథముల కెక్కనంతమాత్రాన వీటిని గ్రామ్యములని త్రోసిపుచ్చుట ఆట్టి భాషావాదుల గ్రామ్యతనే తెలుపును. నిఘంటుకారులకు పల్లెల సంబంధము లేకపోవుటవలనను, అప్పటికి తమ కందిన పుస్తకములనుమాత్రమే ఉపయోగించుటచేతను యీ మాటలు ముందుకురాలేదు.'

మాండలికములను గ్రామ్యములని విభాషావాదీ యనడు—అవి భాషాపరిణామవ్యవస్థకు, భాషాచరిత్రకు నత్యంతావశ్యములు — భాషాశాస్త్రము చదివినవారందరికీ యీ సంగతి సువరిచితము - నిఘంటుకారులకు పల్లెల సంబంధముండవలసిన యావశ్యకయంతకంటెలేదు. నిఘంటుకారులకు కావలసినవి గ్రంథములుగాని పల్లెలు కావు. ఇంతకూ పల్లెలలో గ్రామీణులలో వాడుకలోనున్న పదజాల మెంత? అది చాలా పరిమితము. కవులెప్పుడును లోకవ్యవహారము ననుసరించి మాండలికములై ప్రజావ్యవహారములో నున్న ప్రసిద్ధపదములనే వాడుదురుగాని మారుమూల పదములను, కృత్రిమపదములను వాడనేవాడరు.

ప్రస్తుతము వ్యాప్తిలోనున్న తెలుగు నిఘంటువులలో, మాండలికపదములు లేవనుట సరికాదు. ఉన్న నిఘంటువులలో, మాండలికములెన్ని ఇతర పదములిన్నిఅని పరిశ్రమచేసి చూపినవారెవరు? ప్రౌఢ నిఘంటువులోని మాండలికములనైనా మనము

---

8. పేకాటనుగూర్చి సీసపద్యము—రసపుత్రవిజయాది సుప్రసిద్ధ నాటకకర్తలై విశాఖ వాస్తవ్యులైన ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారి అపూర్వ నాగరకత అన్న ప్రహసనమున నున్నది.

సీ. ముక్కపడినవాని మురిపింపఁ జేయుచు
పెంచి ప్రేలింపదే పేకయాట ॥ఇత్యాది

9. కన్యాశుల్కములోని భాషనుగూర్చి నేను కొంత పరిశ్రమచేశాను. ఆ ప్రాంతంలో ఇప్పటికి వాడుకలోఉన్న క్రియారూపాలు అందు కొన్నివందలున్నవి. వానిలో ఒకటోరెండో ఇందులో ఉదాహరించినాను.

గ్రహించినారా? మాండలిక పదసేకరణమునకు పర్యటనముకన్న ప్రాచీన నవీన సాహిత్యగ్రంథ పరిశీలన ముఖ్యముగా జరుగవలెనని యీనాడుకే తెలిపినాను. నేటి మన భాషాపరిశోధన 'లక్ష్యమును' పూర్తిగా విస్మరించి 'లక్షణము' నాశ్రయించుటచేత యిట్టి యవ్యవస్థ భాషాప్రపంచములో పాదుకొన్నది.

పై వివరణనుబట్టి మాండలిక పదములు కవి ప్రయోగములలో లేవనుట సరికాదు. మాండలికములలోనైనను, కవులు సూక్ష్మపదములనే గ్రహింతురుగాని గ్రామీణుల మూలమున ఉచ్చారణలో వికృత రూపము చెందిన పదములను గ్రహింపరు. కవులు గ్రహింపరు కాబట్టి అవి నిఘంటువుల కెక్కవు.

ఇప్పటికిని మనభాషలో ఏవి వ్యావహారిక పదములు ఏవి గ్రామ్యములు – అని పరిశోధనయే ప్రారంభము కాలేదు. పామరోచ్చారణమువలన మారు రూపముపొందిన పదములు గ్రామ్యములు. ఈకోశము నుండి యట్టివానిని మచ్చునకు చూపుచున్నారు.

పుట. 36. ఆశెగాడు: ఆసెగాడు=హాస్యమునకు ఆశె, ఆసె అనునవి గ్రామ్యరూపములు.

పుట. 58. ఎంకమ్మ=పిన్నమ్మ. ఇది వెనకమ్మ. అనుదాని గ్రామ్యరూపము.

వెనకమ్మ <> ఎనకమ్మ <> ఎంకమ్మ

వెనకమ్మ అనగా తల్లి వెనుక పుట్టినది[10].

పుట 114. కెల్లి=నుండి; నుంచి; ఆడికెల్లి అక్కడికెల్లి ఇక్కడికెల్లి. కెల్లి ప్రత్యేకపదము కాదు—మాండలికము కాదు

'ఆడకువెల్లి' అనునది ఉచ్చారణత్వరతో ఆడకెల్లి అయినది.

ఆడకు+వెళ్లి ఆడకు+ఎల్లి—ఆడకెల్లి—డకెల్లి.

ఇచ్చటమ—వె—ఎ—గా మారినది.— చూ. వెంకి. ఎంకి.

పుట. 339. సబ్బీము = సగ్గుబియ్యము — సగ్గు+బియ్యము > <స+బీయము—సబ్బీము.

పుట. 390. సలింద్రము=చలివేంద్ర.

జానపదులలో మాండలికములు పెక్కురూపాంతరములుగా వ్యవహారములో నుండును. అట్టివానిని కవులుగాని నిఘంటుకారులుగాని గ్రహింపరు. ఇచ్చట చెప్పవలసినది చాల గలదు. కాని యిది యదనుకాదు. ముఖ్యముగా వకారము అర్ధాచ్చు కాబట్టి సులభముగా 'అచ్చు'గా మార్పుచెందును. అట్టి వకారముతో, వ్యవహారమున 'అ' కారాదియైనవన్నియు నిఘంటుకారులు గ్రహింపరు. యతిప్రాసలమూలమున నిర్ధారణములైనవిమాత్రమే గ్రహింతురు.

ఉదా. వెంపలి—ఎంపలి—వెన్న — ఎన్న — మొదలగునవి; ఎంకి ఏదాలు మొదలగునవి నిత్య గ్రామ్యములు.

ఈ కోశమున మాండలికముల కించుమించుగా నన్నింటికి ప్రయోగములు చూపవచ్చును. గ్రంథ విస్తరభీతిచే కొన్నిమాత్రమే చూపుచున్నాను.[11]

---

10. ఇప్పటికి ముప్పయియేండ్ల క్రిందటి ముచ్చట బళ్లారిలో నొక సాహిత్యసభలో శ్రీ. శ్రీ. కాశీ కృష్ణాచార్యులుగారు అధ్యక్షులు. ఆ సభాకార్యక్రమములో మాట్లాడవలసిన యైదుగురిలో నేను మొదటివాడను. కార్యక్రమము ప్రారంభించుము అధ్యక్షులు నన్నుగూర్చి 'హారిసేరు వెంకటరావుగారు. అనగా వెనకటిరావుగారు. అయినా నేడు వారు ముందటివారుగా ఉపన్యసిస్తారు' అని చమత్కరించినారు.

11. తెలుగు నిఘంటువులలో పదమునకు ప్రయోగము చూపనిదే నిఘంటువున కెక్కింపనని నా నియమము, (చూ. శబ్దరత్నాకరానుబంధము, పీఠిక. 4 వ పుట.)

## కవి ప్రయోగములు : ప్రాచీనములు

పుట. 2. అంగీ=కాళ్లవఱకు పొడవుగల చొక్కాయి (శ్రీ). ఇది కేవలము శ్రీకాకుళముజిల్లాకు చెందిన మాండలికముగాదు. సర్వాంధ్రదేశమునకు సంబంధించినది.

'క. అంగీలు పచ్చడంబులు
సంగిలిగా శాలు జోళ్లు సరిగంచుల మేల్
రంగుల దుప్పటు లన్నియు
గొంగడి సరిపోలవన్న గుర్వలచెన్నా'.

గొంగడికి ప్రాచీన ప్రయోగము గలదు.

'పలుచని జోళ్లు కుప్పసములు బావి
పసపడి యలంతి దుప్పట్లు గొంగడులు.'
పండితారాధ్య చరిత్ర—పర్వతప్రకరణము
పుట. 339.

పుట. 148 లో 'గ్రా' క్రింద
గొంగడి బావుళ్లు=గొల్లలు (కరీ)

'కరీ' అనగా కరీంనగరంజిల్లా — పోతన యీ ప్రాంతమువాడు గావున—భాగవతమున—గొంగడులను కప్పుకొన్న గొల్లకుమారులనిట్లు వర్ణించినాడు.

క. గొంగడు లెగురఁగ వైచుచుఁ
జంగున దాఁటుచును జెలఁగి చప్పట లిడుచున్
బొంగుచుఁ గృష్ణునిఁ బొగడుచు
గ్రుంగిన రక్కసునిఁ జూచి క్రుళ్లిరి కొమరుల్.
భాగ. పూ. 10.434.

ఇచట కొమరులనగా గొల్లలు. అందే 430 పద్యములో

'ఆ కుమారులు (బలరామకృష్ణులు) గోపకుమారులుగూడి' యని గలదు. అందువలన గొంగడి బావుళ్లు — అనగా గొల్లలు — గొల్లకుమారులుకూడా కావచ్చును.

బావుళ్లు — దీని వ్యుత్పత్తి పరిశోధింపవలసి యున్నది.

పుట. 35. ఆలాజాలము = 1. చీకు చింతా లేకుండుట—అని నాలు గర్థాలున్నవి.

'ఆయన ఆలాజాలంగా వుంటాడు.'

ఇది చాలా ప్రాచీనపదము. ఇది తత్సమము. అలజాలమనగా మినపదము నీటిలో చేప పోవుచున్నప్పుడు మార్గ మేర్పడినట్లు కనబడి వెంటనే మాసిపోవును. నాచనసోముడు ఉత్తరహరివంశమున దీని యర్థము తెలిపినాడు.

'అలజాలము నీటిలో వాడురీతి.' 5—110.

అనగా — అంటీఅంటనట్లుండుట — తాళ్లపాక అన్నమయ్యగారి సంకీర్తనంలో విది గలదు.

'అలజాలమువోలె నన్నీట దేలినవాఁడు'.

ఇది నెల్లూరి మండలమున నేటికి మాండలికముగా వాడుకలోనుండుట విశేషము.

పుట 41. ఇలువరుస—(2) ఇంటికి ఒకరు వంతున—ఇలువరసన అన్నానికి పిలిచినారు. (నె)

నన్నయ దీనిని వాడినాడు.

'హాఁడక్కజముగ...దొల్లి యిల్వరున
మ్రింగుచునున్న' ఆది. 6—264.

పుట. 43. ఈఁడు చదివించు = పెండ్లిలో కట్నము చదివించు. (వి)

విశాఖమండలమున వీడు చదివించు అని వకారాదిగానే వాడుక. కవి ప్రయోగములు దీనినే సమర్థించుచున్నవి.

క. వీడు చదివించె నయ్యెడ
వీడని వేడుక బలారి విబుధులతో వే
వీడు మణు లనఁగఁదగు తన
వీడునఁగల మానికములు వివిధాంబరముల్
వసు. 6—120.

పుట. 46. ఉచ్చుమల్లి=బరిబత్తల; నగ్నముగ నున్న స్త్రీ (మ).

శబ్దము ఉచ్చమల్లి.

'ఉచ్చమల్లివచ్చి యడ్డపడిన నగ్నికం జూచి'

ఉ హరి. 6-182

పుట. 94. కలప=1. కొయ్యసామాను 3. సేద్యపు సామాను.

కలప అనగా ఇండ్లు కట్టుట కుపయోగపడు కొయ్యసామాను.

'యాగ నిలయంబు గలపయుఁ గలశములును

భార. అశ్వ. 3.156.

పుట. 151. గోచిపాతలరాయుడు=నిరుపేద (నె)

'రమణ గోచిపాతరాయఁడు దొంగల

మిండఁడనెడు సూక్తియుండకున్నె

కుచేలోపాఖ్యానము 1—56.

పుట. 166. చీలి=మాటకుముందే యేడ్చువ్యక్తి (చి) ఇది విశాఖ మాండలికమే.

'సీ. పా. జగడాల చీలివై సవతితో పోరాడి

యిట విల్పుటకును నేతెంచి తొక్కొ'

శీలశబ్దభవము. 'చీలి' అనగా స్వభావముగలది యని యర్థము.

జగడములాడు స్వభావము గలది.

అడిదము సూరకవి చెలువుమీది పద్యములు.

పుట. 199. తలమునుకలు. విజయవిలాస ప్రయోగముకంటె చాలా ప్రాచీన ప్రయోగమున్నది.

'తలమునుకయగు స్వీరోధి తతి కబ్జభవా''

నన్నె. కు. సం. 4-26.

పుట. 247. నెయ్యలు=పేలాలు—వియాలు—(గం) గంజాంజిల్లా.

దీని కొక్కటే ప్రయోగము. మచ్చ వెంకటకవిది12. అతని శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన కుశచరిత్రమున గలదు. నిరోష్ఠ్య నియమము ననుసరించి—వ—కార ముండరాదు. కావున 'పేలాలకు' బదులు 'నెయ్యలు' అని ప్రయుక్తము.

పుట. 264. పాదుట్టు=పాజాట్టు (కరి)

ఇది దేశమంతటా వాడుకయున్న మాండలికము

'పానరిన పదొట్టుఁ బోవంగఁ దుడిచి

బసవ పురాణము. పుట. 82.

విశాఖ శ్రీకాకుళం జిల్లాలలో పాజాట్టు.

పుట. 295 ఒత్తల = నగ్నము; దిగంబరత్వము (మ రా) దీనికి బహుప్రాచీనమగు శివతత్త్వసారముననే ప్రయోగము గలదు.

క. కుత్సృష్మాది విపత్తులు

బత్తలజలతపనశీతవాతాదులు ను

దృత్తగతి బొందవెఱచు ను

దాత్త భవత్ భక్తి యుక్తులగు వారి నజా

168 ప.

పుట. 320. మచ్చు—(1) అట్టు—అట్టవ—మచ్చు—అనగా మీద కట్టడములేని మిద్దెటిల్లు.

'అత్యున్నతమైన మచ్చు వయినించు'

కేయూర'. 2-47,

పుట 335. ముంజ = తాటికాయలోపల నుండు మెత్తటిపదార్థము. ముంగు: ముంజ (నె)

క. ముంజపదనైన శంబరభంజను

............ క్రీడా. 54.

---

12. మొట్టమొదట వీరేశలింగముగారికన్న, శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన రచన చేసిన కవి మచ్చవెంకటకవి.(1840—1904) ఈతడు పర్లాకిమిడి రాజావారి కళాశాలలో గిడుగు రామమూర్తి కాలమున తెలుగు పండితుడు. కళాప్రపూర్ణ గిడుగు సీతాపతి, కళాప్రపూర్ణ చిలుకూరి నారాయణరావు, శ్రీ తాపీ ధర్మారావుగార్లితని శిష్యులు! ఈ కుశచరిత్ర క్రీ. శ. 1893 లో అముద్రిత గ్రంథ చింతామణి పత్రికలో ప్రకటితమై—ఆ కాలపు పండిత మండలిచే ప్రశంసింపబడినది.

పుట. 363. లోగిలి—

'లోఁగిటికిరాని రూపముఁ

గొఁగిటికిరాని పొందు.'

ఉ. హరి. 5—99.

పుట. 373. వల్లమునంచి-డబ్బువేసి వడుముకు కట్టుకొను తిత్తి జాలెసంచి. (అ)

'వల్లంబుసోవాడు వైశ్యుని శేవను'.

హంస. 1—32.

పుట. 383. సమగొయ్యలు - బండిపరంమీది నాట్లు (కొయ్యలు); గుజ్జాలు.

సీ. వంకరుహంబుల బండికండలు చంప

కంబులు నొగ లుత్పలంబు లిరుసు

కరవీరములు పలుగాడి జాదులు సమ

గొయ్యల శోకముల్ గోడిపీట.

కు. సం. 4—83.

ప్రబంధములు కొన్ని ప్రసిద్ధములగుటచే సాంకేతికములు సూచించినాను. పైవి మచ్చునకు మాత్రమే.

## కవి ప్రయోగములు :
## ఆధునికములు

కన్యాశుల్కము వరవడిగా, విశాఖ శ్రీకాకుళ మాండలికములో వ్రాసిన నా 'మించుపల్లె' అనే ఖండకావ్యమునుండి ప్రయోగములు చూపుచున్నాను[13]. ఇవి తక్కిన జిల్లాలలోనే వాడుకలో నున్నట్లుగా నీ గ్రంథమున చూపబడుటచే ప్రత్యేకముగా నిందు వివరించుచున్నాను.

పుట. 20. అయిపిలేదు-జాడలేదు : అయిపు లేదు. (గు)

గు. అవగా (గుంటూరుజిల్లా)

గీ. దివసములు రేలువారముల్ తిథులు పక్ష

మాసముల నింకొకేడాది మగిడిపోయె;

అడుపము చింట యిల్లని యయిపులేదు

ఏమి కానున్నదో ముందర ఔవరికెఱుక.

(ప. 88.)

పుట. 31 ఆదరువు. ఆధారము — (అ) అనంతపురంజిల్లా.

గీ. ఆయవారమదియ యాదరువైనవు

పంచభిక్ష తుష్టినించునతఁడు (ప. 53)

ఎడచంటి—లేదు—

పాలువదలిన పాప

క. కడచంటియు నెడచంటియు

గుడిమెడమలఁ గొంగు పట్టుకొని పై బడుమవ్

మెడకాళ్లఁ జుట్టు బిడ్డల

కడునోరిమి సాకు నామె గంపెండ్లైనన్.

(ప. 59)

పుట. 67. ఏకరువుపెట్టు. 2. కంఠతా వచ్చిన దానిని చదువు. (నె. కర్నూ)

గీ. యోగకరణంబులును విశేషోపరాగ

కర్మకాండను కూడ నేకరువుపెట్టు

(ప. 147)

పుట 70. ఐన—సంపన్నమైన. ఐనిల్లు—సంపన్నమైన యిల్లు—మంచియిల్లు.

ఆ. గీ. ఈడుజోడు చూచి యిల్లువాకిలి చూచి

చుట్టుకుదనపుమేలి తెలుగుచూచి

ఐన యింటివాని కప్పన ప్రెగ్గడ

పెద్దకూతునిచ్చి పెండ్లిచేసె (ప. 85)

పుట. 82. కట్టుకొంగు: నడుముకు కట్టిన చీరకొంగు: పైటకొంగు.

సీ. పా. కట్టుకొంగుల కూర్పు కడకొంగు చీరల

నెడముపైటలచీరె

(ప. 20.)

---

13. వీనిలో కొన్ని నా శబ్దరత్నాకరానుబంధమున గలవు.

పుట. 82. కట్టుకొను — పెండ్లాడు —
వి. (శ్రీ). జిల్లాలతో కట్టుకొను—అనగా, ఒప్పుకొను, అంగీకరించు.

సీ. పా. కరవాక కోమటి కట్టుకో డిబొమ్మ
చీటినా కేలని పేద్యగాడు. (ప. 37)

కడచంటి—లేదు. పాలుత్రాగుచున్న పాప—
క. కడచంటియు నెడచంటియు. (ప. 59)

పుట. 92. కరాటము—ఔషధములు దాచి యుంచు పరికరము—(శ్రీ).

కరాటము అనగా కాటుక పాళించి పెట్టుకొను బరణిచిప్ప. ఇది కొయ్యతోచేయబడి పొదుగుకొయ్యతో అతికింపబడును.

సీ. పా. కొన్నవేరి మెడపుల కొయ్యకరాటంపు
రకమైన మేలికాటుకల నలుపు. (26 ప.)

పుట. 129. గడి. సరిహద్దు.

క. బడిబాపడు, గడిం దేడం
గడి కోమటి మడిని కాపు గరిగెడి తొలి క
ట్టడిచేతల నడకలచే
నలరింపంగాదె యగ్రహారం బెపుడున్.
(ప. 14)

పుట. 135. గాడి. గాదె. ధాన్యము నిలువ యుంచి కట్టుడము.

క. గాదెయు బోదెయు గేదెయు
వేదనినాదంబు హోమవేదిక యావుం
బూదయు, పాదులు, పాదుక
లేదని కన్పట్టు గృహము లే దచ్చోటన్.
(ప. 5)

గాదె, బోదె, గేదె – పల్లెసంపద.
గుడ్డె—లేదు—చేను.

గీ. పెరటిలోం గ్రొత్తనాటిన మిరపగుడ్డె.
(ప. 12)

పుట. 152. గొసెన = ఒక వస్తువుపైన తొడుగుగుడ్డ: ముసుగుగుడ్డ. ఠంబూరగొసెన—(వ: అ). అద్దము మొదలైనవానిపైవేయు గలీబు,

'పావగిన నీలిగౌసెనను
పుచ్చిన వెల్గడి యద్దమట్టులన్.'
(89. ప.)

పుట. 156. చద్దికూడు—

గీ. ప్రొద్దుపొడిచినతోడనే చద్దికూడు
గుడిచి యాట్లాడుదురు బాలకులు సతంబు'
(15. ప.)

పుట. 160. చాయపసుపు. స్త్రీలు స్నానము చేయునపుడు పూసికొను పచ్చిపసుపు. (నె. తె.)

గీ. పెరట గృహలక్ష్మి పీఠంబెట్టినట్టి
ముదురు నునుచాయపసుపు చేముద్దనంగ
నూతి పళ్లెంబు చెంగటి గోతి దరికి
నిమ్మలును దబ్బపండ్లును నిండియుండు.
(ప. 14)

గీ. తెల్లకాటుకం బోలిన కల్లబొల్లి,
వెల్లిపూతల నెటుంగరు వెలందులచట
మిసమిసల నీను మైజిగి నెసకమెసగ
పసనుమించెడు నునుచాయపసుపుగాక.
(ప. 22)

పుట. 168. చుమ్మగుడ్డ. చుట్టగుడ్డ. (శ్రీ)

గీ. తలకుం జుట్టుగుడ్డ మొలగోచి యొంటట్టు
ప్రాతచెప్పు పెద్దబాణకఱ్ఱ
మంటికడవ నులకమంచంబు పూరిల్లు
గలిగి బారికాడు కాచు పల్లె. (ప. 19)

తరవాణిలేదు-చద్దన్నములోని నీళ్లు—తరవాణి అన్నముఅని వాడుక.

గీ. ఒడలుచెడి గడసమొల్లను కడకుదెచ్చు
నుడుకు నీరంపు వింత త్రాగుడులు లేవు
మల్లెపూవట్లు మొల్లమై చల్లనగుచు
తెల్లనైనట్టి తరవాణి తేటగాక. (ప. 30)

వి. (శ్రీ). జిల్లాలలో తరవాణినే — గోదావరీ మండలమున పుల్లనీళ్లని వాడుదురు. కాని యీ

కోశమున 275 వ పుటలో పుల్లనీళ్లు-1. కల్లు (గో) అని యున్నది.

వగదు – లేదు—నాణెములు—మొత్తము.

సీ. వగదుకై పనిచేసినాను యీ ముద్దర
బొమ్మ నా కేలవి పూటకూలి
(ప. 37.)

పుట. 251. పంచ-మగవారు కట్టుకొను ధోవతి : పంచె.

ఆ. వె. తలకు నెండ తఱిని తడి యంగవస్త్రంబు
చలికి జమిలినేత జంట బట్ట
మొలకు నేడుమూర్ల ముతుక పంచెలవాపు
గలుగఁ జాలు జన్నిగట్టులకును
(ప. 33)

పళ్లెము—లేదు. నూతిచుట్టూ కట్టి యుండెడి గుండ్రని చప్టా.

గీ. నూతిపళ్లెంబు చెంగటి గోతిదరిని
నిమ్మలును దబ్బచెట్లును నిండియుండు.
(ప. 14.)

పుట. 265. పారిగోడ

చ తెలినును పారిగోడలును తీర్చిన మిద్దెలు
(ప. 4)

పుట. 294. బక్కలు. దుక్కిటెడ్లు ((శ్రీ)
బక్కలు. అనగా పాడి పశువులు

ఉ. ప్రొద్దున పాలనుంబిదికి బూదల
నమ్మలకప్పఁజెప్పివే
చద్దుల మెక్కి పచ్చికల చాయల
సొమ్ములమేపుచుం బులుం
బొద్దులుగట్టి నెత్తినిడి
ప్రొద్దటువాలకముప్న బక్కలన్
దద్దయుఁ దోలితెత్తురు
ముదంబున వచ్చుటి యాలకాపరుల్
(ప. 16)

శ. ర. లో ఈ యర్థము లేదు.

పుట. 304. బుగత. 1. యజమాని.
2. బ్రాహ్మణుడు ((శ్రీ)

బుగత– ఇది 'భుక్త' శబ్దభవము. గ్రామములో నొక ఖండము ఏకభోగముగా ననుభవించువాడు. భుక్తశబ్దము—ఆయా నామములతో చేర్చి వాడుదురు. రామన్న భుక్త. వెంకటేశం భుక్త.

గీ. పేరువడసిన యప్పన ప్రెగడబుగత
గారి లోగిలి కెదుటి బంగారుపేట. 10. ప.

అందఱికంటె హెచ్చు భూభాగ మనుభవించు వానిని 'పెద్దబుగత' అని యందురు.

బూద—పాలకుండ—లేదు.

ఉ. ప్రొద్దుట పాలనుం బిదికి
బూదల నమ్మల కప్పఁజెప్పి. (ప 16)

'బూద' పమచరిత్రకారు డుపయోగించినాడు. 'చదలన్‌బూద' (4—32)

పుట. 313. బొద్దు (5) పెద్దగడ్డి మోపు. (నె. తె: అ.) వి. (శ్రీ).

'పులుంబొద్దులు గట్టినెత్తినిడి.' (ప. 16)

పుట. 315. బోదె. ఈ క్రింది యర్థము లేదు. స్తంభములపై ధాన్యాదికములు నిలువచేసెడి వెదురుబద్దలు గడ్డితో నిర్మించు గది.

'గాదెయు బోదెయు గేదెయు' (ప. 5.)

పుట. 325. మిద్దె-రాతిమేడ (మట్టిది కానిది) (అ) వి. (శ్రీ); మిద్దె అనగా మట్టితోను కఱ్ఱలతోను దట్టముగా గోడలపైవేయు కట్టు—పల్లెలలో ఒకటిరెండు గదులకు నిట్టే కట్టుండును. దానిపై—ఇంటితాటాకు కప్పుండును. మధ్య ఖాళీ స్థలముండును. ఇళ్లు కాలినప్పుడు, తక్కినభాగము కాలిపోయినను, మిద్దెగదులు చెక్కుచెదరకయుండును.

చ. తెలి నును పాలిగోడలును తీర్చిన మిద్దెలు.
(ప. 4.)

పుట. 384. రచ్చ (3) రచ్చబండ—చావిడి.

రచ్చబండ—చావిడికాదు ఒకే పెద్దబండ — విశాలముగామండును. దీనిపై—ఊరిపెద్ద కూర్చుండి తగువులు తీర్చును. ఇది రావివేపచెట్లమధ్య నుండును,

గీ. రాచపెప్పాట(పక్కను రావి వేప
రచ్చ దిమ్మనునంటిన రచ్చరాయి
పేరువడపిన యప్పన్న పెగడ బుగత
గారిలోగిలి కెదుట బంగారుపీట.

(వ. 10)

పుట. 40. సొమ్ములు పశువులు.

వచ్చికలం జాయల సొమ్ముల మేపుచుం[14]

(వ. 16.)

అర్థ వివరణము విమర్శలో నింకను ఇందుండి (ప్రయోగములు కలవు.

## పద—అర్థవివరము : విమర్శ

### అ

పు. 5. అంబాజీపేట ఆముదము = గొప్ప మోసము; కుంభకోణమవ్వట్లు (ఉ. గో.)

వి. శ్రీ. జిల్లాలలో ఈ అర్థము పట్టదు.

ఇది వదిలించుకోవడమునకు వీలుకాని మనిషిని గూర్చి వాడుతారు.

'వాడు అంబాజీపేట ఆముదంలాగ నన్ను వదిలి పెట్టడంలేదు'. అంబాజీపేట ఆముదానికి ప్రసిద్ధి.

పుట. 6. అక్కల ముత్తయిదువు = కొన్ని (బ్రాహ్మణ కుటుంబములలో పెండ్లికూతురు అత్త వారింటికి మొదట వచ్చినపుడు ఆరాధింపు దేవతలు. వీరు పూర్వము ఆ కుటుంబమున కన్యలుగా ఉండి పాతివ్రత్యమహిమతో వెలసిపోయినవారు.

అక్కలు అనగా—(బ్రాహ్మణ కుటుంబములలో వివాహానంతరము కామేశ్వరి కొలువుపెట్టినపుడు, ఆ కొలువులో పాల్గొనే ముత్తయిదువలు. వీరు ఒకే యింటివారి కెంతమాత్రమును సంబంధించినవారు కారు.

'వీరు పూర్వమున ఈ కుటుంబమున కన్యకలుగానుండి పాతివ్రత్యమహిమతో వెలసిపోయినవారు' అన్నది సుతరాము అసంగతము—ఈ అక్కలు ఏడు గురు.

ఆదిలక్ష్మి కామేశ్వరి అక్కలపాటలో స్పష్టముగా నీ అక్కలేడుగురు గౌరీదేవి యవయవముల జన్మించినవారని కలదు వీరికి ప్రత్యేకముగా పేర్లున్నవి. వీనిలో ముఖ్యురాలు కామవల్లి మహాలక్ష్మి. ఈమెకే కామేశ్వరియని నామాంతరము. తక్కినవారికి వేఱువేఱు పేర్లున్నవి గాని యందఱకు 'అక్కల'నియే పేరు. కామేశ్వరి కొలువునాడక్కల ముత్తయిదువుల కర్చన జరుగును. అక్కలపాట పాడినప్పుడు (స్త్రీలకు శివమెత్తును, ఈ కొలువు ముగిసి భోజనము లగునరికి సాయంకాలమగును. అందుచేతనే—

'అక్కలు లేచేటఱకు నక్కలు కూసినవి'అని సామెత వ్యాప్తిలోనికి వచ్చినది.[15]

'ఇందే చివర మతియొక వాక్యమున్నది. 'ఇట్లే

---

14. మించుపల్లిలోని మాండలిక పదముల (ప్రయోగములను (ప్రశంసించుచు నా కాలమున కీర్తిశేషులు చిలుకూరి నారాయణరావుగారు పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు ఉత్తరములు వ్రాసిరి. దీనిలో నేను కొన్ని పద్యములకు వ్యాఖ్య వ్రాసితిని. అందు చాలా విశేషములున్నవి. నేడు కావ్యమున కంతకును విపులముగా వ్యాఖ్య వ్రాసి యున్నాను.

15. చూడుడు. తెలుగు సామెతలు — నా విమర్శ భారతి న. 43. సం 1. (జనవరి 1966 పుటలు — 63—75) ఈ కామవల్లిమహాలక్ష్మి (ప్రస్తావన తొలుత (క్రీడాభిరామమున (ప్రభాకరశాస్త్రిగారి పీఠికలో గలదు. దీనినే కీర్తిశేషులు సురవరము (ప్రతాపరెడ్డిగారు తమ ఆంధ్రుల సాంఘికచరిత్రలో ననువదించితిరి.

పెండ్లి కుమారుని యింటజేయు పొంగెమును 'గురు నాథ పొంగలి' యందురు.'

ఇచ్చట చెప్పవలసినది చాలా గలదు. 'గురు నాథ పొంగలి వ్రతము'—కామేశ్వరి కొలువు - అనగా అక్కల కొలువు జరిగినప్పుడే జరుగును. దీనికి ప్రత్యేకముగా వ్రతకల్పమున్నది. ఇందు మగవారు పాల్గొందురు. హరిహర పుత్రుడైన గురునాథే శ్వరస్వామికి నివేదించు నైవేద్యమునకు గురునాథ పొంగలి అనిపేరు.[16]

పుట. 18. అనుందస్తా=తాంబూలము దంచు కొను; చితకకొట్టుకొనుటకు ఉపయోగపడును; మామదస్తా. (శ్రీ). 'అమాందస్తా' అనియే వాడుక. తాంబూలమేకాదు, పిక్కలు, కాయలు మొదలగునవి చితుకకొట్టుటకు నుపయోగించునది.

పు. 22. అరివాణము = సంధ్య వార్చుకొను పళ్లెము. సంధ్య వార్చుకొననదేకాదు — భోజన పదా ర్థములు నుంచునది.

## ఆ

పు. 29. ఆగాకర = ఆకుపచ్చనిరంగుతో ముల్లుముల్లుగా ఉండు గుండ్రని ఆకారము (శ్రీ) దీని యర్థమేమో? అర్థము సంబద్ధము.

ఆగాకర— కూరగాయ కాకరకాయజాతిలో చేరినది. ఆగాకర యనగా, ఇండ్లపెరడులలో పెరుగక — అడవిలో పెరుగునది—'అడవికాకర' 'ఆగాకర'యైనది.

గీ. కాకరయు బీర పొట్ల యాగాకరయును
దొండ యాదొండ నేదొండ మెండుకొనగ
మించుపల్లె. ప. 36.

ఈ ఆగాకర మాంసముతోవండిన చాలా రుచిగా నుండును. దీనిగూర్చి యొక చాటువు వినండి.

'కేకికచాకచోచ్చయ వికీర్ణమనోహర కేతకీదళ
స్వీకృత మూర్తసౌరభ విశేషముకం బెను
మజ్జిపండ్లచే
మైకొని క్రొవ్వుపోలుగుల మాంసముతో పరి
పక్వమైన యా
గాకర కాయకూర నవకమ్ముగు నామెత రాచ
వారికిన్

(కవిరాజ వత్సవాయి నీలాద్రిరాజకవి)

పుట. 29. ఆటవిడుపుపద్యము=సెలవులలో విద్యార్థి కంఠస్థము చేయవలసిన పద్యము (చి. నె.) ఇది సరికాదు—ప్రతిదినము బడిలో—ఆటయైనతరు వాత బడి విడిచిపెట్టినపుడు అందరును కంఠస్థము చేసి చదువు పద్యములు—(చూ. ఆటవిడుపు పద్య ములు.) (చాటుపద్య మణిమంజరి)

పుట. 33. అపుగోర. రెండు అంతస్తులు కలిగినటులచేసిన కుచుపాత్ర. (శ్రీ).

క్రిందభాగము హెచ్చుగుండ్రముగాను రానురాను మూతివద్ద సన్నముగానుండు కంచుపాత్ర. దీనిని మంచినీళ్లు త్రాగుటకు నుపయోగింతురు.

పుట. 34. అరిందా=ఒక వృత్తిలో నైపు ణ్యము గడించినవాడు (శ్రీ. వి. తె.) ఇది స్త్రీలకు కూడా శ్రీ. వి. జిల్లాలలో వర్తించును. ఆమె అరిందా అయింది.

పుట. 34. అరెమరాటీలు=బొమ్మలాటలాడు వారు ఇది ద్రిమ్మరిజాతి. వీరు మహారాష్ట్ర దేశీ యులు. (నె. పా.) ఈ పదము అగ్గినిప్పువంటిది— రెండు పదములు నొకేయర్థమును దెలుపును. అరె అనగా మహారాష్ట్రులు—వారి భాష మహారాష్ట్ర భాష—అరెభాష. పాల్కురికి సోమనాథుడు పండితా రాధ్య చరిత్రలో శ్రీశైల శివరాత్రి సందర్భమున— 'అరెపరున' మహారాష్ట్ర యాత్రికులను వర్ణించి యున్నాడు—ఇంకొక చిత్రము. అరెమరాటీలు—ఆరు మరాటీలుగా మారినారు! చూ. ఆరు మరాటీలకథ.

---

16. చూడుడు. ఆదిలక్ష్మీ కామేశ్వరి అక్కల పాట—పొంగలివ్రతము— ఈ గురునాథేశ్వరస్వామికథ బందరులో శ్రీ చల్లా లక్ష్మీనరసింహశాస్త్రిగారు ప్రకటించియున్నారు.

ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారము. పుస్తక వివరణ. ఇది యాధునికము. ప్రాచీనముగాదు.

ఇ

పుట. 38. ఇచ్చిరూపాయ=వెండిరూపాయ (వి) ఇది 'ఇచ్చరూపాయ'గాని ఇచ్చిరూపాయకాదు.

'అర్ధరూపాయిస్తె అంటేదిలేదు'
'ముప్పావులాయిస్తె ముట్టేదిలేదు'
'ఇచ్చరూపాయిస్తె పుచ్చుకుంటాము'
— దసరాపద్యాలు

పుట. 41. ఇల్లరి=(1) ఇంటిపై పన్ను— ఇల్లరిపుల్లరి లేనివారు (పుల్లరి—పులవరి=గడ్డిపన్ను, మేతపన్ను) (వె. పా).

పుల్లరిఅనగా పశువులుమేయు . పచ్చిక బీడులపై పన్ను— (చూ. కాటమరాజుకథ.)

ఇల్లరికి పుల్లరికి గల్గు నల్లరులును
అంగడినిగల్గు చాకలి మంగలియును
ముంగురులుగల్గు బాపనమొగము సిరులు
మందునకునైన నా పల్లెయందులేవు.
మించుపల్లె. ప. 38

ఈ

పుట. 45. ఈసురు=మిక్కిలి కృశించియుండు (కరీ). ఇది కరీంనగరం మాండలికముగా చూపబడి నదికాని వి. శ్రీ. మండలాలలో కూడా ఉన్నది.

ఈసురోమని మనుసులుంటే దేశమెట్టులు బాగుపడునోయ్.

(గురజాడ)

ఉ

పుట. 52. ఉర్లాంపద్దు—సన్మానముపొందిన పండితుడు. శ్రీకాకుళంజిల్లాలో ఉర్లాం సంస్థాన ములో ఆరితేరిన పండితులకు సన్మానం జరిగేది. (వి). అందుకని అక్కడ సన్మానంపొందిన పండితుని ఉర్లాంపద్దు అంటారు. ఇంత వివరమున్నా అసలు అర్థము మృగ్యము. ఉర్లాంపద్దు—అనగా—వేదపండి తుడని, వేదము బాగా చదువుకొన్నవాడని అర్థము. ఉర్లాం సంస్థానములో ప్రతిశ్రావణికి—వేదపండితుల నాహ్వానించి, పరీక్షచేసి పట్టాలిచ్చేవారు. అట్టి వారికే 'ఉర్లాంపద్దు'అనిపేరు. ఇతర సాహిత్యశాస్త్ర పండితుల కేమాత్రము సంబంధము లేదు.[17]

పుట. 53. ఉల్లాకు = బంగారము పరీక్షచేసి నికషము నిర్ణయించుట—ఇది ప్రత్యేకమైన విద్య. (వి). ఈ 'ఉల్లాకు' ప్రత్యేకమైన విద్యకాదు. ఇది బంగారము విలువకట్టు పద్ధతి. ఈ పద్ధతి విశాఖ మండలమున మాత్రమే యున్నది. స్వర్ణకారులైన విశ్వబ్రాహ్మణులు బంగారపు వస్తువులనుగాని, పాళా బంగారముగాని వన్నెరాతిపై రాచిచూచి, వలసినప్పుడు ద్రావకముతో పరీక్షించి 'ఇంత ఖరీదు' అని నిర్ణ యింతురు.[18] ఈ వివరములు — చిన్నతాటియాకు ముక్కపై గంటముతో వ్రాసెదరు—'ఉలి + ఆకు' అని దీని పదచ్ఛేదము. ఉలివంటి గంటముతో వ్రాసెడు చీటి—అని. శ. ర. (పూర్వముద్రణము). కాని శర వ్యుత్పత్తి సరికాదు.

ఇది 'ఉల్లేఖన' శబ్దభవము. సంస్కృతమున ఉల్లేఖనపరీక్ష గలదు. సంస్కృత నైషధమున నీ పద మున్నది. దీనికి శ్రీనాథాంధ్రీకరణమున వివరణ కలదు. చూ. శబ్దరత్నాకరము—నా యనుబంధము— పుట. 63.

ఊ

పుట 57. ఊరుబిండి (3) తెలకపిండి నానవేసి చేసిన పచ్చడి (శ్రీ). తెలకపిండి పచ్చడి చేయుట

---

17. కేవలము వేదవిద్యనే పోషించు ప్రత్యేక సంస్థ మనకు స్వాతంత్ర్యమువచ్చిన యీనాడును లేదు—పూర్వము ఉర్లాంసంస్థానమట్టి ప్రత్యేక సంస్థ.

18. నా చిన్నతనమున విశాఖపట్టణమున— విశ్వబ్రాహ్మణులలో విద్వాంసులు కవులూ అయిన మున్నపుకన్నయాచార్యులవారు, ఈ ఉల్లాకులను వేసెడి వారు. వీరి కొమారులే కవులైన మున్నపువీరరాజు గారు.

యేమి? తెలకపిండి అనగా గానుగపిండి. నువ్వుల మూనె ఆడిన తరువాత వచ్చేడి పెచ్చులపిండి. దీనిని నీటిలో నానవేసి ముద్దగా చేయుదురు-ఇదియే— ఊరుబిండి. కన్యాశుల్కములో — వెంకటేశం— 'అక్కయ్యా ఊరుబిండి' అని అడుగుతాడు.

ఊరుబిండి వడియము-ఊరవేసిన వడియము (వి). వడియమును ఊరవేయుటయేమి? ఊరుబిండిని[19] —అనగా తెలకపిండిని ముద్దగాచేసి, దానిని, వడియముగాచేసి, యెండ బెట్టుదురు. తరవాణి, అన్నము తిన్నప్పుడు వీనిని నంచుకొందురు. దీనికే 'ఊరుబిండి వడియము' అని పేరు.

గానుగపిండి ఇందు 135 పుటలో నున్నది.

## ఎ

పుట. 65. ఎఱ్ఱబాసి=రోతగలవాడు — అసహ్యము (గు) ఎఱ్ఱబాసి—అనుపదము—'ఏభ్యరాశి' అను శబ్దతద్భవము — ఇది పురుషులకేగాక స్త్రీలకు వర్తించును.

గీ. ఏమిచేయుదు పెండ్లాము ఏభ్యరాశి
వెఱ్ఱితలముండ తల్లి వివేకిగాదు
తోడబుట్టిన వారెల్ల దొంగజట్టు
రామకవిగాని బ్రదుకు శ్రీరామరక్ష
తురగ రామకవి (చాటువు)

## ఏ

పుట. 67. ఏగాని = రెండు దమ్మిడీలు. దుగ్గాణి [శ్రీ].

"ఏకైక దుడ్డుః కులపండితానామ్
దుడ్డు ద్వయం కుండల పండితానామ్
ఏగాని ఏగాని కవీశ్వరాణాం
కాసు ద్వయం చిల్లర పండితానామ్ —"
(వడిమింటి సర్వమంగళేశ్వరశాస్త్రి మణి
ప్రవాళ చాటువు)

పుట. 69. ఏల పదము = జానపదుల పాట; యాల పదము. (ఇందు బూతు ఎక్కువ)[నె. అః వ]

ఏల పదములో బూతు ఎక్కువ అనుట సహింపరానిది. ఏల పదము సుసంస్కృతమైన పదము — యక్షగానములందు ప్రయుక్తమైనది. దీనికి లక్షణము గలదు.

"ఏల పద విధం బెట్లనిన...
గీ. నాయకాహ్వాన పూర్వమై నయము గలిగి
మ్లేచ్ఛ పరిభాషల దగి రాగమిళితమైన
యేల పాట పదంబు నా నిలల జెలంగు
మహిత నాయక సంబుద్ధి మధ్యమగుచు"
(తాళ్లపాక అన్నమయ్య సంకీర్తన లక్షణము
65 ప.)

గీ మేలి బంగారు తీగల మిసిమి పంట
చేల నిండారు వెన్నెలరేల బయల
నేల పాటలల బాడుదు రింపుమీఱ
పాలి కాపులు వారల బ్రదుకె బ్రదుకు—"
మించుపల్లి. ప. 18.

## క

పుట. 80 కక్క = (1) పినతండ్రి : చిన్నాయన —

కక్క అనగా పినతండ్రి: తండ్రి తమ్ముడు కాడు. కక్క అనగా పినతల్లి మగడు; పినతల్లికి కక్కి అని పేరు. కక్కకు కక్కయ్య అని వి. శ్రీ. జిల్లాలలో వాడుక. కక్కి పదమిందు లేదు. ఈ రెండు పదములు మాధ్వుల వాడుక[20] నుండి వచ్చినవి.

పుట 92 కరణ కమ్మలు — శ్రీకాకుళం ప్రాంతములోనున్న ఒక తెగ బ్రాహ్మణులు: కరణీకము చేయువారు: నియోగులతో వియ్యమందుదురు.

---

19 ఊరుబిండినే 'గానుగపిండి' యని— దక్షిణాదిలో తంజావూరు మధుర ప్రాంతములలో స్థిరపడిన తెలుగు వారందఱు వాడుదురు. చూడుడు—రంగాజమ్మ మన్నారుదాసవిలాస నాటకము (పుట. 26)

20. మా పినతల్లి భర్తను మేము 'కక్కయ్య' అని పిలిచేవారము.

కరణ కమ్మలవగా—కన్నడదేశమునుండి కమ్మ వాటిలో మొదట వెలకొన్న బ్రాహ్మణశాఖ—వీరలు కమ్మవాటిలోనే కాక తక్కిన ప్రాంతముల నన్ని మండలములలో నున్నవారు. ఒక్క శ్రీకాకుళం ప్రాంతములో నున్నవారనుట సరికాదు.

కరణ శబ్దము కర్ణాట శబ్ద భవము—

'కరణదేశపు జాణడు' అని క్రీడాభిరామము—కరణమ్మలు నియోగులతో వియ్యమందుట నిజమే- కాని 'కరణీకం చేయువారు. అనుట అసంబద్ధము—కరణీకము నియోగుల వృత్తి.

## గ

పుట. 146 గూడు (1) రెండు ఎముకలు కలియు కీలు. (2) పశువుల గుదస్థానము. అని రెండర్థములు కలవు. కాని గూడు—అనగా స్త్రీల కేశపాశము—పున్స్త్రీ తనము. చూ. 'గూడుమారిన కొత్తరికం' కీ. శే. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి నవల.

పుట. 150 గొరవయ్య (1) శైవ భక్తుడు. (అ) గొరవ శైవభక్తుడు కాడు. శైవ భిక్షుకుడు. ఇదిచాలా ప్రాచీన పదము—

'గొరగ ల్గాకిందు బృందంబు
గొనియుండు వారు'

యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము (క్రీ శ. 930).

పుట. 152. గోలెము—(1) మూతివెడల్పు అయిన తొట్టి (శ్రీ). గోలెము—మూతి వెడల్పుగా నుండి గుండ్రముగా నుండును—వీనిని మట్టితోడనే చేయుదురు (కుడితిగోలెము). గోలెము—గోళశబ్ద భవము—

## జ

పుట 182. జీడి—(1) ముంతమామిడి (2) ఓషధి (3) మామిడిపప్పు.

వి. శ్రీ. జిల్లాలలో 'జీడి' అనునది తినుబడివస్తువు. బెల్లము పాకముతో చేయబడి జీడిరూపముగానుండే భక్ష్యము

(మండల వివరములేదు)

## ట

పుట. 188 టొంప గుదిగ్ర—వి. శ్రీ గో. జిల్లాలలో వాడుక.

ఉ. రంప పరాయిమూక జొరరాని
రహస్యపుకొంప, కాన్స్టేబిల్,
గుంపులటొంప, కోయదొరకూటువ
దుంప, విరోధిగుండెవా
ల్లంప పితూరిదారులగలంపగ
వచ్చెడు తెల్లవారికిన్
కంపమునించిమించు తటకా
పడచేసెడు శంప గౌతమిన్

(సన్నాల సీతారామబ్రహ్మశాస్త్రి —రంపపితూరీ చాటువు)

## డ

పుట. 189. డవులు (1) ఒకగ్రామము చెల్లించవలసిన శిస్తుమొత్తము. ఆవూరి డవులు మూడువేలు [నె]. డవులు నెల్లూరి మాండలికము కాదు. వి. శ్రీ జిల్లాలలో మాండలికమే.

సీ. పా. మీవూరి భూమెంత, మెట్టుపల్లంబెంత
డవులెంత కిస్తెంత సవరమెంత

—వద్దిపర్తి కోనమరాజకవి జమాబందిచాటువు —సీసమాలిక.

పుట 191 డేగిచ = బక్కెట్టు. [శ్రీ]

వి. శ్రీ. జిల్లాలలో 'డేగిశ'గాని డేగిచ కాదు బక్కెట్టు అంతకంటే కాదు. డేగిశా వెడల్పు మూతి గల గుండ్రని రాగి పాత్ర. బక్కెట్టు కోలగా నుండును. అది గాక బక్కెట్టు రేకుతో చేయ బడును.

227 పుటలో డేగిస—'డే' క్రింద 'డేగిచ'గా నున్నది. ఇచట—'మూతి వెడల్పు రాగి పాత్ర' అని అర్థము సరిగా నున్నది. ముస్లిములు మాత్రమే పలావు, బిర్యానీలు దీనితో వండుదురు కాని తక్కువ

వారు దీనిని స్నానమునకు వేడినీళ్లు కాచుట కుపయోగింతురు.[21]

## ద

తాకట్టు: (1) స్పర్ధను పెంచు చేష్టలు—తాకటమారి (2) తంటాలు. [నె. కర్నూ. అ.తె]

విశాఖ శ్రీకాకుళం జిల్లాలో 'తాకట్లు' అనగా కుదువలు, కుదువబెట్టు వస్తువులు.

'తాకట్లు వాకట్లయినవి' అని వాడుక. 'కుదువ' గాని 'కుదువ బెట్టు' గాని ఈ పద కోశమున లేవు.

## ద

పుట. 223. దిబ్బ (1) పెంట దిబ్బ—(2) చిన్న గుట్ట.

వి. శ్రీ. లలో 'దిబ్బ' వలముగా లావుగాఉండే మనుష్యుల కుపయోగింతురు.వాడు దిబ్బగాఉంటాడు. ఆమె దిబ్బగా ఉంటుంది.

చూ. పుట. 226. దుబ్బ. (1) లావైన శరీరము. వాడు దుబ్బగా ఉన్నాడు. [అ].

పుట. 228. దేవిడిమన్నా = ద్వారనిరోధము. (వి) అర్థము స్పష్టముగాదు—'దేవిడీమన్నా' అనగా రాజుగారి కోటలోనికి రాకుండా నిరోధించుట.

## న

పుట. 236. నసుగు=(2) గొణ గు (తె) కాని వి. శ్రీ. లలో బాగా వాడుకయున్నది.

పుట. 248. నేబు=డబ్బులు—నీవద్ద ఎన్ని నేబులున్నవి?

నేబు — పండ్రెండు కాసుల నాణెము. సీ. పా. బదులియ్యం డొక్కండు పాతనేబు'—అని అడిదము సూరకవి రామలింగేశ్వర శతకమున ప్రయోగము. 97. ప.

'పాతికనేబులు చేతికిచ్చినన్.'[22]

జగ్గకవి చంద్రరేఖావిలాసము (2—34)

విశాఖ తూర్పు గోదావరిజిల్లాలలోనే దీని వాడుక—

'నేబు'నకు మండలము సూచింపబడలేదు.

## ప

పుట. 255. పట్టా = ఒక జాతి పందెపు కోడి (శ్రీ) పట్టా అనగా ఒక భూస్వామి రైతు కిచ్చెడు కవులు. ఇది ప్రతి వ్యవసాయదారునికి తెలిసిన పదము

పుట. 261. పల్లి=120 సేర్ల ధాన్య ప్రమాణము. (తె).

పలా = (2) 120 సేర్లతూకము (కరీం)

పల్లా=120 సేర్ల బియ్యము. వి. శ్రీ; లలో వాడుక.

పుట. 265. పారోశీ=పప్పులతో వండిన ఒక రకము కూర (వి)

పదము 'పారోలి'గాని పారోశీ కాదు.

పుట. 269. పితార్[23]—తీపియైన భక్ష్యవిశేషము. అరిసెవంటిది. (గ).

'పిండివంటలులేవు పితార్లులేవు' అని వి. శ్రీ లలో వాడుక.

## బ

పుట. 300. బాయి = (1) చనుబాలు (పిల్లలు అనుమాట.)

---

21. నేడు పీనిస్థానమున 'బాయిలర్లు' వచ్చినవి.

22 చూ. శ. ర. అనుబంధము. 79 పుట.

23. కీర్తిశేషులు విక్రమదేవవర్మ మహారాజా వారు ఒకమారు పిఠాపురము మహారాజావారిని గూర్చి చెబుతూ 'వారి సంస్థానమే పిఠాపురము. అనగా తీపికి స్థానమైనది. ఇక వారు భాషలలో తీపిగల తెలుగుభాషను పోషించుట సహజమేగదా' అని చమత్కరించినారు.

(2) చన్నులు; బాచులు (వ. నె.)

ఈ పదము వి. శ్రీ జిల్లాలలో కూడా వాడుక.

బాయి—ఇది 'పాయి' పాలు అను శబ్దము బహువచనము. దానికి 'పాయి' ఏకవచనము. 'రేయి, రేలు' వలె 'పాయి' ఉచ్చారణలో 'బాయి' అయినది.

'పాయినిచ్చి కింకఁ బాయఁగఁ జేయును
కొంగుదరికిఁ జేర్చి గుస్తరించు
పోరువెట్టుచుండ నేరీతినో యామె
యూరడించు పిల్లలొప్పుఁటుల—మించుపత్లె
60 ప.

పుట. 300 బాల్టి (2) బాల్చి (శ్రీ వి.ఉ.గో) (Bucket) శ్రీ. వి. లలో 'బాల్చి తన్ను' అనగా చనిపోయాడు అని అర్థము. 'He kicked the bucket' అను నాంగ్ల వాక్యమునుండి తెలుగు వ్యవహారములోనికి వచ్చినది.

'పెళ్లయిన కొన్నాళ్లకే మొగుడు బాల్చి తన్నేశాడు'—కన్యాశుల్కము.

పుట. 302. బిన్నించు=ఎదిరించు; వ్యతిరేకించు.

కార్తె బిన్నించినది (కదీ)

కాని వి. శ్రీ.లలో కార్తె బిన్నించినది అనగా వర్షముపడ్డది అని అర్థము.

బిన్నించు—బిందించు అనుదాని రూపాంతరము.

బిందించు=బిందువులుపడు; చినుకులుపడు.

పుట. 311 బొట్టె 2. స్త్రీ:బొడ్డి (వి)

ఇది గోదావరీమండలమున కూడ వాడుకలో గలదు.

పుట. 312. బొట్టె=చిన్నబిడ్డ.

బొట్టెడు=పిల్లకాయ; బాలుఁడు.

ఇది పై మండలమున వాడుక.

బొట్టె = బొట్టియ కూతురు. 'పుడమి బొట్టియ.' (సీత)

బొట్టెఁడు — కుమారుడు

'బొట్టెఁడ నీవెట్లు నిలిచిపోరెదు చెపుమా'

కూచిమంచి తిమ్మకవి అచ్చతెనుగు రామాయణము బాలకాండము.

పుట. 316. భరతంబట్టు. 3. ఎక్కువగా భోజనముచేయు; చేయించు.

కొందఱు శైవులు వడ్డించిన దానినంతయు కష్టపడియైనా భోజనముచేయు ఆచారము. (తె)

ఈ యర్థము సరికాదు. శైవులలో 'కొందఱు' కాదు. 'విధిగా అందఱును.—పదము 'భరతం'కాదు. భరితము. శైవులు ప్రసాద నియమము గలవారు. అనగా తినవలసిన పదార్థమంతయు నొక్కమారే వడ్డించుకొని లింగమున కర్పించి ఆ ప్రసాదమునంతయు నొక్కమెతుకైన వదలకుండ భుజింతురు. దీనికే 'భరితభోజనము' అని పేరు. శ్రీనాథుడీ పదము హరవిలాసమున చిఱుతొండనంబి కథలో వాడినాడు.

'భరిత భోజనంబుగా వడ్డించి' (2—32)

పుట. 395. సీతారామకోరు=కలకలలాడు. (గు)

ఇది గుంటూరు మాండలికమేకాదు. విశాఖ శ్రీకాకుళం జిల్లాలలో నున్నది.

క. సీ రామని కామెతలై
గారామున పెంచబడిన కల్పకతరులై
ఆరామ వృక్షములు సీ
తారామను గోరు కన్నుదమ్ములవిందై
మించు 6. ప.

పై విమర్శన మచ్చునకు మాత్రమే.

ఈ మాండలిక పదకోశము ముందెట్లుగా రూపొందవలెనో సూచించుటకే నా యీ సమీక్ష.

ఇందు విడిచిన పదములు వ్యుత్పత్తులు మొదలగు వానినిగూర్చి ఎంతో వివరింపవలసి యున్నది. విస్తరభీతిచే విరమించుచున్నాను.

ఈ మాండలిక పదకోశము ప్రథమ ప్రయత్నమేయైనను, దీనినెంతో జాగరూకతతో, సమీచీనముగా వెలువరించిన—కూర్పరి శ్రీ మరుపూరు కోదండరామరెడ్డిగారిని, పరిశోధక సంఘ సభ్యులను నభినందించుచున్నాను.

ముమ్ముందు సాహిత్య అకాడమీవారు కవి ప్రయోగ సహితము, సమగ్రము, సాధికారమునైన మాండలిక పదకోశము వెలువరింతురుగాక.

---

(మాండలిక పదకోశము; కూర్పరి : శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి; ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ; కళాభవన్; హైదరాబాదు. వెల రు. 7—50)

# మణిమంజీరము

శ్రీ చెఱకుపల్లి జమదగ్ని శర్మ

ఘుసృణ స్నిగ్ధ మనోజయ ప్రభలు, సన్మార్గ ప్రదారాశియు
ప్రసవానేక మనోహరంబులు, జగద్భద్రంకరంబుల్, మనః
ప్రసవోన్మీలన మూల హేతువులు, తీవ్రధ్యాన నిష్ఠైకదృక్
దృశముల్ నీ పద పద్మముల్ కనుదునో శ్రీకాళహస్తీశ్వరా!

ప్రసవేషు ప్రభవిష్ణు విష్ణు హృదయ వ్యామోహ నిర్మూలక
ప్రసవంబుల్, తరుణారుణద్యుతిసుధాభాస్వన్నఖ శ్రేణికా
శశిఖండ ద్వయ సంద చిహ్నములు, సంసారార్ణవోత్తారకా
శిష సంధాయక యానపాత్రము లహో! శ్రీకాళహస్తీశ్వరా!

నిలువంబోవక దాకి యోగి హృదయాగ్ని జ్వాలలన్ క్రుగ్గుచున్
నిలువెల్లం దెలుపైన నీదు పదముల్ నిప్పుల్ బలెం దోచు, పూ
పులకుప్పైన నవనీతమైన హృది నొవ్వందిసి విశ్రాంతి ని
చ్చి లసన్నైజము నిల్పు చెంగదవే శ్రీకాళహస్తీశ్వరా!

నీ పాదంబుల యాన నా హృదయ మున్నిద్ర ప్రబోధాగ్ని చే
తాపోత్తప్తత పోన ప్రశాంతత సుధాధామంబుగానుండె నీ
శ్రీ పాదంబులు దల్లనౌ వెలుగులో చిన్మూర్తులై తోఁచ ని
క్షేపంబబ్బిన పేద చందమగుదున్ శ్రీకాళహస్తీశ్వరా!

మృదువై కోమలమై యలక్తక లసచ్ఛృంగారమై నూపురా
స్పదమై మోహనమైన మాతృపదమా వామాంఘ్రియున్ పౌరుష
ప్రదమై చేతనమై భుజంగ కటకంబౌ భవ్య సవ్యాంఘ్రియున్
హృది భద్రంబగుగాక జ్ఞాన సుమన శ్రీకాళహస్తీశ్వరా!

మంత్ర స్వర్ణగ చిత్రభాస్థలి నభోమార్తాండ బింబాభముల్
తంత్రాలంబ జగత్కళావ విభవోద్యత్తాండవం బాడుచున్
యంత్రాగ్ర స్థిత బిందు మండల సుధావ్యాహార నిష్యందు తా
హ్రీంత్రైపుర్య మహాత్పదంబు లమరున్ శ్రీకాళహస్తీశ్వరా!

జాడ్య ధ్వంసక నిత్య చేతనములన్, జాజ్వల్యమాన ప్రభా
ప్రోద్యం ప్రబలార్కి మోదనములున్, యాత్మేక్షణ ప్రౌఢహృత్
కుడ్యాంత ర్వినిబాధ జీవకళలున్ కోట్యబ్జ బింబాయుతా
ర్కేడ్య ప్రాభవ దుర్నిరీక్ష్యము లహో శ్రీకాళహస్తీశ్వరా!

తలపన్ పుల్కలు దేలు పొంగుచుడదన్ దార్కొన్న నీ పాదముల్
చెలువం బేదునో నొవ్వునందునో ప్రభూ! చింతింపగా నేల! పూ
వులలోఁ బెట్టి భజింతు నించుకయు నొవ్వుం బొందగా నీను, తు
ష్టి లభింపన్ విహరింప నిమ్ము నటరాట్! శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీపాదంబుల కందమైన మణిమంజీరంబుగా వచ్చె నీ
శ్రీపాద ప్రణవంబు, దీని నిండశ్రీ మ్రోగు హృత్కంజ మే
పాపంబున్ గనఁబోదు, పొందు శుభముల్, సత్స్థితిన్ జెంది తం
ద్రీ! పారంబగు నీవె తానగు నహో శ్రీకాళహస్తీశ్వరా!



# సాహితీ జగతి

## శ్రీ కాశూరి హనుమంతరావు

ఫిబ్రవరి భారతి సంచికలో నా 'సాహితీజగతి' అన్న పుస్తకాన్ని శ్రీ 'చేరా'గారు సమీక్షించారు. సమీక్షలో 'భాష—వ్యాకరణం' అన్న వ్యాసపరిశీలనకు అధికభాగం సమీక్షకులు వినియోగించారు. కనుక నేనా విషయచర్చతో వ్యాసం ప్రారంభిస్తున్నాను. వైయాకరణుల మతాన్ననుసరించి భాషకీ వ్యాకరణానికీ గల సంబంధాన్నీ వ్యాకరణప్రయోజనాన్నీ గురించి నేను ప్రతిపాదించిన అభిప్రాయాలను ఆధునిక భాషా శాస్త్రజ్ఞులు (Linguisis) అంగీకరించిరని సమీక్షకులు వారి మతాన్ని ఇలా ప్రతిపాదించారు.

'భాషాస్వరూపస్వభావనిరూపణమే వ్యాకరణం చెయ్యగలిగిన, చెయ్యాల్సిన పని అని భాషాశాస్త్రజ్ఞుల అభిప్రాయం. వ్యాకరణం కత్తెరా కాదు, కళ్ళేమూ కాదు. భాషలో ముళ్ళూ ఉండవు, పాములూ ఉండవు. వ్యాకరణ నియతిలేని భాష ఉండదు. వ్యాకరణం అంటే లిఖితమే కానక్కరలేదు. స్వభాషా వ్యవహర్తలందరి మనస్సుల్లోనూ వ్యాకరణం అలిఖితంగా ఉంటుంది. భాషావ్యవహారాన్ని ఈ అలిఖిత వ్యాకరణమే నడిపిస్తుంది. అమూర్తమైన అలిఖిత వ్యాకరణానికి స్పష్టమైన రూపాన్నియ్యటమే లిఖిత వ్యాకరణం ప్రయోజనం. అది ప్రాచీనభాషకూ రాయవచ్చు, ఆధునికభాషకూ రాయవచ్చు. శిష్టభాషకూ రాయవచ్చు, అశిష్టభాషకూ రాయవచ్చు. వ్యాకరణానికి వర్గదృష్టి లేదు వ్యవహర్తలందరూ ఒకటే' అని.

భాషాసమష్టిలో స్వల్పభాగంమాత్రం సామాన్య ప్రజల దైనందిన వ్యవహారంలో ఉంటుంది. తక్కినది శాస్త్రసాహిత్యాది గ్రంథాలలోనూ, విజ్ఞానులిచ్చే ఉపన్యాసాలలోనూ ఉంటుంది. భాష అంటే ఈ యావత్తు భాషని మనదృష్టిలో ఉంచుకోవాలి. ప్రజలు రోజూ మాటాడే భాషను ఏ వ్యాకరణమూ శాసించలేదు. వ్యావహారికాంధ్ర భాషా వ్యాకరణం కంఠస్థంచేసి ఎవరూ సంభాషించడం ప్రారంభించరు. కాని మన విజ్ఞాన వ్యక్తీకరణకు సామాన్య వ్యవహారంలో లేని ఎన్నో పదాలను ప్రయోగించడం, భిన్నభిన్నార్థపరిణామాలను సూచించేటట్లు ఆ పదాలను పరిణమింపచెయ్యగలగడం ఆవశ్యకం. ఈ పనిలో సౌలభ్యం కలిగిస్తుంది వ్యాకరణం. ఉదాహరణకు ధాతువులమీద 'క్త' ప్రత్యయాంత రూపాలను వ్యాకరణం నిష్పన్నం చేసిన పద్ధతిని గమనించిన వెంటనే ఆ ప్రత్యయం పరమైనప్పుడు ఎటువంటి ధాతువులు ఎలా ఎలా మారతాయో, నిష్పన్న రూపాలెలా ఎలా ఉంటాయో, ఏయే అర్థాలను ఆ శబ్దాలు సూచిస్తాయో ఇదంతా కరతలామలకంగా తెలిసిపోతుంది. ఈ విజ్ఞానాన్ని ఆధారం చేసుకొని ఏ ధాతువు మీదయినా క్త ప్రత్యయాంతరూపం నిష్పన్నం చేసుకోగలుగుతాము. వ్యాకరణ విజ్ఞానం లేకపోతే ప్రతిధాతువుకీ క్త ప్రత్యయాంతరూప మిదనీ, దాని అర్థమిదనీ వ్రాసుకొంటూపోతే 'బృహస్పతిశ్చవక్తా...' అన్నట్లు శబ్దపరిగ్రహణకు మన ఆయుఃపరిమితి చాలదు. ఇదంతా పస్పశాహ్నికంలో చెప్పబడినదే.

సాధ్వసాధు శబ్దరూప నిర్ణయంలో వ్యాకరణం చేకూర్చే సౌలభ్యం వ్యక్తపరచే ఒక ఉదాహరణం ఇస్తాను. ఇటీవల కొందరు 'ఉదహరించు' అని ప్రయోగిస్తున్నారు. ఉత్, ఆఙ్' ఉపసర్గద్వయ పూర్వక 'హృ' ధాతువునుంచి ఆ శబ్దం ఏర్పడిందన్న

వ్యాకరణాంశం గమనించితే 'ఉదహరించు' అనడం తప్పని తెలిసిపోతుంది. అయితే అలా ఎందుకనకూడదు? కొందరంటున్నారుకదా! అనవచ్చును. ఇటువంటి వాట్లలో ఇంకా కొంచెం ఓపిక అవసరం. భాషను తెలిసిన వారు భాషా పారిశుద్ధ్యాన్ని రక్షించడానికి సాధ్యమైనంతవరకూ ప్రయత్నించాలని నేను వ్రాసినది ఇటువంటి వాటికొరకే. భాషలో స్థాయి అంటే ఇదే. 'భాషలో స్థాయి అంటే ఏమిటో ఈ సమీక్షకుడి ఊహకు అందటంలేదు' అని సమీక్షకులు వ్రాశారు. వారి ఊహకు ఎందుకు అందడం లేదో నా ఊహకు అందడం లేదు.

వ్యాకరణం ఒక కత్తెరే. పార్కులో యథేచ్ఛగా పెరిగిన గడ్డినీ చెట్లనూ కత్తిరించి కొన్ని కొన్ని ఆకారాలు ఏర్పరచినట్లు, ప్రబలంగా అమలులోకివచ్చిన ఏ వ్యాకరణమైనా తన చట్రంలో ఇముడని కొన్ని శబ్దాలను కత్తిరించివేస్తుంది. పాణినీయం రామాయణ మహాభారతాలలోని కొన్నిపదాలను కత్తిరించివేసింది. బాలవ్యాకరణంకూడా డిటో. భాషలో అశబ్దాలనే ముళ్ళూ పాములూ ఉంటాయి కనుకనే వాటిని తెలిసినవారు పరిహరిస్తారు. శ్రీశ్రీగారి కొన్ని ప్రయోగాలిటువంటివి నా వ్యాసంలో చూపాను.

అశిష్టభాషకు వ్యాకరణం ప్రాయజాలమని ఎవరూ అనరు. కాని దానివలన ప్రయోజనం శూన్యం. వ్రాతకోతలు లేకుండా కేవలం మాటాడడానికి మాత్రమే వాడబడే భాషకు వ్యాకరణం అనవసరం, మాటాడేవారు ఆ వ్యాకరణం చూడరు కనుక. భాష పెరిగి వ్రాతకోతలకు హెచ్చుగా వాడబడుతున్నప్పుడే, ఆ భాషయొక్క సక్రమాభివృద్ధికి సహాయకారిగానూ, భాష మాటిమాటికీ మారిపోయి క్రొత్తబడిపోకుండా ఉండడానికీ వ్యాకరణం అవసరం. రాకపోకలు హెచ్చుగా జరిగే పెద్దరోడ్లకు ట్రాఫిక్ నిబంధనలుండాలి తప్ప పొలాల నడుమ ఉండే కాలిబాటకుకాదు. నన్నయ్యకి పూర్వం గ్రంథరచన లేని కాలంలోని తెలుగుభాష మనకి అర్థంకాదు. గ్రంథరచనా, వ్యాకరణంవచ్చాక నన్నయ్యనుంచి నేటివరకు తెనుగు హెచ్చు మార్పులులేకుండా మనకి అర్థమయ్యేటట్లు ఉంటోంది. గ్రంథరచన, వ్యాకరణం—ఇవే ఎక్కువగా భాష నిలకడకీ, అభివృద్ధికీ తోడ్పడుతాయి. ప్రాంతానికీ ప్రాంతానికీ కొంత కొంత మారిపోతూ నిత్యవ్యవహారంలోఉన్న భాషకాదు. అయితే ఈ నిలకడనీ, పెంపునీ సాధిస్తున్నది గ్రంథరచనే తప్ప వ్యాకరణంకాదని తోచవచ్చును. ఏశబ్దాలు శిష్టజనసమ్మతాలనడానికి లోకమే (అనగా గ్రంథాలూ శిష్టజన వ్యవహారం) ప్రమాణం. కాని ఆ నిర్ణయంలో వ్యాకరణం చాలా సౌలభ్యం కలిగిస్తుంది.

'వ్యాకరణం లిఖితభాషకే ఉంటుందనీ, భాషలో కనిపించే వివిధరూపాలని రచనలో ఎంచుకోటానికి ఉపయోగించే సాధనం వ్యాకరణమనీ అనుకోవటంవల్ల ఈ చిక్కువస్తున్నది.' అని సమీక్షకులు వ్రాశారు. 'సుశబ్దములను అపశబ్దములనుండి వేరుచేసి జనులు అపశబ్దములను పరిహరించి సుశబ్దములనుపయోగించునట్లు ధర్మనియమం చేస్తుంది వ్యాకరణం' అని నే నుదాహరించిన మహాభాష్యకారుని వాక్యం సమీక్షకులట్లా అర్థంచేసుకొన్నారు. శిష్టులు ఉపయోగిస్తున్న సభ్యభాషను వ్యాకరించడంవలన, ప్రతిశిష్టుడివద్దకూ వెళ్ళి వాడి శబ్దవ్యవహారం ఎలా ఉందో తెలుసుకోనక్కరలేకుండా అనేకశిష్టుల భాషావ్యవహారసామగ్రిని వ్యాకరణం కరతలామలకం చేస్తుంది సుశబ్దములేవో అపశబ్దములేవో వ్యాకరణం ద్వారా మనం గ్రహించగలుగుతాం.

'వ్యాకరణం అంటే లిఖితమే కానక్కరలేదు. స్వభాషా వ్యవహర్తలందరి మనస్సుల్లోనూ వ్యాకరణం అలిఖితంగా ఉంటుంది.' అని సమీక్షకులు భాషాశాస్త్రజ్ఞుల అభిప్రాయాన్ని పేర్కొన్నారు, కాని లిఖితమైన దానికే వ్యాకరణమని పేరు. భాషావ్యవహర్తలలో వ్యవహార సంప్రదాయం మాత్రం ఉంటుంది. అటువంటి వ్యవహారసంప్రదాయాన్నంతటినీ పరిశీలించి సజాతీయములను క్రోడీకరించి, ఉత్సర్గాపవాదశాస్త్రములను విధించడం; సూత్రములు రచించి ఉదా

హరణ ప్రత్యుదాహరణ పూర్వకంగా వ్యాఖ్యానించడం దీన్నంతటినీ కలిపి వ్యాకరణ మంటారు.

మీమాంసకులలో అభిహితాన్వయవాదులు వాక్యంలో శబ్దాలకుగల పరస్పరార్థ సంబంధాన్ని, మానవుడు తాత్పర్యశక్తిద్వారా తెలుసుకొంటాడంటారు. 'ఆవును తీసుకురా' అంటే 'ఆవును', 'తీసుకురా' అన్న రెండుపదాల అర్థాలను కలిపే శక్తి తాత్పర్య శక్తి అనీ, చిన్నతనంనుంచీ మనిషి ఈ శక్తిని సంపాదించుకొంటూ ఉంటాడని వీరి అభిప్రాయం. కాని అన్వితాభిధానవాదు లీ శక్తిని అంగీకరించరు. 'ఆవుని తే', 'ఆవునికట్టు' 'గుర్రాన్నితే' ఇత్యాది వాక్యాలు ఉచ్చరించబడినప్పుడు ఆయాజంతువులనూ ఆయాపనులనూ చూసిన బాలుడు 'ఆవు' 'గుర్రం' 'తే', 'కట్టు' అన్నమాటల అర్థాలను తెలుసుకొంటున్నాడు. కనుక వాక్యంలో శబ్దాల పరస్పరార్థాన్ని కలపడానికి వేరే శక్తి అక్కరలేదని వీరి మతం. అభిహితాన్వయవాదుల మతంలో ముందు శబ్దార్థబోధ తర్వాత వాక్యార్థబోధ. అన్వితాభిధానవాదుల మతంలో ముందు వాక్యార్థబోధ, తర్వాత శబ్దార్థబోధ.

ఈ బోధవలననే పదవాక్యాల నర్థంచేసుకొనడం పదాలు కూర్చి వాక్యాలు నిర్మించడం మనం చెయ్యగలుగుతున్నాం. దీనినే ఇప్పుడు భాషాశాస్త్రజ్ఞులు 'అలిఖిత వ్యాకరణం' అంటున్నారు. కాని ఇది వ్యాకరణంకాదు, ఇది వ్యాకరణమే అయితే, బాల్యదశలోనే అజ్ఞాతంగా ఉన్న ఈ విజ్ఞానం మనిషి పెద్దవాడు కాగానే విజృంభించవలసి ఉంది. కాని భాషా వ్యవహారం తెలిసినవారిలో చాలా అల్పసంఖ్యాకులు మాత్రమే వ్యాకరణం తెలుసుకొంటున్నారు. చిన్నతనంలో లెక్కలలోనో సాహిత్యంలోనో ఆసక్తికల వాడికి పెద్దయ్యాక ఆ అభినివేశం హెచ్చుతుంది. కాని సాహితీపరులలోనైనా ఎక్కువమందికి వ్యాకరణంలో అభిరుచి కలగడంలేదు. అభిరుచి కలిగిన కొద్దిమందిలో, ఎంతో కష్టపడిన పిదప, ఇంకా కొద్దిమందిమాత్రం ప్రవీణులవుతున్నారు. ఇంతేకాక వ్యాకరణ పాండిత్యానికీ, భాషద్వారా భావం వ్యక్తీకరించగలిగే శక్తికీ సంబంధంలేదు. ఒకడు ఏ వ్యాకరణ పుస్తకం చదవకుండా గొప్ప రచయిత కావచ్చును. ఒక్కొక్క వ్యాకరణ పండితుడు రచనా సమర్థుడు కాకపోవచ్చును. ఈ పదవాక్యబోధ శక్తిచేతనే వ్యాకరణ దుష్టములూ సందిగ్ధములూ అయిన వాక్యాలను సైతం మనం ప్రయోక్త ఉద్దేశం ఇదయి ఉంటుందని అర్థం చేసుకోగలుగుతున్నాం. ఉదాహరణకి ఒక క్షౌరశాలబోర్డు 'ఇచ్చట అందమైన క్రాపులు కత్తిరించబడును' అని ఉంది. 'అందంగా' అని క్రియా విశేషణం వాడడానికి బదులు 'అందమైన' అని విశేషణం వాడడంచేత వ్యాకరణాన్నిబట్టి, వచ్చిన వాళ్లందరికీ అచ్చట గుండు గీస్తారన్న అర్థం కూడా వస్తున్నా, అది చదివిన వారంతా అక్కడ ఆశయం ఏమిటో గ్రహించగలుగుతారు. అలాగే 'ప్రభుత్వ బాలికల ఉన్నత పాఠశాల' అని ఒక స్కూలు బోర్డుమీద ఉన్న వాక్యంలో సమాసాల కూర్పు దుష్టమైనా చదివిన వారు స్కూలు గవర్నమెంటుదితప్ప బాలికలుకారని గ్రహిస్తారు.

కనుక ప్రతిమనిషిలోనూ నిహితమై ఉండి వాక్య బోధనీ నిర్మాణాన్నీ చేయించుతున్నది ఈ పదవాక్య బోధశక్తితప్ప 'అలిఖిత వ్యాకరణం' కాదు. లిఖితమైన దానికే వ్యాకరణం అనిపేరు.

అసలీ వ్యాకరణమన్నది వాస్తవానికి ఒక మిథ్య; సౌలభ్యంకోసం లేని దానిని ఉన్నదనుకొనడం అన్న హరికారికను నా వ్యాసంలో ఉదాహరించాను. ప్రాచీన వైయాకరణుల ఈ అభిప్రాయాన్ని హృదయగతంగా భావించి ఉంటే సమీక్షకులు 'ఏ భాషకైనా వ్యాకరణం రాయొచ్చును' మొదలైన ఉద్రిక్త వాక్యాలు వ్రాసి ఉండేవారుకారు. ప్రయోజనం ఉంటే వ్రాయవచ్చును.

మనం ఇప్పుడు ఏ వస్తువుకైనా పేరుపెట్టినప్పుడు ఏదో నిమిత్తాన్నిబట్టి పెడుతున్నాము,

మన పూర్వులుకూడా ఇప్పుడు మనం రూఢ పదాలనుకొంటున్న వాటికి వాళ్ల కాలంలో ఏవో కారణాలనుబట్టే ఆ పేర్లు పెట్టి ఉంటారనీ, ఆ కారణాలు మనకిప్పుడు తెలియడంలేదనీ నేను వ్రాసిన దానికి సమీక్షకులు ఆ నిరుక్తాలు లేవో ఉన్నాయనడానికి ఆధారాలేవీ నేను చూపించలేదని వాదించారు. ఆధారాలు చూపించ గలిగితే భాష ఎలా పుట్టిందో రుజువే చేసేద్దును. ఆధారాలు లేవు కనుకనే హేతువాదాన్నిబట్టి ఉండే ఉంటాయని ఊహించాను

'సాహిత్య ప్రయోజనము' అన్న వ్యాసంలో నేను శాస్త్రవిజ్ఞాన సాహిత్యముల ప్రయోజనాలను తులనాత్మకంగా చర్చించి తాత్కాలిక (అనగా రచయిత కాలానికి మాత్రం సంబంధించిన) సంఘ ప్రయోజన దృష్టితో మాత్రమే సాహిత్యానికి విలువ కట్ట కూడదని, వ్యాసం మొదటినుంచి చివరివరకు హేతువులూ ఉదాహరణలూ చూపుతూ ప్రతిపాదించాను. సమీక్షకులూ ఇక్కడ 'తాత్కాలిక' అన్న ముఖ్యమైన మాటని సరిగా గమనించక ఇదంతా రొమాంటిక్ భావన అనీ, హేతుబద్ధంకాదనే ఉపపత్తి చూపించకుండా కొట్టిపారేశారు. బహుశః సమీక్షకులు 'తాత్కాలిక సంఘ ప్రయోజనం' అంటే సంఘప్రయోజనమంతా క్షణికం (తాత్కాలికం) అనీ, సాహిత్యప్రయోజనం దీనికి అతీతమైనదనీ నా అభిప్రాయమని భ్రమించి ఉంటారు. 'ఒక విజ్ఞానం యొక్క విలువని నిర్ణయించడానికి వెంటనే తత్కాలంలో దానివలన ప్రయోజనం ఉంటుందా అని చూడకూడదు' అని నేను వ్రాసిన వాక్యం సరిగా పరిశీలించుతే ఈ భ్రమకి అవకాశంలేదు.

'కవిత్వము—ఇతివృత్తము' అన్న వ్యాసంపై చేసిన సమీక్షలో 'నాయికా నాయకులున్నదే ఇతివృత్తమని హనుమంతరావుగా రభిప్రాయపడుతున్నట్టుంది' అని సమీక్షకులు అనవసరంగా సందేహనిమగ్నులయ్యారు. నేను ఉదాహరించిన రెండో మూడో ఇతివృత్తాలలో నాయికా నాయకు లున్నంతమాత్రాన సమీక్షకు లిలా సందేహించడం భావ్యంకాదు. టాల్‌స్టాయ్, డికెన్స్ మొదలైనవారు గొప్ప ఇతివృత్త రచయితలని వ్రాశాను. వారు రచించిన కథలన్నిటిలో నాయికా నాయకులున్నారా? 'సామాన్యుడి జీవిత లోనూ సంఘర్షణ ఉంటుందని అంగీకరించడానికి హనుమంతరావు గారి అభ్యంతరమేమిటో అర్థంకాదు' అని వ్రాశారు. నాకేమీ అభ్యంతరంలేదు, ఉన్నట్టు నేనావ్యాసంలో వ్రాయనూలేదు. జీవితంలో సంఘర్షణపడిన వ్యక్తి ఇంక సాధారణుడుగా ఉండడు. అసాధారణుడవుతాడు. పూర్వం రాజులు జన్మతః సంఘంలో ప్రముఖులై ఉండేవారు. తక్కినవారికన్నా వారి జీవితంలో గొప్ప సంఘర్షణ జరగడానికి ఎక్కువ అవకాశాలుండేవి. ఇప్పుడందరికీ సమానావకాశాలున్నాయి. 'ఎవరి జీవిత లో విశేషం ఉండి అది పరీక్షితమవుతుందో వారి కథ కావ్యేతివృత్తం కాజాలుతుంది' అని నేను ఇతివృత్త లక్షణాన్ని చెప్పాను. రాజుకావచ్చు, బిచ్చగాడు కావచ్చు; స్త్రీ కావచ్చు పురుషుడుకావచ్చు, నపుంసకుడు కావచ్చు; ఏనుగు కావచ్చు, ఎలక కావచ్చు; వ్యక్తి కావచ్చు, జాతి కావచ్చు; వస్తువు కావచ్చు, అవస్తువు కావచ్చు— ఈ వివరాలన్నీ ఆ వాక్యంలో గతార్థాలవుతాయి.

'కావ్య లో వాస్తవికతను గురించి హనుమంతరావుగారు చేసిన వాదాన్ని సమర్థించలేం.. కలకత్తా సముద్ర తీరాన ఉందనటం factual mistake. అది ఏ విధంగానూ సమర్థనీయం కాదు' అని వ్రాశారు. సాహిత్యంలో భావం ప్రధానమనీ వాస్తవికత గౌణమనీ నిరూపించడానికి కలకత్తా సముద్రతీరంలో ఉందనడం సాహిత్య దృష్టిలో పెద్దపొరపాటుకాదని నేను వ్రాశాను. సమీక్షకులు ఆ వెలుగులో దీనిని చూడలేదు. 'రాజాంనుంచి ముళ్లపల్లె గ్రామానికి వెళ్తున్న రోడ్డుమీద మర్రిచెట్టు క్రింద ఉన్న సోడా దుకాణంలో నరసయ్యా అప్పలమ్మా మాటాడుకొంటున్నారు' అని కథ ప్రారంభమయితే, వెంటనే పఠిత కథలో తర్వాతి వాక్యం చదువుకు పోతాడు తప్ప రాజాంనుంచి ముళ్లపల్లెకు రోడ్డుందా, అక్కడ మర్రిచెట్టుక్రింద సోడా దుకాణం ఉందా, అసలు రాజాం దగ్గర ముళ్లపల్లె ఉందా అంటూ ఆలోచించడు.

'మహాప్రస్థానం' అనే ఖండికలో 'ఎర్ర బావుటా నిగనిగలు' అనటంవల్ల భావాపకర్షణ జరుగుతున్నదని నిర్ధారించేముందు అసలా ఎర్ర బావుటా నిగనిగల్ని గురించి చెప్పటమే ఆ ఖండికలో కవి ప్రధానంగా చెప్పదల్చుకొన్న భావమని గుర్తించక్కర్లేదా' అని ప్రశ్నించారు. 'హరోం హరోం హర' అన్న ప్రాచీన కాలపు యుద్ధ నినాద, అందరు రాజులనూ కొల్లగొట్టి ధర్మరాజుని కుబేరుణ్ణిచేసిన ధనంజయునితో ఔపమ్యం ఇవి ఈ కవితను గుర్తించడానికి బాధకాలుగా ఉన్నాయి. పైగా 'ఎర్రబావుటా నిగనిగలు, హోమజ్వాలల భుగభుగలు' అంటూ గేయం ముగిసింది. ఎర్రబావుటాకీ, హోమజ్వాలకీ ఏం సంబంధం ఉంది?

'దేశచరిత్రలు' కవితలో మొదటి పంక్తులలో ప్రదర్శితమైన భావవిస్తృతి 'దరిద్రులను కాల్చుకు తినడం' అన్నదగ్గర సంకుచితమైందని నేను వ్రాసినదానికి, ఆ కవితకంతటికీ ఆ అభిప్రాయమే ప్రాతిపదికమనీ, నాలుగో పంక్తిలోనే 'పరపీడన పరాయణత్వం' అని ఉందని; శ్రీశ్రీ గారి 'మహాప్రస్థానం' ఖండకావ్యసంపుటిని విమర్శించడానికి ఆ కవిత్వానికి ప్రాతిపదికాలైన రాజకీయ సిద్ధాంతాలను గురించి 'తగినంత' పరిజ్ఞానం ఉండాలనీ, శ్రీశ్రీని విమర్శిస్తున్న సాంప్రదాయిక విమర్శకులకు 'తగినంత' రాజకీయ పరిజ్ఞానంలేదనీ సమీక్షకులు వ్రాశారు. రామాయణాది యుద్ధాలలో 'పరపీడన పరాయణత్వం' ఉంది కాని 'దరిద్రులను కాల్చుకు తినడం' లేదు. ఈ అభిప్రాయం ఇటీవలిది. సాంప్రదాయిక విమర్శకుల రాజకీయ పరిజ్ఞానం మాటకేంగాని, 'మహాప్రస్థానం'లో కొన్ని ఖండికలు రచించిన నాటికి శ్రీశ్రీగారు[1] మార్క్సు మొదలైన వారి సిద్ధాంత గ్రంథాలు చదవలేదన్న విషయం మనం గమనించాలి. 'దేశచరిత్రలు'లోని 'ఇతరేతరశక్తులు లేస్తే' అన్న వాక్యాన్ని ఒక విమర్శకుడు ఒక రాజకీయ సిద్ధాంతం ప్రకారం వ్యాఖ్యానించడం,[2] ఆ వ్యాఖ్యకి కీలకమైన 'ఇతరేతర' శబ్దార్థాన్ని శ్రీశ్రీగారే అంగీకరించకపోవడం[3] జరిగింది. కనుక శ్రీశ్రీ కవిత కేవల రాజకీయసిద్ధాంత దృష్టితోచేసే వ్యాఖ్యానాలకి లొంగదు.

'భిక్షువర్షీయసి'లో తను సహజ జీవికా వ్యాపారంలో ఉన్న కుక్కా తొండా మానవుని స్వార్థపరత్వానికి సరైన సంకేతాలుకావని నేనన్న దానికి 'స్వార్థపరత్వం లేకుండా తను కళ్ల ముందు జరిగే వాటిని కూడా పట్టించుకోకుండా తమ తమ పనులలో మునిగిపోయేవారికి కుక్క, తొండ సంకేతాలు' అని సమీక్షకులు వ్రాశారు. తన కళ్ల ముందు జరిగే వాటిని పట్టించుకోకుండా తను పనులలో నిమగ్నులయేవారు స్వార్థపరులుకాక ఇంకెవరు? భిక్షువర్షీయసి అద్వైతస్థితిలో ఉండగా ఆమెను చూడకుండా తమదారిని తాము వెళ్లిపోయిన మనుష్యులు స్వార్థపరులు. కాని తమ సహజజంతుప్రవృత్తిలో ఉన్న కుక్కా తొండా స్వార్థపరయులుకావు. భిక్షువర్షీయసి జీవితదైన్యానికీ కుక్కలకీ తొండలకీ సంబంధంలేదు. నిస్స్వార్థములైన కుక్కా తొండా స్వార్థులైన మనుష్యులను సరిగ్గా సూచించజాలవు. స్వార్థపరులైన మనుష్యులమీద పతితలకు కోపం

---

1 సృజన—శ్రీశ్రీ సాహిత్య సమాలోచన (14) ఫిబ్రవరి 1970.

'మహాప్రస్థానం' అన్న గీతం రాసేనాటికి నాకు (Marxism)ను గూర్చి తెలియనే తెలియదు.' శ్రీశ్రీ ఉవాచ (పేజీ 2) 'అప్పటికీ ఇప్పటికీ మార్క్సిస్టు సిద్ధాంతం గురించి స్థూలంగా తప్ప శ్రీశ్రీకి తెలియదని నా అభిప్రాయం' శ్రీ కె వి. రమణారెడ్డి (పేజీ 10). 'శ్రీశ్రీ మార్క్సిస్టు సిద్ధాంత పరిజ్ఞానాన్ని గురించి రమణారెడ్డి ఇదే సంచికలోవేసిన అంచనాలతో ఈ వ్యాసకర్త ఏకీభవిస్తున్నాడు' శ్రీ చేకూరి రామారావు (పేజీ 111).

2. సంవేదన (3) అక్టోబరు 1968. (పేజీ 77.)

3. పై సృజన. పేజీలు 6, 137.

తెప్పించే అన్యసంకేతాలను వేటినైనా ఈ పద్యంలో కవి ప్రయోగించవలసి ఉంది. అట్లా కాకపోవడం వలన 'కుక్కలు తొండలువలె మనుష్యులు తమ తమ జీవితాలలో మునిగి ఉన్నారు' అన్న దూరారాన్ని మాత్రం ఇక్కడ పాఠకుడు ఊహించుకొని తర్వాతి పద్యంమీదకు దృష్టి మరలుస్తాడు. పాఠకుడి దృష్టిని పట్టుకొందుకి బదులు ఈ పద్యం వదిలేస్తోంది. ఈ సంకేతాలు సరైనవికావు కనుకనే, ఈ పద్యానికి అటూ ఇటూ ఉన్న పద్యాలు మన మనస్సుకు హత్తుకొంటూ ఉండగా ఈ పద్యం నిర్లిప్తంగా జారిపోతోంది. 'వెర్రిగాలి'లోనూ 'ఎంగిలాకు'లోనూ మానవత్వారోపణం ఉండడం, కుక్కలోనూ తొండలోనూ లేకపోవడంవలన, మానవ జీవిత వ్యంగ్య వర్ణనాత్మక ఖండకావ్యంలో కుక్కా తొండా సరైన ఉపకరణాలు కాలేకపోతున్నాయి.

'ఆంధ్రకవితా సరస్వతికి బరువు నగలు' అన్న వ్యాసం సమీక్షలో తెలుగు ఛందస్సులోని యతిప్రాసలు కవితారచనకు చాలా ప్రతిబంధకాలన్న నా అభిప్రాయాన్ని గురించిన పరిశీలనను పక్కకునెట్టి 'అయితే గణాలుమాత్రం బంధాలుకావా?' అని సమీక్షకులు ఎదురు ప్రశ్నవేశారు. గణాలు బంధాలు కావని ఎవరన్నారు? ఆధునికకవులు యతిప్రాసల బంధాలనేకాక గణబంధాలనుకూడా ఏనాడో దాటేశారని సమీక్షకులు హెచ్చరించారు. దాటితే దాటారు; దానికీ ఆ వ్యాసంలో ప్రమేయవిషయానికీ సంబంధమేమిటి? మరి, వచన కవిత్వంలో కూడా ప్రస్తుతం కొంత తరచుగా కానవస్తున్న అంత్యప్రాసలూ ఇతర శబ్దాలంకారాలూ మాత్రం బంధాలు కావా? వీటినికూడా ఎందుకు దాటకూడదు? అసలామాటకొస్తే, కులాసాగా కబుర్లు చెప్పడానికి బదులు ఏకాగ్రతతో ఏదైనా వ్రాయడంమాత్రం బంధంకాదా? ఈ ప్రశ్నలకి అంతెక్కడుంది? ఆధునిక కవులు కొందరు వచనకవిత్వం వ్రాస్తున్నారుకనుక ఇంక ఛందస్సును గురించిన చర్చ శుద్ధదండుగఅని సమీక్షకుల ఉద్దేశమైనట్లయితే, సమీక్షకులు నమ్మకంగా పొరపడుతున్నారు. ఆధునిక వచనకవిత మినహాగా నన్నయ్యనుండి నేటివరకు అందరు కవులూ ఉపయోగించిన, నేటికీ ఉపయోగిస్తున్న ఛందస్సులో యతిప్రాసలు ముఖ్యప్రతిబంధకాలని తలచి చర్చించాను. సంస్కృతమూలాలనూ తెనుగు అనువాదాలనూ సరిపోల్చాను. సంస్కృతశ్లోక రచనలోఉన్న సౌలభ్యం తెనుగుపద్యరచనలో లేదన్నదే ఆ వ్యాసంలో నేను నిరూపించ యత్నించినది. ఈ విషయం సమీక్షకులు పట్టించుకోలేదు. వ్యాసకర్త ఏవిషయంగురించి వ్యాసం వ్రాశాడో దానినిగురించి సమీక్షకుడు విమర్శించాలి తప్ప సమీక్షకులకు కావలసిన విషయాలన్నీ వ్యాసకర్త వ్రాయజాలడు కదా!

'ద్రాఘిష్ఠ సమాసరచన', 'దధ్యుపఘాతుకములు'వంటి ప్రయోగాలు అరుదుగా మాత్రమే ఉన్నందుకు నా రచనాశైలిని సమీక్షకులు క్షమించారు. అరుదుగాకాక ఇంకా కొంతవిరివిగా ఉంటే ఏమయేది? 'కొందరకు తెనుగు గుణమగు కొందరకును సంస్కృతంబు గుణమగు...'అనికదా శైలినిగురించి మన వారి ఇచ్చ! ఇంతకీ 'వాగ్వ్యవహారం', 'వ్యక్తీకరణ కడ్డు'అని ప్రయోగించిన సమీక్షకులు పై ప్రయోగాలను ఆక్షేపించబూనడం తగదు

సమీక్ష ముగిస్తూ 'పరిమితమైనా, వీరిలో హేతువాదదృష్టి ఉంది......కొంతవరకైనా, హేతుబద్ధంగా ఆలోచించగల విమర్శకులు...'అని సమీక్షకులు నన్ను ప్రోత్సహించినందుకు చాలా కృతజ్ఞుడిని. కాని ఇది సమీక్షవ్రాసే పద్ధతి కాదనుకొంటాను. సాధారణంగా సమీక్షకు పుస్తకం తన చేతిలో పడగనే ఆ పుస్తకరచయితకన్నా తాను పై దర్జాకు చెందినవాడినన్న ఆధిక్యదృష్టిని సమీక్షకుడు అప్రయత్నంగా అలవరచుకొని, మాష్టరుగారు విద్యార్థి పరీక్షపేపరుదిద్ది మార్కులువేస్తున్న పద్ధతిలో సమీక్ష సాగించడం నేడు పత్రికలలో అక్కడక్కడ చూస్తున్నాము. ఈ సమీక్షకుల పైవాక్యాలలో ఇదే ధోరణి స్ఫురిస్తుంది. రచయిత యదభిముఖంగా రచన చేశాడో, తదభిముఖంగా సమీక్షించి, తన దృష్టిలో దాని బాగోగులను సమీక్షకుడు చర్చించాలి. రచయితనూ సమీక్షకుడినీ మించినవారూ, వారితో సమానులూఅయిన విద్యావివేకసంపన్నులైన పఠితలు కోకొల్లలుగా దేశంలో ఉంటారు. ఎవరిది హేతువాదబద్ధమైన ఆలోచనో, ఎవరి హేతువాదదృష్టి పరిమితి ఎంతో సహృదయులైన పఠితలు సులభంగానే నిశ్చయించుకొంటారు,

# దేవులపల్లి సోదరకవుల అవధాన చాతుర్యము

## శ్రీ రాపాక ఏకాంబరాచార్యులు

ప్రభువులచే పండితకవులు, పండితకవులచే ప్రభువులు నలరారుట ఆంధ్రవాఙ్మయ చరిత్రమున గల ఒక విశిష్టత. నన్నయగారు మొదలు శ్రీ తిరుపతి వేంకటకవులవరకుగల తెలుగు సాహిత్యమును పరిశీలించినవారి కీ సత్యము స్పష్టమగును. ఆధునిక కాలమున ఆంధ్రసాహితీసేవ యొనరించి తరించిన విద్వత్ప్రభువులలో గణనీయులు శ్రీ పీఠికాపురాధీశ్వరులు గంగాధరరామారావుగారు. శ్రీ రాజావారి నామము తలంపగనే వారి సరసన శ్రీ దేవులపల్లి సోదరకవులు — దేవులపల్లి సుబ్బరాయశాస్త్రిగారు, తమ్మనశాస్త్రిగారు — ప్రత్యక్షమగుదురు.

గ్రంథములద్వారా తెలియు వారి అపారపాండితీ వైభవమొకయెత్తు. అసాధారణ మేధాసంపత్తిని ఉగ్గడించు అవధాన విద్యాప్రాభవ మొకయెత్తు. ఈ వ్యాసమునందు వారి యవధాన విశేషములు కొన్ని ముచ్చటించుకొందము.

అసాధారణ ధారణాపటిమ, సరసాశుకవనము, ప్రతిభావ్యుత్పత్తులు, శాస్త్రజ్ఞానము, సమయస్ఫూర్తి, చమత్కారాది ప్రజ్ఞలుగల మహనీయులుండవచ్చును కాని వానిని సరసముగ సమ్మేళన మొనర్చి ఒక అపూర్వకళగా రూపొందించు నైపుణ్యము బహు కొద్దిమందికే పరిమితమై యుండును. సహజప్రజ్ఞావంతులు అట్టి అపూర్వకళను చూపిన తనే గ్రహింతురు. ఈ సత్యమే శ్రీ దేవులపల్లి సోదరకవులయందు యదార్థమైనది.

అవధాన విద్యావారిధి యనదగు విద్వాన్ మాడభూషి వేంకటాచార్యులుగారు 1879 నవంబరు నెలయందు పీఠికాపురాస్థానమునకు విచ్చేసి యొక శతావధానమును సల్పిరి. అంతవరకు శ్రీ దేవులపల్లి సోదరకవులు శతావధాన స్వభావమునుగూర్చి విని యుండిరేకాని తదవధాన స్వరూపమును చూచి యుండలేదు. వేంకటాచార్యులుగా రొనర్చిన శతావధానమును వీక్షించిన శ్రీ దేవులపల్లి సోదరకవులు తద్రచనా విధానమును సులువుగా గ్రహింపగలిగిరి. వారును శతావధాన మొనర్చుటకు సంసిద్ధులయి, దానిని విజయవంతముగా నొనర్చి విద్వాన్ వేంకటాచార్యులుగారిచే ప్రశంసితులైరి.

అటుపిమ్మట శ్రీ దేవులపల్లి సోదరకవులు పలుతావుల అవధానవిద్యను ప్రదర్శించిరి. వారొనరించిన అవధానములలో పేర్కొనదగినవి:—మద్రాసు అష్టావధానము (19 ఫిబ్రవరి 1895); మైలపూరు అష్టావధానము (8 నవంబరు 1896); శ్రీ ఎడ్వర్డు ప్రభువులయొక్క పట్టాభిషేకోత్సవ సమయమున పీఠికాపురమునందొక అష్టావధానము (1903). శ్రీ జె. ఆండ్రూగారు పీఠికాపురము విచ్చేసిన సందర్భమున (16 డిశంబరు 1903) నొక అష్టావధానము; విద్యాధికారులగు శ్రీ ఏ. ఎల్. విలియమ్సుగారు పీఠికాపురము వచ్చినపుడు (13 ఏప్రియల్ 1904) మరొక అష్టావధానము.

'అవధాన కవిత్వమునందు రసముబ్బుట దుర్లభము' అను నొక నుడి కలదు. కాని శ్రీ దేవులపల్లి సోదరకవుల అవధానకవిత్వమునకు ఈ విమర్శ వర్తింపదు. ఏలననగా వీరి యవధాన పద్యములు సావధానముగా వ్రాసిన పద్యములవలె రసాలంకార పరిపుష్టమై శోభిల్లును. మచ్చునకు కొన్నిపద్యములను శ్లోకములను ఇచట ఉదాహరింతుము. ఒక పృచ్ఛకుడు—

'ద్రౌపద్యాః పాండుతనయాః పతిదేవర భావుకాః
న దేవరో ధర్మరాజ స్సహదేవో న భావుకః

అను శ్లోకమును ఇచ్చి, అచ్చతెనుగున ఆంధ్రీకరింపుమని కోరగా—

'జముకొడు కీదుపట్టియును
జన్నపుఁబోతెపుతేనికందు దూ
ర్పు మనియకాని వెజ్జులకు
బుట్టినవారును బావగార్లు ఔం
డ్లు మఱదుకాదు రైదుగురిలో
గడుఁ జిన్నతఁడెన్న బావగాఁ
డు మఱఁదిగాఁడు పెద్దయుతఁడుం
దగ ద్రోవది కెంచి చూడినన్॥

అని వారు సరసముగ ననువదించిరి. అవధానములో అనేకవిషయములపై మనసు చెదరియుండు సమయమున ఇట్టి అనువాదము చేయుట ప్రశంసనీయమని నాటి సభాధ్యక్షులు శ్రీమాన్ వేంకటాచార్యులుగారు కూడ దీనిని మెచ్చుకొనిరి. ద్రౌపదికి పాండవు లయిదుగురు ఏవిధావిక వారగుదురో పూరణార్థము లగు చకారాదులు లేక చెప్పవలెనని ప్రశ్నింపగా కాళిదాసు చెప్పిన శ్లోకమిది. ద్రౌపదికి పాండవులు భర్తలు, మఱదులు, బావలు. అందు ధర్మరాజు మఱదికాడు. సహదేవుఁడు బావకాడు. ఈ చమత్కారము చెడకుండ, పూరణార్థము లేకుండ సంస్కృత పదములు లేకుండ అచ్చతెలుగులో అనువదించుటలో ఆ మహనీయుల ప్రతిభావిశేషము మనకు విశదమగుచున్నది. జముకొడుకు ధర్మరాజు, ఈదుపట్టి భీముడు, జన్నపుటోరెపుతేనికందు అర్జునుడు, తూర్పుమనియకానివెజ్జులకు పుట్టినవారు నకుల సహదేవులు. అచ్చతెలుగులో వరుస తప్పకుండగ ఎంత చక్కగ చెప్పిరో చూడుడు.

దేవులపల్లి సోదరకవులుచేయు అష్టావధానములలోని రెండు, క్లిష్టప్రక్రియలను మచ్చున కుదాహరింతును. సంస్కృతములోని శ్లోకములలో ఒక్కొక్కపాదము ఒక్కొక్క శ్లోకమునుండి మువ్వురు సదస్యులు చదివిన పిమ్మట అవధాని నాల్గవ పాదమును తాను కల్పించి, పూరించి ఆ వ్యస్తపాదములకు అర్థాన్వయము ఉండునట్లు చేయవలెను. ఒకసారి అష్టావధానమున 'అయం సతే తిష్ఠతి సంగమోత్సుకః' అని ఒకరు శాకుంతలమునుండి, 'విభావరీ భాతి సదంబుజేన' అని రఘువంశమునుండి వేఱొకరు, 'దుద్దుద్వయం కుండల మండితానాం' అని చాటు శ్లోకమునందలి పాదమును వేఱొకరు చదువగా శ్రీ దేవులపల్లి సోదరకవులు 'అగ్రేసరో దాశుమరాన్యగాక్షి' అని పూరించి శ్లోకమును అర్థవంత మొనర్చిరి.

ఇట్లే ఆంగ్లమున, తమిళమున వ్యస్తాక్షరికి పద్యపాదముల నీయగా వేరువేరు చీటీలపై లిఖియించి యిచ్చిన ఆ అక్షరములను గుర్తుంచుకొని అర్థము తెలియని భాషలో క్రమము తప్పక మరల వారా పద్యములను ప్రకటించిరట. ఇది వారి ధారణాబలమునకు మహాద్భుతమగు నిదర్శనము. తెలియని భాషలో విన్నదాని చెప్పుటవేరు. అక్కడక్కడ అక్షరముల నిచ్చిన వానిని గుర్తుంచుకొని అర్థము చెడకుండ వాటిని ఏకముచేసి చదువుట వేరు.

ఆంగ్లము :—

టోల్ ఫర్ ది బ్రేవ్, ది బ్రేవ్ దట్ ఆర్
నో మోర్
ఆల్ సంక్ బినీత్ ది వేవ్, క్లోస్ బై
దెయిర్ నేటివ్ షోర్
(Toll for the brave, the brave that
are no more
All sunk beneath the wave, close by
their native shore)

తమిళము :—

'పళనుయి యొనప్పుడు, పధియాదేసిన్
కెళమె య్యెక్కిళిం దానల్లు,'
(మైలపూరు అష్టావధానము)

నేటి అవధానములలో సంస్కృత శ్లోకమునే వ్యస్తాక్షరిగా నొసంగుట జరుగుచున్నది. కాని ఆనాడు ఏ భాషలో నిచ్చినను చేయగలిగి యుండెడివారు.

నిర్దిష్టాక్షరి అనునది ఒక ప్రత్యేకమగు ప్రక్రియ. ఇందు ఒక శ్లోకములోని అక్షరము

లిపియై యుండవలెనని నిర్దేశించి ఒక విషయమును ఒక శ్లోకమును రచింపమని కోరగా అట్లవధాని పూరించును. ఇంతియేకాక ముప్పది రెండు గదులు గల మూడు వరుసలు గీచి ముగ్గురు కొన్ని నియమముల మేరకు అడుగుచుండగా వారి వారియిష్టదేవతా స్తుతి రూపముగా మూడు శ్లోకములు వచ్చునట్లు చెప్పి వానిని క్రమముగా చదువుటయేకాక తల క్రిందులుగ నప్పజెప్పిరి. ఇందు 32 గదులలో కోరిన గదికి అక్షరమును చెప్పుచు దత్తాత్రేయస్తుతి ఆంజనేయస్తుతి వచ్చునట్లు రెండు శ్లోకములు రచించిరి. మూడవవారు బేసిసంఖ్యగల ఇండ్లలో తవకు వచ్చిన హల్లులను వ్రాసియుండగా వానిపై తగిన అచ్చులను చేర్చుచు అర్థమునకు సరిపడునట్లు సరిసంఖ్యలో అక్షరముల నిముడ్చుచు వారి యిష్టదేవతయగు శ్రీశంకర పరముగా నొక శ్లోకమును కూర్చిరట. ఇది యెంత ఆశ్చర్యకరమగు ప్రక్రియయో చూడుడు. ఈ తరువాతి అవధానములలో ఇట్టివి లేవనుకొందును. ఆ మూడు శ్లోకములను ఇచ్చట పొందుపరచుచున్నాను.

దత్తాత్రేయస్తుతి :—

'నమస్తే సద్గుణాధారం యోగి సంఘాత శేఖరం ।
కార్తవీర్యార్జున గురుం దత్తాత్రేయ మహం భజే.'

ఆంజనేయస్తుతి :—

'సీతా శోకాపహర్తారం వారాశి తరణ క్షమం
శ్రీరామ పాదభక్తం తం మాంజనేయం.
భజామ్యహమ్.'

శంకరస్తుతి :—

'కాశీపతే నమో గంగా జటాజూట వాళి సితాళితే
చంచత్తేజో యతీడ్గేయ రమేట్చాప తేమ
సుందర

ఇట్లు సంస్కృతమున తెలుగున సమానుగు చాతుర్యమును ప్రదర్శించిన ప్రతిభా సమున్మేష విరాజితులు శ్రీ దేవులపల్లి సోదరులు. తెలుగుననేకాక సంస్కృతమునకూడా వారు సమస్యలు పూరించుచుండిరి. అందొకసారి మైలాపూరునందు కృష్ణస్వామయ్యగారు 'చంద్రజ్యోత్స్న స్ఫురతిగగనే పశ్యనీలోత్పలశ్రీః' అను సమస్య నొసగిరి. దానిని సమస్యాపూరణ మాత్రముగనే కాక రసవంతముగ నలంకారయుతముగ పూరించిరి.

> 'జీమూతశ్రీర్వహతి మహతీ సా కాశ్చంచరీకా
> శ్చాంపేయాగే దధతి వలనోల్లాస లీలా మిహానీం
> చిత్రం మందక్రము మహర త్యక్రశృంగాగతో సౌ
> చంద్రజ్యోత్స్న స్ఫురతి గగనే పశ్యనీలోత్పలశ్రీః'

ఈ సమస్యను పూరించుటలో వారు చూపిన ప్రజ్ఞ అనుపమము కొంతకాలము ప్రయత్నించి అను సంధించిన కాని శ్లోకమున నిముడని భావమును ఆశువుగా నమర్చిరి. ఇట్టి పాండిత్యబలము ప్రతిభావైశిష్ట్యము, ధారణాబలము, ఆశుకవితా చాతుర్యము, అనర్గళముగా సాగు ఆంధ్ర గీర్వాణ కవితారీతులు గాంచిన శ్రీ దేవులపల్లి సోదరకవులు ఆ నాడేకాదు ఈనాడు కూడా మన మనసులకు ఒక నూతనోత్తేజమును కల్పింప జాలిరనుట త్రికాలాబాధితమగు సత్యమని మనవి చేయుచున్నాను. ఇట్లు నూత్నప్రక్రియలతో అవధానమొనర్చి, అవధాన సరస్వతి కపూర్వాలంకారమును అర్పించిన శ్రీ దేవులపల్లి సోదరకవులకు ఆంధ్రలోక మెల్లప్పుడు కృతజ్ఞమై యుండక తప్పదు. వారికి ఇవే నా జోహారులు.

# బాలవ్యాకరణంలోని ఛందోమయ సూత్రాలు

శ్రీ పి. శంభుప్రసాద్

యతిప్రాసలు మన భాషకు జీవగఱ్ఱలు. సామెతలలోనూ, జాతీయాలలోనూ, సూక్తులలోనూ, గీతాలలోనూ, ఇందుగలవందులేవని సందేహమువచ్చే స్థానమీయక నాడునాడునా వేళ్ళుపాతుకుని పోయాయి. ఇవి మన భాషలో, తెనుగు మాట్లాడేవారి పూర్వపుణ్యమూ, యోగబలమూ ఏమిటోకాని, తెనుగు మాట్లాడే ప్రతివాడూ తను మాట్లాడేది గబుక్కున ఏదో ఒక ఛందస్సులో అప్రయత్నంగా అనేస్తాడు. దీనికి కారణం తెనుగు భాషలోని తీయందనమే కావచ్చును. ఇది గ్రహించే కాబోలు, కన్నడరాయలైన కృష్ణరాయలు 'దేశభాషలందు తెనుగు లెస్స' అని అంటారు. ఆరుద్ర, ఒకచోట 'ఉబలాటంకాక ఉద్రేకం పుట్టుకొస్తే, కీర్తికోసంకాక ఆర్తివల్ల అరిస్తే, చెప్పకుండానే ఏదో ఒక ఛందంలో. చెవికింపుగా, వినసొంపుగా, కవిపలకడం కచ్చితంగా ఖాయం' అంటారు. కాని, కొంచెం ఎక్కువ దూరం ఆలోచిస్తే, కవితా సంస్కారం గాఢంగాపాతుకుపోయిన మనుషులు, అప్రయత్నంగానే, పై ఉద్రేకంకాని, ఉబలాటంకాని, ఆర్తికాని లేకుండానే, మృదుమధుర వాక్కులు పలుకుతారేమో అని అనిపిస్తుంది. ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే, 'బాలురకు సుసాధకముగుటకై' వ్రాసిన సూత్రగ్రంథంలోకూడా, అప్రయత్నంగా చిన్నయగారు ఛందస్సును ఇమిడ్చారు. తమాషా ఏమిటంటే, ఈ ఛందోమయ సూత్రాలలో కొన్నింటిలో ప్రాససాజాత్యమూ, మరి కొన్నింటిలో యతిసాజాత్యమూ కూడా ఉన్నాయి. ఇంకో విచిత్రం. కొన్నిసూత్రాలు మాత్రాఛందస్సులో మలచబడి ఉన్నాయి. ఇట్టి సూత్రాలలో ప్రథమాక్షర సాజాత్యం కూడా ఉంది. ఇట్టి ఛందోమయ సూత్రాలు 116 దాకా నేను బాలవ్యాకరణంలో చూచాను. అంటే, బాలవ్యాకరణంలో ప్రతినాలుగు సూత్రాలలోనూ ఒక సూత్రం ఛందోమయమన్నమాట! మరో చిన్న విచిత్రం. మనం తేలికగా చూచే ప్రౌఢవ్యాకరణంలో కూడా, శిష్యరిక ప్రభావంచే కాబోలు, ఈ ఛందోబద్ధత కన్పిస్తుంది. అయితే, ఇప్పట్కి అది విరళము. ఉజ్జాయింపుగా చూస్తే, పై బాలవ్యాకరణ ఛందోబద్ధ సూత్రాలలో 65 శాతందాకా కందపద్య లక్షణాలు కన్పిస్తాయి. తర్వాతి స్థానం ఆటవెలది పద్యాలు ఆక్రమిస్తాయి (15 శాతం). విరళంగా ఒకటిరెండు వృత్తాలూ, ద్విపద, సీసం, తేటగీతి కన్పిస్తాయి. ఇవేకాక సంస్కృత ఛందస్సులు-ఇంద్రవజ్ర ఛందస్సు, మందాక్రాంత ఛందస్సుకూడా కన్పించుతాయి.

ఇవన్నీ అతిసామాన్య పరిశీలనకు బయటపడక పోవచ్చును కాని, ఏకొంచెం నిశితదృష్టితో చూచినా బయట పడుతుంటాయి. దీనికి కారణం ఒకటై ఉండవచ్చు. సహజంగా చిన్నయగారు సూరిమాత్రమేకాక, కవికూడ. అందుచేత ఇందులో ఆయన ప్రయత్నించినదేమీ లేకపోయినా, కవితాధార అప్రయత్నంగా ఈ సూత్రాలలోకి జాల్వారింది. అదీకాక, ఈయన పద్యాంధ్ర వ్యాకరణాదులు వ్రాసిన వారవడంచేత, అక్కడి మాటలే ఇక్కడ ఆవృత్తి చెందిఉంటాయి, పదాలతోపాటు పద్యపాదాలకూడా అప్రయత్నంగా వచ్చిఉంటాయి. కాని ఇక్కడ ఒక్కవిషయం. ప్రతి ఛందోమయ సూత్రంలోనూ యతి ప్రాస సాజాత్యం కావాలంటేమాత్రం దొరకవు. వాటికి మనం కొంచెం సేపు అతీతులమై ఉంటేనే కథ నడుస్తుంది. దీనికొక కారణముంది. ఆయన కావాలని ఇలా వ్రాయలేదుకదా! కాని ఆయన ఘనతకు తార్కాణంగా అప్రయత్నంగా అక్కడక్కడ యతి ప్రాస సాజాత్యాలు

పొడగట్టుతాయి. కొన్నిసూత్రాలలో ఛందోబద్ధత ఎత్తుగడలోనే చూడగలం. కొంతదూరం పోయిన తర్వాత లక్షణం బెడిసిపోతుంది దీనికికూడ పైదే కారణం.

యతిసాజాత్యంగాని, ప్రాసనాజాత్యంకాని ఉన్న సూత్రాలను ముందు పరికించుదాం.

(1) తద్ధిత పరిచ్ఛేదాది సూత్రంలో కందం ఉంది.

తన వర్ణకంబు త్వార్థం
బునం దగు.

(2) తత్సమ 33 వ సూత్రంలో కొంత దూరంవరకు కందపద్య లక్షణాలు సరిపోతాయి.

సంబోధనం బునందుం బ
దంబు తుదియకా............

(3) కృదంత 14 వ సూత్రంలో ద్విపద ఉన్నది.

దక్కులోనగువాని దాకు డకారం
బు విభాషనగు.

కొన్నింటిలో విశేషాంశాలు ఉన్నాయి.

(4) తత్సమ 84 వ సూత్రంలో రెండు ఛందస్సులున్నాయి. అందొకటి మందాక్రాంత, వేరొకటి కందము.

ద్వ్యహ్నా చ్ఛబ్దం బులకుది
విహ్న దియగు.

(5) ఒక చిన్న విచిత్రం. ఒక సూత్రంలో ఉత్సాహవృత్తముంది! సాధారణంగా ఉత్సాహమును వ్యక్తీకరించేటప్పుడు దీనిని కవులు వాడతారు. అసలే వ్యాకరణం నిరుత్సాహం కల్గించే శాస్త్రం. ఒక పట్టాన అర్థం కాదు. అందులోనూ మొదట్లో కాదు! క్రియా పరిచ్ఛేదంలో 40 వ సూత్రంలో ఉంది. క్రియాపరిచ్ఛేదానికి ఉత్తర క్రియలు దాన్ని చదవకుండానే చేస్తారు చాలామంది. ఇక ఉత్సాహ వృత్తానికి స్థానమెక్కడ? ఇది అనౌచిత్యం కాదా? ఇక సూరిగారి ఘనత ఏమిటి అని సంశయంవస్తుంది. కాని, ఆయనగారు ప్రయత్నించి భంగపడితేకదా, పద్యంలో కాలువేసినాడను కొనుటకు? అసలటువంటి తరహా వ్యక్తి కాదాయన. మనం సమన్వయించేదేమంటే, ఈ ఛందస్సు ఆయన కలంనుండి అప్రయత్నంగా జారింది. ఇది ఆయన బహుశః గమనించి ఉండరు. ఇదొక్క దానినిబట్టియే, పరవస్తువారు అప్రయత్నంగా ఛందస్సులో సూత్రీకరించేరని స్థాపించుటకు వీలున్నది. కాని ఒక విధంగా సమర్థించవచ్చు. నాలుగు రాళ్లు సంపాదించుకునేందుకు 'వండనుం బోయిన' చైత్రున కుత్సాహం ఉండవచ్చు. 'చైత్రుండువండ నతిథి వచ్చుటచే' ఆగంతకుడైన అతనికి భుజింపను ఉత్సాహం ఉండవచ్చు. ఔచిత్యంమాత్రం చేకూరింది.

తు। మర్థభావ లక్షణంబునందు నుజీయగు.

మొదటి అక్షరాన్ని కాసేపు గురువుగా సరిపెట్టుకొని పై పాదంలో ఉంచితే, మిగతా సూత్రంలో యతిసాజాత్య సహిత ఉత్సాహవృత్తం కనిపిస్తుంది. అలా సరిపెట్టికొనలేనివారికి పంచచామరం సాక్షాత్కరిస్తుంది.

(6) క్రియాపరిచ్ఛేదంలో 103వ సూత్రంలో మాత్రాఛందస్సు కన్పిస్తుంది. అక్కడ ప్రథమాక్షర మైత్రికూడ కుదిరింది.

అచ్ఛికంబు లం
దయి యవు లకు వ
క్రతమంబులు బహు
ళంబుగా నగు

ఇందులోని ర – ళ మైత్రి పరిశీలింపతగినది.

(7) పైవిధంగానే తద్ధిత పరిచ్ఛేదం 6 వ సూత్రంలోకూడ మాత్రాఛందస్సు కన్పిస్తుంది.

నవర్ణకంబు గు
ణ వచనంబులకు
నల్లాదులకగు.

ఇందులోని ఏకాక్షర విన్యాసం గమనింపతగినది.

ఇంతవరకూ యతిసాజాత్యంకాని, ప్రాససాజాత్యం కాని ఉన్న సూత్రాలను పరికించాం. ఇప్పుడు అవి రెండు కూడ లేనివి పరికించబోతున్నాం. పైన పేర్కొనబడిన తరహావి ఇంతకంటె ఎక్కువ నేను చూడలేదు. వాటి శాతం మొత్తంమీద 1½% ఉంటుంది. ముందు రాబోయేవానిలో కూడ కొన్ని విచిత్రవిన్యాసాలు ఉన్నాయి. వాటిని పరికించబోయే ముందు, ఇంతకుముందు వచ్చినవాటితోనూ, ఇక రాబోయేవాటితోనూ సంబంధం కలిగి మధ్యస్థమైన ఒక ఉదాహరణను పరికించుదాం. ఇది క్రియా పరిచ్ఛేదం 64 వ సూత్రం. ఇందులో ఒక పాదమునకు దాదాపు సరిపోయే సూత్రం కందంలో ఉంది. ఇందులో యతి సాజాత్యముంది, ప్రాససాజాత్యం మాత్రం లేదు.

ఇ ఉ బు ల కిం చుక్కు పరం
బగునపుడ యుగస్థగ రుక్కులగు.

(9) సంజ్ఞా పరిచ్ఛేదం 21 వ సూత్రంలో ఇంద్రవజ్ర ఛందస్సు ఉన్నది.

త్రిలింగదేశ వ్యవహార సిద్ధం
బగుభాష దేశ్యంబు

(10) తత్సమ 24 వ సూత్రంలో సీస పద్య ఛందస్సు ఉన్నది.

ఇందులోని తూగు (balance) గమనించ దగినది.

అనుదంతమగు తెనుగు ద్రుమంతమునకుని
గా గ మం బ గు :

(1) ఆచ్ఛిక 28 వ సూత్రంలో ద్విపద ఉన్నది.

ఇ టి తి వర్ణంబులు వక్ష్యమాణంబు
లౌప విభక్తికంబులు

(12) కారక 14 వ సూత్రంలో ఆట వెలది ఉన్నది.

పట్టి వర్ణకంబు హేతువులగు గుణ
క్రియల కగు

(13) క్రియా పరిచ్ఛేదం 9 వ సూత్రంలో తేటగీతి ఉన్నది.

అందు వరుసను రెండేసి ప్రథమ మధ్య
మోత్తమంబు లనంబడు

(14) తత్సమ 86 వ సూత్రంలో కందం ఉంది.

వ్యాద్యాదులడుఙ్ఞనకు లోపము విభాషవగు (5)

(15) ఆచ్ఛిక 16 వ సూత్రపు ఎత్తుగడలో ఉత్పలమాల ఉంది.

ఔప విభక్తి కంబులలి వర్ణక......

మచ్చుకుమాత్రం ఇన్ని విభేదాల ఛందస్సునూ చూపించాను కాని, వీటిలో ఒక్కకందానికే అధిక ప్రాచుర్యం లభిస్తుంది. తర్వాతి స్థానం ఆటవెలదికి చెందుతుంది. నేను చూచిన 116 సూత్రాలలోనూ పర్యాప్తిచెందే ఛందో విభేదాల సంఖ్యా వివరాలను ఇప్పుడు అందిస్తాను.

| | |
|---|---|
| ఛందస్సు ఉన్నవి | 116 |
| పూర్తి సూత్రాలు ఛందస్సులో ఉన్నవి | 58 |
| కందము | 75 |
| ఆటవెలది | 16 |
| మాత్రా ఛందస్సు | 11 |

ఇవేకాక ద్విపద, తేటగీతులు వాలుగేసి చోట్ల; ఉత్పలమాల మూడుచోట్ల. ఉత్సాహము, సీసము, పంచచామరం. ఇంద్రవజ్రము మందా క్రాంతలు ఒక్కొక్కచోట గోచరిస్తాయి. ఛందస్సు లేని సూత్రాలుకూడా వినడానికి శ్రావ్యంగా, చదవ డానికి సులభంగానే ఉంటాయి దీనికి ఆ సూత్రాలలోని పదాల విరుపులు కారణం కావచ్చు.

క్రింది పట్టికలో ఒక్కొక్క పరిచ్ఛేదంలో ఉన్న సూత్రాల మొత్తం (1), వానిలో ఛందస్సు ఉన్నవాటి మొత్తం (2), సూత్రం మొత్తంలోను ఛందస్సు ఉన్నవి (3), ఎత్తుగడలో మాత్రమే ఛందస్సుఉన్న సూత్రాలూ (4), ఛందస్సుఉన్నవానిలో

యతిసాజాత్యంకాని ప్రాససాజాత్యంకాని ఉన్న సూత్రాలు (5)—వాటి సంఖ్యా వివరాలు లిఃకొనవచ్చును.

| పరిచ్ఛేదం | (1) | (2) | (3) | (4) | (5) |
|---|---|---|---|---|---|
| సంజ్ఞా | 23 | 17 | 7 | 10 | — |
| సంధి | 55 | 18 | 16 | 2 | — |
| తత్సమ | 87 | 28 | 18 | 10 | 2 |
| ఆచ్ఛిక | 38 | 6 | 1 | 5 | — |
| కారక | 37 | 7 | 3 | 4 | — |
| సమాస | 26 | 1 | — | 1 | — |
| తద్ధిత | 28 | 5 | 4 | 1 | 2 |
| క్రియా | 124 | 19 | 12 | 7 | 3 |
| కృదంత | 22 | 6 | 6 | — | 1 |
| ప్రకీర్ణక | 25 | 5 | 3 | 2 | — |

చిన్నయగారికి ఆచార్యులవారు శిష్యుడవడంచేత ఆయన ప్రసక్తికూడ తెస్తే బాగుంటుంది. ఈయన సూత్రాలు కొండవీటి చేదంతాడు (చేంతాడు)లను మరపిస్తాయని ప్రతీతి. కాని వీటిలోకూడ కొన్ని ఛందోగర్భితాలు లేకపోలేదు. మచ్చుకు ఒక్కటి. శబ్ద పరిచ్ఛేదంలోని 70 వ. సూత్రంలో ఉత్పలమాల ఎత్తుగడ ఉంది.

ఎవ్వరి తాదులందలి రివర్ణర.........
కాని ఇవి విరళమని చెప్పుకోక తప్పదు.

పై శోధన అంతా ఒక్క సూత్రాలలో చేసినది మాత్రమే. ఇంకా సూరిగారి వృత్తులను, వార్త్తికాలనూ పరికిస్తే వాటిలోకూడ కొన్ని ఛందోగర్భితాలని తెలుస్తుంది. ఉ'జ్ఞర్వి భాగమీలా| గునవే... అనే ఎత్తుగడలోనే కందముంది. ఒక్క సంజ్ఞా పరిచ్ఛేదంలోనే ఇంకా 2. 7, [illegible], 10, 17, 22 సూత్రాల వృత్తులలో కందపద్యాల ఎత్తుగడలున్నాయి ఈ విధంగా చెప్పుకుంటూ పోతే ఎన్నైనా ఉదాహరణలీయవచ్చు. ఈ విధంగానే ఉదాహరణలలో కూడా మనం ఛందస్సును చూస్తాం. మచ్చుకు ఒండు రెండు.

సమాస పరిచ్ఛేదం 5 వ సూత్రంలో కందం
ఆ చందము—ఈ చందము
ఏ బృందము వాడి మాట పోడి.........
తద్ధిత 4 వ సూత్రంలో కూడ కందమే—
తొత్తఱికము—వెడ్డఱికము
వెజ్జఱికము.

ఇలా వ్రాసుకుంటూపోతే మూలంకంటే వ్యాసమే పెద్దదౌతుంది. దీకాక, వీటిమీద కేంద్రీకరణ చేయడంకూడ అనవసరమే—ఎందుచేతనంటే, మొదట చూపబడిన ఏడు లేక ఎనిమిదింటిలోతప్ప, మిగత వాటిలో ఒక్కదానిలోనూ, యతి ఉంటే ప్రాస సరిపోదు; ప్రాసఉంటే యతి సరిపోదు; రెండూ ఉంటే ఛందోభంగం. వీటితో మనం స్థాపించ గలిగేదేమీ ఉండదు.

ఇక వీటిబట్టి రచయిత ఆంతర్యం తెలుసుకోగల అవకాశం ఉంటుందోలేదో చెప్పలేము. ఇది చాల కష్టతరాంశము. చిన్నయగారికి అతిసన్నిహితులైన ఆచార్యులవారికే ఆయన అంతు దొరకదు; ఆయనపై విశేషకృషి జరిపిన మహాపురుషులకే నిత్యనూతనంగా ఏవో కొన్ని అనుమానాలు ఎప్పుడూ కలుగుతూనే ఉంటాయి. ఇక మనబోంట్లెక్కడ! ఒక్కమాటలో చెప్పాలంటే ఆయన ఆపాదమస్తకం కవిత్వం మూర్తీభవించిన వ్యక్తిఅనీ, వ్యాకరణాదులలో పుంభావసరస్వతి అనిమాత్రం పేర్కొనగలం.

# జీవాతువు

## శ్రీమతి ఆర్. వసుంధర

జూనియర్ కాలేజి ప్రిన్సిపాల్ రామచంద్రయ్యగారు అర్జెంటుగా చూడవలసిన ఆఫీసు కాగితాలు చూడటం పూర్తయింది. సంతకాలు పెట్టిన కాగితాలు తీసుకెళ్ళి స్క్రీనుకు అవతలగా 'ఆఫీసు'లో కూర్చున్నాడు పెద్దగుమాస్తా. ప్యూను జకరయ్య వాకిట్లో నిలుచుని ఎవరితోనో మెల్లగా మాట్లాడుతున్నాడు: శేషయ్య ఎటెండెన్సురిజిష్టరు పట్టుకుని క్లాసుల్లోకెళ్ళాడు. స్వీపరు చెంచురాముడు వరండాలో ఊడుస్తుంటే చీపురు బరబరా శబ్దంచేస్తున్నది. జరుగుతున్న క్లాసుల్లోంచి సన్నగా రణగొణధ్వని వినబడుతున్నది. లెక్చరర్లను వెయ్యనందున సగంక్లాసులు జరగటమేలేదు చదవ్వలసిన పాఠాలు రెట్టింపుచేసి, చెప్పవలసిన లెక్చరర్లను వెయ్యకుండావుంటే మేము ఏమైపోవాలని విద్యార్థులు గోలపెడుతున్నారు. కాలేజికి రాకుండా స్ట్రైక్‌చేస్తామనిఅన్నారుగాని ఇంకా అది ప్రారంభంకాలేదు.

ఈ దినం పోస్టు తక్కువగా ఉన్నది. అందులో టైపిస్టు సెలవులో ఉన్నాడు. ఇహ ఆ ఇంటర్వ్యూలు అయిపోతే తతిమ్మాపని ఏమంతగాలేదు. శివయ్యను వూస్ట్‌చేసినపని తాలూకు ఖాళీ భర్తీచెయ్యడానికి ఇంటర్వ్యూలు పదినిముషాల్లో ప్రారంభం అవుతాయి.

రామచంద్రయ్యగారికి ఒంట్లో సుఖంగాలేదు. కడుపులో తిప్పినట్లుగా ఉన్నది. ఒకటే తలనొప్పి. చాలా చీకాగ్గా కోపంగా ఉన్నారు. 'వెధవకి పొగరు తలకెక్కింది. ఆకాశరామన్నపేరుతో అయితేమాత్రం అన్నిబూతులు తిడతాడా! పని దొరికేవరకూ ఒక ఏడుపు. దొరికినతర్వాత ఇంకో ఏడుపు. తృప్తిఅనేది ఎక్కడుంది?' అనుకున్నారు. డ్రాయరు సొరుగులోంచి భావనఅల్లంపొట్లంతీసి రెండు పలుకులు నోట్లో వేసుకున్నారు. 'పిల్లలుచేస్తున్న చిన్నతప్పులు పట్టించుకోకుండా ఒదిలేస్తున్నందుకు వాడికి కళ్ళు నెత్తిమీదకొచ్చినై. అదేదో సామెత చెప్పినట్లు రౌతు మెత్తనైతే గుర్రం ఏవిటోచేసిందట... అయినా ఈ దేవుడు ఉత్తమతిలేనివాడు. మంచివాడికి కష్టంపెడతాడు. చెడ్డవాడికి జయం ఇస్తాడు. ఏమి న్యాయం! ఈ సమస్తసృష్టికీ తాను బాధ్యుడై ఉండీకూడా ఇహా అస్తవ్యస్తాలను యిలా కొనసాగనిస్తున్నాడంటే మతివుండేవాడైతే అన్నీ ఒకక్రమంలోపెట్టి చక్కగా నిర్వహించుకోడూ?' అనుకున్నారు. ఆయనకు చీకాకు కలిగినప్పుడు యిట్లాగ దేవుణ్ణి కోప్పడ్డం ఒక అలవాటు.

అయినదానికీ కానిదానికీ దేవుణ్ణి తలుచుకోవటం ఆయనతాత రామచంద్రయ్యగారినుండీ వారిమీది గౌరవంకొద్దీ సంక్రమించిన అలవాటు. కాని తాతగారికీ మనవడికీ మాట తీరులో సామ్యమేగాని ఆలోచనల తీరులో పెద్దభేదం ఉన్నది. తాత రామచంద్రయ్యగారికి దేవుడిమీద ఎంత నమ్మకం ఉన్నదో తప్పొప్పులమీదా అంత నమ్మకం ఉన్నది. ఏది మంచో ఏది చెడ్డో ఖచ్చితంగా తెలుసు. త్రికరణ శుద్ధితో 'మంచి'గా ఉంటూ సుఖంగా తృప్తిగా బ్రతికారు. ప్రిన్సిపాలు రామచంద్రయ్యగారు తాతగారిలాగ 'మంచి'గానే ఉంటున్నారు. కాని దేవుణ్ణి గురించిన స్థిరమైన నమ్మకం ఏమీ లేదు. అనుకోవలసి వచ్చినప్పుడు 'కలడు కలండనెడివాడు కలడో లేడో' అనుకుంటారు. 'తప్పు' అన్నా 'ఒప్పు' అన్నా నిర్వచనం తెలియటం లేదు. బాహ్యపరిస్థితులమీద ఆధారపడి నిర్ణయించిన 'మంచి' 'చెడ్డల్లో' నమ్మకం లేదు. అంతా చాలా కలగా పులగం వ్యవహారంగా

ఉన్నది. కాని తనకు కావలసిందేమిటో ఆయనకు తెలుసు. అది జీవితంలో ఆనందం, జీవించడంలో తృప్తి. నిండు మనసు ప్రసాదించే తృప్తి. అదే ఆయనకు ఎక్కడా కనిపించకుండా ఉన్నది.

ఇంతవరకూ ఆయన అన్నీ పట్నవాసాలే చూశారు. మానవ జీవితం ఎన్నో శతాబ్దాలుగా సంతరించుకుంటూ వస్తున్న నాగరకత ఎన్నో అనర్థాలను కూడా తెచ్చిపెట్టిందని ఆయన నమ్మకం. అందులో ముఖ్యమైనది మనిషికి తనవైన 'విలువలు' లేకపోవటం. మనిషి మూకమీద ఆలోచించటం అలవాటు చేసుకొని, అందులో తాను ఎవరో, తనకు కావలసినదేమిటో గుర్తించుకోలేకుండా ఉన్నాడు. జీవితానికి అర్థం గోచరించటం లేదు......

రామచంద్రయ్యగారు మొదట్లో ఈ ఊరికి వచ్చినప్పుడు ఏమేమిటో అనుకున్నారు. పల్లెల్లో కనిపించే పచ్చదనం, వైశాల్యం ఆయనకు ఆనందం కలిగించింది. ప్రకృతిమాత ఒడిలో పెరిగే యీ మనుష్యులు జీవన సౌభాగ్యానికీ జీవిత రహస్యానికీ దగ్గరగా ఉంటారనుకున్నారు...కాని ఇక్కడ మనుష్యులూ ఆయన ఊహించినట్లుగా లేరు. ఇక్కడా తెలివి మీరిపోయి అసంతృప్తితో సతమతమవౌతున్న వాళ్లే కనిపించారు... ఈ ఊరి నీళ్లు ఆయనకు సరిపడలేదు. ఊరికే పైత్యం చేస్తున్నది. ఒకసారి బాగుంటే ఒకసారి బాగుండటం లేదు ... అందులో ఈ శీనయ్య గొడవ ఒకటి......

ఇంటర్వ్యూకి పిలిచిన వాళ్ల లిస్టు చూసుకున్నారు. పదిమంది మెకానిక్కులు...ఒక్క జవాను పనికోసం! కాలేజీ బావి మోటారు చూచుకోడానికీ, గాస్‌రూమ్‌లో సహాయానికీ పనికొస్తాడని 'మోటారు మెకానిజం తెలిసుంటే బాగుంటుంది' అని వ్రాశారు ఎంప్లాయ్‌మెంటు ఎక్స్చేంజికి. ఫలితంగా ఈ పది పేర్లు పంపారు. అందరూ అంతో యింతో మెకానిజం తెలుసుకొని పనిచేసుకుంటున్న వాళ్లే. ఉద్యోగం యిచ్చే స్థిరత్వంకోసం చేస్తున్న పనిని ఒదులుకొని ఈ పనిలోకి రావాలని ఆశిస్తున్నారు...... ఎదెక్కడో జవాను పనికోసం డిగ్రీలు పుచ్చుకున్న వాళ్లుకూడా ఎగబడుతున్నట్లు చదివిన వార్త నిజమే అయ్యుంటుంది. 'సుబ్బన్నా ఆ ఫైలు ఇలా యివ్వు' 'రామయ్యా, ఈ కాగితం వాళ్లకు చూపించిరా' 'కాఫీ పట్టుకురా' 'గంటకొట్టు'—ఈ పనులు చేస్తుండటమే పరమార్థమనీ నూటఇరవై రూపాయిలే మహాప్రసాదమనీ భావిస్తారా వాళ్లు! మనసుకు నచ్చినపనిని నేర్చుకుని, ఇష్టంగా పనిచేసుకుంటూ, కోరుకున్న జీవితం గడపటంఅనేది సామాన్యుడికి లభిస్తుందా? ఈ దేశానికి మోక్షం కలుగుతుందా? అని నిట్టూర్చారు రామచంద్రయ్యగారు.

ఇంటర్వ్యూ ప్రారంభం అయింది. పదిమందిని పిలిస్తే అయిదుగురే వచ్చారుట. పల్లెటూరని కాబోలు! దేవుడిచ్చిన గాలీ, వెలుతురూ, భూమీ, ఆకాశమూ మీదకంటే మనిషి తయారుచేసుకున్న సౌకర్యాలమీదా, నాగరకతమీదా మోజు ప్రజలకు...మొదటి కాండిడేట్ రవణయ్య. ఎక్కడో ట్రాక్టర్ డ్రైవర్‌గా ఉంటున్నాడు. ఎట్లైనా గవర్నమెంటు ఉద్యోగం అంటే గట్టికనుక ఇందులోకి వస్తాడట. ఉదయమే ఇంటిదగ్గర హాజరై ఒక స్థానికరాజకీయనాయకుడి దగ్గర్నుండీ తెచ్చిన రికమెండేషన్‌లెటరు ఇచ్చాడు. అంతటి నాయకుడు తనకు ముఖాముఖీ తెలుసునన్న ఠీవిని చిందిస్తూ నిలుచున్నాడు. వీడి ధీమా వీడూ ఇంకో శీనయ్య అయ్యేట్లున్నాడు! అనుకున్నారు... కాని శీనయ్య మొదట వచ్చినప్పుడు తలకు గుడ్డ చుట్టుకుని చేతులు కట్టుకుని వెర్రిమొహం వేసుకుని చిరిగినపంటుతో వచ్చాడు. ఇరవైయేళ్ల కుర్రాడు.

'అయ్యగార్ని జూత్తే నోట్లో మాటరాదు. నంగిపలుకులు బలుకుతడు. ఎదవకి పొగరుబలిసి ఉండేపని పోంగొట్టుకున్నడుగాని సూత్తుంటే ఆడి కర్మ ఆడే అనుబగిత్తడు. పనిదొరక్క మలమల మాడతడు. ఆడేంజెయ్యకపోతే అయ్యగారు ఎందుకు తీసేత్తారు! బువ్వపెట్టినోళ్లకి దణ్ణంపెట్టాలి... ఆడివాచీ, ఆడి సెప్పులూ, టూడెంటుమాదిరి ఆడి

ఏషికం...ఏందో సేనుంటఁ...ఆటపిచ్చిగాదు. జీతం డబ్బులన్నీ ఆటలో తగలేత్తాఁడు. ఆడిబాబు డబ్బులో అని గోల...ఒచ్చినప్పుడు ఎంతబయంగ ఒచ్చిందు ! ఈడకొచ్చి పేంటు చించుకుని పేరుపిలవంగనే గబాల్న తలగుడ్డ సుట్టేసి ఆమబ్బు లోపలికి బోయిండు... జమానంటే ఇట్టుండాలి అనిపించిరదు'—వాకిట్లో వుండే ఆఫీసు ప్యూను జకరయ్యతో స్వీపరు చెంచు రాముడు చెప్పుకొస్తున్నాడు నిన్నటిరోజు మధ్యాహ్నం.

జకరయ్య నోట్లో నాలుక లేనట్లుంటాడు గనుకనూ, తనకన్నా ఆలస్యంగా పనిలో జేరాడు గనుకనూ తన స్వగతాలన్నీ జకరయ్యదగ్గరే చెప్పు కుంటాడు చెంచురాముడు, తీరికున్నప్పుడు. వాడి పద్దెనిమిదేళ్ల గొంతు ఖంగుమని పలుకుతుంది. ఒర్థింపునీ అజ్ఞానీ ఏడుపునీ నవ్వునీ అన్నింటినీ ఒకే విధంగా ధీమాతో ధైర్యంతో స్థైర్యంతో వెలువ రించే గొంతు అది. బాల్యంనుంచీ పురుషత్వంలోనికి ఒరుగుతున్నది. ఏరు పారుతున్నట్లు గలగలా పరుగు లెత్తుతూ వుంటుంది వాడి వాక్ప్రవాహం. రోజూ ఏదో ఒక సమయంలో బయటినుంచీ వినిపించే వాడి ఉపన్యాసాలు వినటం రామచంద్రయ్యగారికి అలవాటై పోయింది. నీకు ఏడవటంకూడా నవ్వుతూనే ఏడుస్తా డేమో! అనుకుని నవ్వుకుంటుంటారు.

శీనయ్యను పనిలోనుంచీ తీసేసిన మూడు రోజులకు ఆశతో మెరిసే కళ్లతో, భయం భయంగా నవ్వుతూ, నవ్వటానికి ప్రయత్నిస్తూ ఆఫీసులోని కొచ్చాడు చెంచురాముడు. తనకు ప్రమోషన్ కావా లట. శీనయ్య పని తన కిప్పియ్యాలట. కాళ్లు పట్టుకుంటాడట. ఏ పని జెప్పినా బయంగా జాగ్ర త్తగా జేసుకుంటాడట. 'ఎంప్లాయ్‌మెంటు ఆఫీసు నుంచీ నీ పేరొస్తేగాని నేనేమీ చెయ్యలేను. ఒస్తే చూద్దాంలే' అన్నారు అప్పుడు. 'ఒచ్చేవోళ్ళు... తమ దయ' అని దణ్ణంపెట్టి వెళ్లాడు. వాడిపేరు లిస్టులో రాలేదు...

కిటికీలోంచి కనబడుతుంది 'కాలేజీ తోట'. తోటమాలిని పెట్టడానికి గవర్నమెంటు వారికి డబ్బు చాలదు కనుక చెంచురాముడే తోటపనీ చూసు కోవాలి. బాటనీ లెక్చరరు అవసరం అని తెచ్చిపెట్టిన మొక్కల్ని ఖూనీ చెయ్యడం, తనకు మంచివని తోచిన నాలుగు మొక్కలకు నీళ్లు పెట్టడం తోట మాలిగా చెంచురాముడు నిర్వర్తిస్తున్న బాధ్యతలు. బాటనీ డిపార్టుమెంటునుంచీ వాడిమీద వారానికో ఫిర్యాదు వస్తుంది.. ఊరికే అనవసరంగా తనను బాధపెట్టడానికే బాటనోళ్లు పిచ్చి మొక్కలన్నీ తెచ్చిపెడుతున్నారని చెంచురాముడు జకరయ్యతో అంటుంటాడు...తోటనడిమధ్యన ఒక బాదంచెట్టు కొమ్మలు బారలు చాచుకుంటూ పైకెగిరి పోతు న్నది. ఒక మూలన నాలుగు బొప్పాయి మొక్కలు స్తంభాల్లా పైకి లేచాయి. వనమహోత్సవంనాటి వేపమొక్కా గులాబీ మొక్కలు రెండూ బ్రతికి బట్ట గట్టాలో ఒద్దో ఇంకా నిశ్చయించుకోలేదు. మూడు లిల్లీ మొక్కలు సగం ఎండి నేలకొరిగి కునికిపాట్లు పడుతున్నాయి. తొట్లలో పెట్టిన అరడజను క్రోటను మొక్కలూ, ఒక ముద్దమందార, ఒక వరుసలో పది మెట్టతామరలూ—అదీ కాలేజితోట. పనిలేనప్పు డంతా రామచంద్రయ్యగారి కళ్లు తోటవేపు తిరిగి పోతుంటాయి. ఆ పచ్చదనంతో ఆయనకేదో తాదా త్మ్యం...ఇవ్వాళ కిటికీలోంచీ చూసిన ఆయన కళ్లకు పాదులనిండా దట్టంగా పెరిగిపోయిన కలుపుమొక్కలు కనిపించాయి. 'అరె, కలుపుతియ్యడం లేదే...చెంచు రాముడితో చెప్పాలి. అసలు మొక్కలకంటె కలుపు మొక్కలు జోరుగా ఉన్నాయి......అన్నిటికీ ఒకే భూమి, ఒకే నీరు, ఒకే గాలి, ఒకే ఆకాశం! ప్చ్...' అనుకున్నారు.

క్రితంరోజు ఉదయం యీ ఉద్యోగకోసమే యీ ఊరివాడే వెంకయ్య అనే మనిషి ఒచ్చాడు. అతనికి ఇంటర్వ్యూ కార్డు రాలేదట. కాని అయ్యా గారు మంచి వాళ్ళనీ, మనుషుల కష్టం సుఖం గమనిస్తారనీ వినీ తన సంగతి చెప్పు కుందామని ఒచ్చాడట. 'బాబూ, నాకు పెళ్ళాం, ముగ్గురు బిడ్డలూ, ముసలితల్లీ వున్నారు.

ఒక్కడి కష్టంమీద బతకలేకుండా వున్నాం. రెండేళ్ల కింద రిజిష్టరు జేయించుకున్నాను యంప్లాయ్ మెంటు ఆఫీసులో...ఏమని చెప్పుకునేది, బాబూ. ఈ నడిమధ్యెల్లో ఒకతడవ ఇంటర్వ్యూ కొస్తేగూడ యీడ పనిలో వున్న శేషయ్య నా నోట దుమ్ము కొట్టాడు బాబూ...ఇంటర్వ్యూకార్డు రాకుండా జేశాడు' అని చెప్పుకున్నాడు. రామచంద్రయ్యగారికి ఆశ్చర్యం కలిగింది. ఈ మనిషి తెలిసి తెలియని అభియోగాలు చేస్తున్నాడు అనుకున్నారు. శేషయ్య అనే జవాను కాలేజిలో ఉండే మాట నిజమే కాని ఇంటర్వ్యూకార్డుకీ శేషయ్యకీ ఏమీ సంబంధంలేదు. 'మీకు కార్డులు ఆఫీసువాళ్లు పోస్టులో పంపిస్తారు శేషయ్యకేమీ సంబంధంలేదు. ఊరికే లేనిపోనిమాటలు చెప్పవద్దు' అని మందలించారు. వెంకయ్యకు ఆవేశంతో మొహం ఎర్రబడ్డది. చేత్తో మొహం తుడుచుకున్నాడు. 'బాబూ, ఆ శేషయ్య సంగతి మీకు బాగా తెలవదు ఒట్టి.. వాడి అన్న పొష్టు జమానుగా వున్నాడు. మాకూ వాళ్లకీ గోడతగాదా, అన్నదమ్ముళ్లిద్దరూ కూడబలుక్కొని యీ పని జేశారు...' ఇంతదాకా చెప్పేనాక వెంకయ్యకళ్లల్లో అర్థంపుపోయి ఒక తెలివి మెరిసింది. 'ఈ చుట్టు పక్కల్లో యే ఆఫీసులో కన్నా ఉద్యోగం కాళీపడగానే వాడి అన్న అందరిదగ్గరా తలో యాభై రూపాయిలు పుచ్చుకుని తీసుకెళ్లి యంప్లాయ్‌మెంటు ఆఫీసులో యిచ్చి వాళ్ల పేరు లిస్టులో ఏపిస్తాడు. మాబోటోళ్లకు దిక్కులేకుండా వుంది, బాబూ...అంతే గాకుండా సెలవల్లో బ్రిడ్జికాడ కూర్చొని 'ఆఫీసులో అయ్యగారు నే నెట్టజెప్తే అట్టజేస్తాడు. ఈ ఎంకడికి పనిరానియ్యను ఒస్తే నా ఉత్స నే దాగుతా' అని పెతిజ్ఞగూడ జేశాడు బాబూ' అన్నాడు. శేషయ్య సంగతి వాళ్లపై ఆఫీసరుకు బాగా చెప్పేశానన్న విజయగర్వం వెంకయ్యలో పొంగి యింకొంచెం నిటారుగా నిలుచున్నాడు ఇప్పుడే మంటారన్నట్లు చూశాం. 'లిస్టులో పేరురానిది నేనేమీ చెయ్యలేను' అని వెంకయ్యను పంపించేశారు.

'శేషయ్యని జూసి బయపడత రెండయ్యా. య్యేంది, అయిదు నిమిషాలు ఆలీసెంగొత్తే అయ్యగారు తలదీస్తారా, ఏందీ అని...విన్నావా ఆ శీనయ్య యిద్దరి కిద్దరూ ఆయనకి రోజూ కాఫీలూ టిపిన్లూ బలేగ మేపుతుండరు. ఇంకా కుంటోడికో గుడ్డోడికో బిచ్చగాడికో యీగాదా...నన్నుమాత్తరం బతక నిత్తన్నాడా ఆయన. వూరికూరికెనే నామింద పెత్తనం జేత్తడు. నిన్న కంటింజెన్సోడివి. అయ్యగారు యిళ్యాల బొమ్మంటే బోవాల్సిందె' అంటడు. ఆయన కేవా!...అయ్యగారికి నీమింద జెపత, నీమింద జెపత అని ఆయన గెదిరిచ్చినా,- మీరు మేపనూ...' చెంచురాముడు జకరయ్యని మందలించడం వినబడించి ఒక రోజున.

శీనయ్య జకరయ్యలదగ్గర ఈ మర్యాదలన్నీ జరిపించుకుంటూనే; ప్రిన్సిపాలుగారిదగ్గరకొచ్చి 'వాళ్ల మీద కావలసినప్పుడు ఏదన్నా రిపోర్టు రాసిమ్మంటే కాగితంమీద రాసిస్తా'నని మనవిజేసుకున్నాడు శేషయ్య. 'నేటి రాజకీయాల్లో ప్రవేశిస్తే బాగా రాణించి ఉండేవాడు' అనుకున్నారు రామచంద్రయ్యగారు.

మొదట ఆకాశరామన్న ఉత్తరం చూడగానే ఇట్లాంటిపనిచేసేవాడు శేషయ్యే అనుకున్నారు. వ్రాత పరిచితమైనదిగా తోచింది. నెమ్మదిగా జ్ఞాపకం తెచ్చుకున్నమీదట అది శీనయ్య వ్రాతగా పోల్చుకున్నారు. నాలుగునెల్లక్రితం సెలవల్లో శీనయ్య వ్రాసిన ఉత్తరం బయటికితీశారు.

'మహారాజరాజశ్రీ అయ్యగారి దివ్యసముఖమునకు శీనయ్య అనేకనమస్కారములు. మీరు నాకు దయతో ఉద్యోగం యిచ్చియున్నారు. చాలా విషయాల్లో మీరే తండ్రి దైవమూగా ఆదరించియున్నారు. ఇప్పుడు నేను పెళ్లిచేసుకోబోతున్నాను. మీరు దయతో ఆశీర్వదించగోర్తాను. సెలవు అయిపోగానే తమవద్ద హాజరు పడగలను.

ఇట్లు
విధేయుడు
శీనయ్య'

ఏమాత్రం సందేహంలేకుండా సరిగ్గా యిదే వ్రాతలో వచ్చింది ఆకాశరామన్న ఉత్తరం. అది

తలపుకురాగానే రామచంద్రయ్యగారికి చీకాకు కలిగింది. తలనొప్పి వచ్చింది. మరికొంచెం భావనల్లం నోట్లో వేసుకున్నారు. నొసలు చిట్లించి 'ఈసారి యిలాంటివాడికి ఉద్యోగం యివ్వకూడదు ఒకడిని చూసి ఇంకోడు చెడతాడు. డిసిప్లిన్ పోతుంది' అనుకున్నారు.

నాలుగో కాండిడేటు వచ్చాడు. ఈ పని తనకు యివ్వకుంటే ఆత్మహత్య చేసుకోవాల్సిందే, వేరు దిక్కులేదుఅంటూ తన కష్టాలన్నీ ఏకరువు పెట్టుకున్నాడు మనిషి కష్టంలో ఉన్నట్లే కనిపిస్తున్నాడు. కాని కన్పించే తీరూ, చెప్పేమాటలూ, ఆఖరికి వాళ్ల కష్టమూకూడా చూచి ఉద్యోగం యివ్వటానికి వీల్లేదు. బుద్ధి వక్రంగాఉండే శీనయ్య ఎంత వినయవంతుడుగా కనిపించాడు! వాడికీ వేరు ఆధారం లేదు. తల్లినీ తండ్రిని పోషించాలి. రెండేళ్లలో నాలుగు టెంపరరీ ఉద్యోగాలు మారాననీ, ఎక్కడైనా యిక్కడ నిలకడగా ఉండే ఉద్యోగం యిమ్మనీ ప్రాధేయపడ్డాడు...జకరయ్య ఇంటర్వ్యూకి వచ్చినప్పుడు దీనంగా, అర్ధప్రాణంతో, ఫర్లాంగుదూరానికి చెమట కంపుకొడుతూ, మాసినబట్టల్తో వచ్చాడు. ఏదో మొక్కుబడి తీర్చుకుంటున్నట్లు వచ్చాడు గాని మనిషిలో ఆశ, చలనం అన్నవి కన్పించలేదు మనిషి అన్నవాడు అంత నిర్జీవంగా నిస్పృహతో ఉండటం రామచంద్రయ్యగారికి చాలా కోపం తెప్పించింది. డబ్బు లేకపోవచ్చుగాని ఉండే బట్టలు ఊరి బయటి చెరువులో ఉతుక్కోడానికి అడ్డమేమిటి?' అని ఉరిమారు. రోగిష్టి పెళ్లాన్నీ ముసలి తల్లినీ తన ఒక్కడి కూలికష్టంమీద పోషించలేక ఎంత శ్రమపడ్డా కడుపునిండక అర్ధాకలితో వస్తులుంటూ విసుగుబుట్టి రెండుసార్లు ఆత్మహత్యా ప్రయత్నం చేశాట్ట యింతకుముందు. ఈ విషయం వాళ్ల ఊరి మేష్టారు చెప్పారు తరువాత ఉద్యోగంలో స్థిరపడ్డానన్న నమ్మకం ఏర్పడ్డాక యీ సంవత్సరంలో రెట్టింపు లావెక్కాడు జకరయ్య.

అందరికీ అంత అవసరం అనిపిస్తున్న ఉద్యోగాన్ని నిర్లక్ష్యంగా పోగొట్టుకున్నాడు శీనయ్య. ఒక రోజున గాభరాగా వచ్చి 'మా వూళ్లో మా అన్నకి ఒంట్లో బాగాలేదు. ఆస్పత్రిలో జేర్చాలి. రెండు రోజులు సెలవు కావాలి' అన్నాడు ఏడుపు మొహంతో. 'నీకు సొంత అన్నా?' శీనయ్యకు అన్నలు లేరు. 'కాదుసార్...మా చిన్నమ్మ కొడుకు వాళ్లకు ఏమీ తెలీదుసార్. నేనుపోయి చెయ్యాల. వారం రోజులనుంచీ నూట ఆరు జెరం' అన్నాడు. మాటలు కష్టంగా చాల ప్రయత్నంమీద పెగిలి వస్తున్నాయి...శీనయ్య ఆయనతో ఎప్పుడు మాట్లాడినా అంతే. చాలా భయస్తుడు. శీనయ్యకు ఎప్పుడు సెలవు కావాలన్నా వాడికో వాళ్లవాళ్లకో నూట ఆరు డిగ్రీల జ్వరం వచ్చి వుంటుంది. మొదటిసారి ఆ జ్వరం విషయం విన్నప్పుడు 'డాక్టరుకు చూపించావా? ఏం జ్వరం?' అనడిగారు రామచంద్రయ్యగారు. డాక్టర్ను చూసి చూసి కనుక్కోలేకుండా పోతున్న ఆ జ్వరం సంగతి రెండు సార్లు విన్నాక యిహ అడగటం మానేశారు... 'ప్రక్క ఊరేకదా మీది. ఒక్కరోజు సెలవు తీసుకుని ఆస్పత్రిలో చేర్చిరా' అన్నారు. తరువాత రెండు రోజులకు వచ్చింది ఆకాశరామన్న ఉత్తరం. చూడగానే నక్సలైట్ ఉత్తరం కాబోలనుకున్నారు. ఇన్నాళ్లూ పెద్దభూస్వాములీ, వడ్డీ వ్యాపారస్థులీ రూపుమాపాలని వేసుకున్న పథకం మార్చుకుని గవర్నమెంటు ఉద్యోగస్తుల్ని నశింప చెయ్యాలన్న ప్రణాళిక రూపొందించుకున్నారా వాళ్లు? అన్న అనుమానంకూడా వచ్చింది.

'ఏమిరా ప్రిన్సిపాల్,

నీకు పొయ్యేకాలం దాపరించింది. జవాన్లకు సెలవ లివ్వకుండా ఏడ్పిస్తున్నావా దొంగ ముండా కొడకా. నీకు యింటిముందూ కాలేజీలో నీ గది దగ్గరా జవాను కూర్చోని వుండటం ముఖ్యమైందా? నీ పెళ్లాం దొంగముండ. దానికి బజారునుంచీ కూరగాయలు తెచ్చియ్యాలా! నీ పాపం పండుతావుంది. వారం రోజులు టైమిస్తున్నాం. జవాన్ల డ్యూటీలు తీసేసి వాళ్లడిగిన సెలవలిస్తూ గౌరవంగా చూడకపోతే నీ అంతం చూస్తాం. మీ

అందరి ప్రాణాలు తీస్తాం. పేపర్లలో నీ మీద బూతులు రాయిస్తాం. జాగ్రత్త.

లేబరు కమిటీ'

ఊస్టింగ్ ఆర్డరు చేతబట్టుకుని పోతున్న శీనయ్యను వరండాలో పలకరించాడు చెంచురాముడు ఉత్సాహంగా. 'ఏవయ్యా శీనయ్య, అయ్యగార్ని రెండ్రోజులు సెలవడిగి శనాదివారాలు గలుపుకొని నాల్రోజులు అత్తారింటికి పొయ్యొస్త నంటివి. ఎల్లొచ్చావా' అంటూ.

ఇంటర్వ్యూలు అయిపోయాయి. అయిదుగురు అభ్యర్థులూ అయిదు రకాలుగా ఉద్యోగా న్నర్థించారు. ఆ ఉద్యోగం వాళ్ల కుటుంబాలకు మూడు పూటలూ తిండిపెట్టే వరం. అందరి మొహాల్లోనూ ఆశ, సందేహం. నిస్పృహ—అన్నీ. కలిసిన ఏదోభావం...ఉద్యోగం దొరికేవరకూ దైన్యం. దొరగ్గానే ఉత్సాహం పుంజుకుని వాళ్ల వ్యక్తిత్వం ప్రకాశించటం ప్రారంభిస్తుంది. బాగుంది! అనుకున్నారు.

ఇప్పుడు శీనయ్య ఈ పని చేశాక ఎవర్ని చూసినా వీడు ఎలాంటివాడో? అనిపిస్తున్నది. ఒక మనిషికి రంగుటద్దాల్లోంచి తప్ప ప్రపంచాన్ని చూడటానికి వీలుకాదేమిటి? ఆకలి, దప్పి, నిద్రావలెనే ధైర్యం, నిస్పృహ, బ్రతకటంలో తృప్తి, అసంతృప్తి అనే వాటిని అర్థం చేసుకోవచ్చును. కాని అసూయ, కుత్సితం, నిర్లక్ష్యం అనేవి అర్థం కావటంలేదు.

ఆలోచనా రహితంగా కిటికీ బయటకు చూస్తూ ఉండిపోయారు రామచంద్రయ్యగారు... ఏకాగ్రతతో చూస్తున్న ఆయన కళ్లముందు నేల తేజోమయమైనది. మట్టి ప్రాణాన్ని సంతరించుకొని చైతన్య పూర్ణమై వివిధాల లాస్యం చెయ్య నారంభించింది...

ప్రతి మట్టికణమూ ఒక మహా చైతన్యం. అంతా కలిసి ఒకే చైతన్యం, ఒకే ప్రాణం, ఒకే తేజస్సు!

ఆ తేజస్సులో నుండేనే ఆవిర్భవిస్తున్నాయి వివిధాలైన రూపాలూ వింత ప్రాణులూనూ...

ఆ తేజో విలాసమే బారలు చాచుకున్న ప్రాణం వెల్లివిరుస్తున్న బాదంచెట్టు. దాని మరోరూపమే కునుకుతున్న లిల్లీమొక్క. అదే ముద్దమందారం. అదే కలుపుమొక్కలు.. అన్నను, కలుపుమొక్కలు!

అన్నీ, అన్నీ, అదే!

ఆ వింతదర్శనం రామచంద్రయ్యగారి మనస్సుకు ప్రశాంతతనీ ఆహ్లాదాన్నీ కలిగించింది. భావనల్లాం పనిచేసింది కాబోలు, నొప్పులన్నీ తగ్గిపోయి ప్రాణం సుఖంగా ఉన్నది. 'కాని...జీవితానికి బలాన్నిచ్చేవి ఆహ్లాదాన్ని కలిగించేవి కొన్ని ఆ జీవిత పరమార్థాన్ని మరుగుపరచి సత్యాన్ని కుంటుపరచి నిరసపరచేవి కొన్ని' అనుకున్నారు నవ్వుకుంటూ.

'లిస్టులో నా పేరు రాలేదనుకో. అయినా యిచ్చేవోళ్ల యిష్టంగెందా. పోయిన తడవ యూసీపరు పని వొచ్చినపుడు దేశయ్య గారికాడ రికమెండేసను జేయించిన...ఆ కాసింత సాయం ఒయ్యటానికి ఆ దేశెయ్యగారింటో రెండేళ్ల మట్టి మాయమ్మ సిల్లర మల్లర పనులన్నీ జేసిపెడతా వుంది. అదిగో అప్పటాల్లో యిప్పిత్త యిదిగో ఆపీసులో యిప్పిత్త అంటానే జరుపుకొచ్చినడు. ఆకరికి యీ కాలేజిలో యిప్పించిండు...ఈ తడవ ఆ సిన్నోళ్ల దగ్గిరికెందుకో, ఏకంగా పెద్దోళ్ల కాళ్లే అట్టుకుందావని అయ్యగారినే అడిగినా...ఇడదిమట్టి వూడవటం, తోటపని, హోటలునుంచి కాపీలు తెచ్చియ్యటం, ఏం పని జెప్పిన కాదనకుండ జేత్తన్నానా. అయ్యగారికి మాత్తరం తెలవదా...ఏం జేత్తారో...' చెంచురాముడు జకరయ్యకు చెప్పుకుంటున్నాడు.

రామచంద్రయ్యగారికి నవ్వొచ్చింది. ఇదివరలో వాడికి ఉద్యోగం రావటంలో దశరథరామయ్యగారి జోక్యం ఏమీ లేదు. లిస్టులో వాడి పేరు ఒచ్చింది. ఒచ్చిన వాళ్లలో చూచి తానే యిచ్చారు పని...

కాలింగ్‌బెల్ వినగానే చెంచురాముడి వాక్ప్రవాహం ఆగిపోయింది. ఇంటర్వ్యూకి ఒచ్చిన వాళ్లల్లో ఒకరికి ఉద్యోగం యిస్తున్నట్లు ఆర్డరు టైపు చేయించటానికి ఆఫీసుకు తీసుకెళ్లాడు చెంచురాముడు ఉత్సాహంగా......

వెళ్తున్న చెంచురాముణ్ణి చూస్తూ 'ఆ కాగితంలో ఏముందో తెలిసినా వీడు యిట్లాగే ఉత్సాహంగానే తీసుకెళ్తాడు' అనుకున్నారు అలా అనుకుంటే ఆయనకు చాల సంతోషం కలిగింది.

జీవితాన్ని గూర్చిన సత్యం, అనేక యుగాంచీ మానవ జాతిని నశించిపోకుండా నడిపించుకువస్తున్న జీవనధర్మం ఏదో వాడిలోనుంచి తొంగి చూస్తున్నట్లనిపించింది.

చెంచురాముడు జకరయ్య కిచ్చిన ఉపన్యాసంలోని మరో భాగం గుర్తు కొచ్చింది...'పండక్కి ఏం అప్పచ్చులు తిన్నావ'ని అడిగిన జకరయ్యతో '...పండగేందయ్యా.. రోజూ రెండు పూటల బువ్వతినటం పండగగాదా...అంతకంటె మనకి పండగేంది...బతకటమే పండగ అనేవాడు మా బాబు...' ఎందుకో ఆ మాటలూ, అవి పలికిన వాడి నవ్వే గొంతూ రామచంద్రయ్యగారి మనసులో నాటుకుపొయ్యాయి....

---



## కలగూరగంప:

# ఔచిత్య విచారము

శ్రీమద్రామాయణమును — ప్రథమతః ఆంధ్రీకరించిన కీర్తి — రంగనాథ రామాయణ కర్తకు దక్కినది అతని తర్వాత — భాస్కరుడు మొదలుకొని 'ఆచార్యపుట్టపర్తి' వరకు ఎందరెందరో మహాకవు లాంధ్రీకరించిరి. ఇంకను చేయుచున్నారు; చేయుచుండగలరు — ఆ మహాకావ్యము యొక్క గొప్పతన మట్టిది. అది జగద్విదితమైన విషయము.

సారస్వతరంగమున ద్విపదకావ్యములకు - ఒక యుగమున నంతగౌరవములేదు. తరువాత యుగయుగములలో వస్తుగౌరవమునుబట్టి — కొన్ని కావ్యములకు — గుడ్డిలో మెల్లగ కొంతిగౌరవము లేకనూ పోలేదు ఆ వాఙ్మయశాఖలో — రంగనాథ రామాయణము — వన్నెగి జముల్లంత — యెక్కువని — ఆంధ్రకవి ప్రణీత కృతిసారసుధారస సంపన్మాధురీ విశేషంబుల చవిచూచినవారల కెల్లరకు — సువిదితము... పైపెచ్చు దీనిని పలువురు లక్షణకర్తలును ప్రామాణికముగ స్వీకరించిరి.

ఈ మహాకవి యీ కావ్యము ననువదించుచు — కొన్నిపట్టులను స్వతంత్రముగ కల్పించికొని మూలమునకు — పెరుగులు — తరుగులు — కూర్పులో ననేక మార్పులు చేసినాడు. ఈ మార్పులకు కొందరాలంకారికులు ఆహా యనిరి. కొందరు ఓహోహో యనిరి. కొందరు మూతిముడిచిరి. మరికొందరు పెదవి విఱిచిరి. కాని దినమంతయు మంచిదన్న సామెతగ — మూలమునకు కొన్నిపట్టుల విరుద్ధముగనుండి — ఔచిత్యము కాస్త జరిగిపోయినదేమోనని — అస్మాదృశులకు తోచుచున్నది. కవి - లోకమున స్వతంత్రభావ ప్రభావితుడయ్యును — పూర్వకథకు విరోధము లేకను — ఔచిత్యము చెడకను — తనకార్యము సాధించికోవలయునన్నది సర్వులెరిగిన విషయముకదా! ఆ విషయమును — ఈ కవీంద్రుడు — విస్మరించి తన కలమును కదిపినట్లున్నాడు.

రామాయణమున — ప్రతిచిన్న పాత్రయు నొక వైశిష్ట్యమును చాటుచున్నదన్న విషయము లోక మెఱుంగును. కవి లోక మెఱుంగును — విమర్శక లోక మెఱుంగును. (వలయు వారలు శ్రీ గుదిమెళ్ళ రామానుజాచార్యులవారి — మాండవి శబరి మున్నగు కావ్యములు పరిశీలింప ప్రార్థన.) జ్యేష్ఠునందును శ్రేష్ఠగుణములు — లక్ష్మణునియందు — అశేష శేషగుణ సంపన్నత — భరతుని భక్తి భరితునిగ - శత్రుఘ్నుని నిత్య శత్రుఘ్నునిగ — ఆయా సందర్భ సమయములనుసరించి సుమధుర భావకవితా వైశిష్ట్యముతో వాల్మీకి మహర్షి దిద్దితీర్చినాడు. అట్టి యుత్తమ గుణముల కుప్పయగు - భరతునిచేత — నీ రామాయణకర్త — మాతృదూషణము చేయించి — పాఠక లోకమునకు — సంతోషమునకు బదులు — సంతాపము కలిగించినాడు. ఇది యెంతవర కసమంజసముకాదో పాఠక విమర్శలోకము పరిశీలింప ప్రార్థన.

రాముడు పితాజ్ఞాపరిపాలకుడై — సీతాలక్ష్మణయుక్తుడై — వనభూముల వసింపతరలెను. వర ప్రయోజనము సార్థకపరచెను. ఈ వార్తతో — దశరథ ధరణీశ్వరుడు — పంచత్వమొందెను. అయోధ్యానగరమంతయు — దుఃఖసాగరమున మునిగిపోయెను. ఈ వార్త యటకు తెలియనీయక — సుమంత్రుడు.

'యా వశిష్ఠుడు కార్య — మక్కడ కలిగి
దేవమిమ్మట తోడి తెమ్మన్నవాడు
విచ్చేయు డనపుడు - పెసరుత చేష్ట
అచ్చుగా గనుగొని యతిభీతి నొంది
తన మామకడకేగి తత్ప్రకారంబు

దెల్పి'........రథారూఢుండగుచు, మాతులకులమునుండి — యతులితచింత వేడవనాడు — భరతుడు వచ్చినాడు. రథము దిగి శూన్యమైన యంతఃపురమున కరిగినాడు. అప్పటికే ఇనుపగజ్జెల తల్లి యింట పీఠము పెట్టినది. తన కుమారు రాక — విన్న కన్న కైకేయి సరభసగమనయగుచువచ్చి —

'తొల్లి మీ తండ్రి నాకరమర్థిపలయుచీరగ రెండు వరము లిచ్చుటయు ఒకటి—భరతు నుర్వినేలింప నొకటి రఘురాము ననుప వనదుర్గములకు, ననివేడితి ననియు, అంత జనకజాసహితుడై—మునుల యను వున—రఘుచంద్రుడు డడవికిపోయెను; తనయుని నెడ బాపి ధరణీశు డీల్గెనని—చావుకబురు చల్లగచెప్పి—సంబరపడినది. అంత భరతుడు—పురావృత్త మాద్యం తమును విన్నవాడై—వెతనొంది—పనవిపనవి యేడ్చి—

'ఘనరోష దృష్టియై కైకేయిం జూచి
ఘనపాపరతిచేసి కడగి మీ తల్లి
నిను నొక్క రక్కసునికి గనం నోవు
కావి కేకయరాజు గన్నకూతురవు

గానేర వేమందు కైక, అని రాళ్ళు పగులునట్లు తిట్టినాడు. నిర్మలధర్మజ్ఞులైన—రాఘవుల వంశమున జనించిన—భరతునివంటి భ్రాతృభక్తిభరితునినోట నిట్టి పరుషములు పలికించి ఔచిత్య మెంతవరకు పోషించినాడన్నదే నా ప్రశ్న?

ఈ కవి మూలకారుని—తద్వ్యాఖ్యాతల నెంత వరకు ననుసరించెనో పరిశీలించుదుము.

సత్వ మశ్వపతేః కన్యా ధర్మరాజస్య ధీమతః
రాక్షసీ తత్ర జాతాసి కులప్రధ్వంసినీ పితుః॥
అయో—స 14—శ్లో 11.

దీనికి—తిలక మహాశయుని టీకః—

సత్వమశ్వపతేః కన్యా తత్కులోచితకన్యా నభవసీత్యర్థః। పితురిత్యస్య మమేతి శేషః యద్వా స్వపితుః కులస్య—ప్రధ్వంసినీ దుశ్చరిత్ర వ్యవ స్థాపికా ఇతి.

ఇక గోవిందరాజాచార్యులువారు—సత్వమశ్వపతేః కన్యా తత్కులోచితకన్యా నభవసీత్యర్థః ధర్మ రాజస్య—ధర్మప్రధాన రాజస్య—తత్రకేకయరాజే ఉక్త్యర్థే హేతుమాహాయ దీత్యాదినా అని పూర్వ వ్యాఖ్యాతలు.

ఆంధ్రానువాదకులలో కొందరు ముఖ్యులు: గోపీనాధము—వేంకటకవి.

........ నిరయగామినివగు—ధర్మాత్ముండగు—నశ్వపతి వంశవినాశార్థంబు బుట్టిన రాక్షసివిగాని—యమ్మహాత్మునకు—ప్రతీకవుకావు — ఇక ఆంధ్ర వాల్మీకి.

'అతులిత ధర్మశీలుడగు
నశ్వపతి ప్రభుపుత్రి వీవుగా
వతని కులంబు గూల్ప నుద
యంబయినట్టి పిశాచి వేలనన్
సతత సుధర్మనిష్ఠుడగు
సత్యపరాక్రము రాము గాన ద్రో
చితివి - దివంబు చేర్చితివి
శీఘ్రము తద్వ్యథ నాదు తండ్రినిన్॥

నిజమిట్లుండ— నీ మహాకవి రంగనాధుడు స్వతంత్రించి—ఉత్తమ సత్కావ్య రచన చేయుచు—ధర్మమును విస్మరించి—పాత్రౌచిత్యమును మరచి—రయనౌచిత్యమునకు—ఒడిగట్టు టెంతవరకు-సమంజసమో—నిర్ణయించి — పండితార్థమును—తెలియం జేయుగలందులకు పండితులను సాహిత్య భూషణులను వినయాంజలితో అర్థించుచున్నాండను.

శ్రీ కొమాండూరి రామానుజాచార్యులు

## "ఆక"—అసలు రూపం

అనంతర్యార్థకమైన 'ఆక' అనేదాన్ని గూర్చి డిసెంబరు 1970 భారతిలో న్యూపరి శ్రీ గారు సుదీర్ఘంగా ఆలోచించి, 'ఇది పదమో ప్రత్యయమో ఇదమిత్థంగా చెప్పడం వీలుకాదు - దాని పుట్టుక మట్టుకు గుట్టుగానే ఉండిపోయింది' అని తేల్చివేశారు. చాలాదూరం పరుగెత్తి వచ్చేశాక పరుగు ప్రారంభించిన స్థలం వెనుదిరిగి చూసినా కనబడ నట్లే వ్యవహారంలో బాగా నలిగిపోయి, తమ రూపా లని కోల్పోయి, గుర్తుపట్టరానంతగా మారిన మాటల పూర్వరూపాలు ఒక పట్టాన ఊహకందవు.

వ్యవహారంలో ఉన్న ఏ భాషైనా పరిణామ శీలమైనది. ఈ పరిణామం కాలాన్నిబట్టీ, ప్రాంతాన్ని బట్టీ, ఉచ్చరించేవాళ్ల అభిరుచినిబట్టీ ఉంటుంది.

'ప్రశ్న' అనే మాటని 'ప్రిశ్న' అని ఉచ్చరించే వాళ్ళున్నారు. 'ప్రభువు'ను 'ప్రెభువు' అనే వాళ్ళున్నారు. 'గంట'ను 'గెంట' అనే వాళ్ళున్నారు. శాసన యుగంలోని భాష కావ్య యుగంలో లేదు. కావ్య యుగంలోని భాష ఆధునిక యుగంలో లేదు. ఆంగ్లంలో ఛాసర్ కాలానికీ షేక్స్పియర్ కాలానికీ ఎంతో భేదం వచ్చింది.

'వ్యవహారం' అనేమాటకి కేవలం నిత్యమూ వాడుకలో ఉండేది అనే అర్థం చెప్పుకోనక్కరలేదు. గ్రాంథికం కూడా ఒక రకమైన వ్యావహారికమే. దాన్ని లాక్షణిక వ్యావహారికం అనవచ్చు. అలాగే శిష్ట వ్యావహారికం, గ్రామ వ్యావహారికం, ప్రాంతీయ వ్యావహారికం—ఇలా రక రకాలుగా ఉన్న జీవద్భాష, ఉచ్చారణ సౌలభ్యంకోసం, ఊనిక కోసం, . అర్థ సౌకర్యం కోసం, సంక్షిప్తతకోసం, కొన్ని సందర్భాల్లో ఛందస్సుకోసమూ, సౌందర్య సంపాదనార్థమూ, పదాలూ, పదభాగాలూ, వాక్యాలూ, వాక్యభాగాలూ, వర్ణాగమ, వర్ణలోప, వర్ణ వ్యత్యయాది వివిధములైన మార్పులకు లోనవుతూ వుంటాయి. ఒక పదం యొక్క . మూలస్వరూపం నుండి భ్రష్ట రూపం వఱకూ ఉండే పరిణామ క్రమాన్ని ఊహించడానికి లాక్షణిక భాషనుండి, శిష్టులూ, పామరులూ, పసి వాళ్ళూ, ఆయా ప్రాంతాలవాళ్ళూ ఆ పదాన్ని ఉచ్చరించడానికి వీలైన పద్ధతులన్నింటినీ ఆకళించుకోవాలి

భ్రష్టరూపంనుండి మూలరూపాన్ని ఊహించడానికికూడా అనే పద్ధతిలో అటునుంచి నరుక్కురావాలి. పరిణమించే పద్ధతుల్లో కచ్చితమైన క్రమమేదీ ఉన్నట్లు కనబడదు. ఉదాహరణకి 'వచ్చినవాడు'అనేరూపం క్రియగా స్థిరత్వం దాల్చి 'వచ్చినాడు' అయింది—ఇదే వచ్చాడు, వచ్చేడు, వచ్చిండు వచ్చీడు, ఒచ్చాడు, ఒచ్చేడు, ఒచ్చిండు, ఒచ్చీడు అని బహుభంగులుగా అవతారాలెత్తింది. వేర్వేరు పురుషల్లో, వచనాల్లో 'వచ్చాను, వచ్చావు, వచ్చారు', అని యేర్పడగా 'వచ్చు'ధాతువుమీద వచ్చే ఈ 'ఆడు, ఏడు, ఇందు, ఈడు, ఆను, ఆవు, ఆరు' అనేవన్నీ


Statement about ownership and other particulars about newspaper

**BHARATI**

*FORM IV* (SEE RULE 8)

1. Place of publication: Madras
2. Periodicity of its publication: Monthly
3. Printer's Name: Sri S. Nageswara Rao
   Whether citizen of Indhia: Yes
   If foreigner, state the country of origin: —
   Address: 16, Luz Avenue, Mylapore, Madras-4.
4. Publishers Name: Sri S. Nageswara Rao
   Whether citizen of India: Yes
   If foreigner, state the country of origin: —
   Address: (As above)
5. Editor's Name: Sri S. Sambhu Prasad
   Whether citizen of Indhia: Yes
   If foreigner, state the country of origin: —
   Address: 16, Luz Avenue, Mylapore, Madras-4.
6. Names and addresses of individuals who own the newspaper and partners or share-holders holding more than one percent of the total capital.

| NAMES | ADDRESSES |
|---|---|
| 1. Mr. S. Sambhu Prasad | 16, Luz Avenue, Mylapore, Madras-4. |
| 2. Mrs. S. Kamakshamma | Do |
| 3. Mr. S. Nageswara Rao | Do |
| 4. Mr. S. Radhakrishna | Do |

I, S. Nageswara Rao hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

S. NAGESWARA RAO
1-3-71 Signature of Publisher

ప్రత్యయాలా? పదాలా? అని ఆలోచిస్తూ కూర్చోవడం అనవసరం.

'ఆప్'కూడా ఆ కోవకు చెందినదే. అపదంగానో ప్రత్యయంగానో మారడానికి పూర్వం దానికి పరిణామచరిత్ర ఉంది. ఆ చరిత్రను పరిశీలించే ముందు భాషలో 'ప్రవాహినిత్యం'వల్ల వచ్చే వర్ణలోప విభాగాన్ని కొంత చూడాల్సిఉంటుంది.

మనం వ్యవహారంలోవాడే 'పోవు' ధాతువు యొక్క చేదర్థకరూపం, 'పోతే' అనేదాన్లో 'తే' అనేది ఎలా వచ్చియుంటుంది? 'పోయినట్లులయునచో' అనే రూపం, 'పోయినట్లులయితే — పోయినట్లయితే—పోయినట్టయితే — పోయితే — పోతే'గా మారింది. 'పోయినట్లయితే' అనేదాన్లో ఆద్యంతాలు శేషింపగా ఏర్పడ్డరూపం 'పోతే' అనేది.

పోతే, అలాగే ఆ + కడ = ఆడ అయింది.

'అలాగు'అనేమాటే చూద్దాం. 'లాగు' అనే దానికి పూర్వమందు ఆ, ఈ అనే నిర్దేశాత్మక సర్వనామాలు చేరగా అలాగు, ఈలాగుఅని ఏర్పడ్డాయని సూరిశ్రీ చెప్పారు. కాని ఈ 'లాగు' ఎలా గొచ్చిందో?

'అట్టులగు—అట్లగు—అట్లాగు—అల్లాగు—అలాగు — అలా'—అలా ఏర్పడ్డ రూపంలో బహుశః అగుధాతువు అప్రధానమై, అర్థాన్ని కోల్పోయి, అదృశ్యమై కూడా పోవచ్చును. 'అల్లగునా? అల్లాగు నటయ్యా! అలాగునేం?' ఇత్యాదుల్లో అగు ధాతువు కూడా తొంగిచూస్తున్నది.

'మధ్యాహ్నం వేళ' అనే మాటల్ని తొందర కొద్దీ 'మద్దెనాళ' అంటారు కొంతమంది.

'రావటము లేదు' అనేది రాపిడిలో, రావటం లేదు—రావటల్లేదు— రావట్లేదు— రాట్లేదు—అని మారింది.

'బాగుగా నున్నది' అనేరూపం బాగుగ నున్నది—బాగా నున్నది—బాగా ఉంది— బాగుంది— బావుంది—బాంది'గా మార్పు చెందింది. వేళాకోళం చేసే వేళ 'బాంది లేవాయ్' అని ప్రయోగముంది. అలాగే 'బాగోదు', ఉండదు— ఓదు అయింది.

'గోదా, శబరి' అనే నదీద్వయం ఏక ప్రవాహంగా 'గోదాబరి' గోదావరి— గోదారి'గా మారిందని చెబుతూ అది 'గోరి' కాకుండా వుండాలని శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు ఓసారి చమత్కరించారు.

'మామిడికాయ' అనేది పచ్చడై 'మాంగాయ, మాంగాయ్, గా మారింది. (దీర్ఘము మీద సాధ్య పూర్ణము లేదని దానికేం తెలుసు పాపం?) వ్యాకరణం తెలిసినవాళ్లు 'మాగాయ్' అంటున్నారేమో?

'బావగారూ! అనే పిలుపు పరిహాసంగా 'బారూ!' అని రూపం ధరించింది. ఒక తెలుగు సినిమాలో రెండు హాస్యపాత్రలు పరస్పరం 'బారూ!' అనే సంబోధించుకుంటాయి.

ఒక— ఓ అయింది. అవ' కూడా ఓగా మారింది. రెండవ వాడు—రెండ్ వాడు—అలా.

'ఉండవలయును' అనే క్రియ ఉండవలయు—ఉండవలె — ఉండాలె— ఉండాలి అయింది. వలయు అనేది 'ఆలి'గా మారింది. ఈ 'ఆలి'ని ప్రత్యయంగా తీసికొని 'ఉండి' అనేకార్యర్థంమీద. లేక ఉండు అనే మూలధాతువు మీద 'ఉండన్' అనే చేదర్థంలోని ద్రుతం లోపించగా మిగిలిన రూపం మీద 'ఆలి' సరవౌతుందేమో అని ఆలోచించడం ఏం బావుంటుంది?

'కాంబోలును — కావాల్సు — కావాలు — కావాసు—కామోసు—కాబోసు—ఏం మార్పులో!

'అనగానపుడు' అనేదే బహుశః అనవుడుగా మారి ఉండాలి. "అన(గా)" అనేది 'నా' అయింది. 'నావిని నా జను' ఇత్యాదులు గ్రాంథిక ప్రయోగములు.

'భోజనం'లో మధ్యభాగం భోంచేయగా 'భోం'ఏర్పడింది. 'భోం చేయడం' నిత్యవ్యవహారంలో ఉన్నదే కదా!

ఏమి యది—ఏమది—'ఏంది' అని గ్రామ్య వ్యవహారంలో వుంది.

ఈ వర్ణలోపం కేవలం 'వ్యావహారికం'లోనే వుందేమో అనుకోనక్కరలేదు. లాక్షణిక భాషలో కూడా బాహాటంగానే వుంది. పడ్వాదులకు పరమైనపుడు మువర్ణలోపము, అది, యని శబ్దాల అత్తునకు వృత్తిని లోపము, (నా అది—నాది), ప్రాతాదుల తొలియచ్చుమీది వర్ణాలకి లోపమూ, లిఙ్లట్టుల వకారలోపమూ (వండితి (వి))—ఇవన్నీ అలాటివే.

1. అనుట—అంట—అంట
2. నేరుచును—నేచును.
3. నేరువాడు—నేరాడు.
4. పోవుదురు—పోదురు.
5. పిలువుము—పిలుము.(వ్యవహారంలో పిలు)
6. ఆవులు ఆలు, జాములు–జాలు, చుట్టములు–చుట్టాలు, మీసములు-మీసాలు.

ఇవ్వన్నీ వ్యాకరణ సమ్మతములైన వర్ణలోపములు.

ఇక 'ఆక'—ఇది అచ్చంగా ఆనంతర్యార్థకమే. అందాక, ఇందాకలోని పర్యంతార్థకమగు 'దాక'తో ఈ 'ఆక'కు ఎంతమాత్రమూ సంబంధం లేదు.

'ఆ వెనుక' అనే రెండు మాటల ఆద్యంతాల శేషమే. 'ఆక'. దీని పరిణామక్రమం ఇలా వుంది.

ఆ వెనుక—ఆ వెనక—ఆ ఎనక—ఆ యెనక అయ్‌నక—ఆనక—ఆన్క—ఆంక—ఆఁక—ఆక.

అవి—తెలంగాణాలో కొన్ని ప్రాంతాల్లోని గ్రామీణులుచేసే ఈ 'ఆక' ప్రయోగాన్ని వింటే పై పరిణామక్రమాన్ని సులభంగా తేల్చుకోవచ్చు.

పోయినా యెనక — పోయినానక — అనే రూపాలు వాడుకలో ఉన్నాయి ఇందులో మొదటి రూపంలోని యకారం లీలామాత్రంగానే వినిపిస్తుంది. సరే—'ఆనక' అనేది ప్రసిద్ధంగా ఉండనే వుంది. పదమధ్యంలో 'న, ల, డ, ర' ల ఉచ్చానికి, ఒక్కొక్కప్పుడు ఉత్వేతరాచ్చులకు సైతం లోపంరావడం వ్యాకరణం అంగీకరించిన విషయమే. ఈ లోపం ఉచ్చారణా సౌకర్యంకోసమే ఉన్నట్లు స్పష్టంగా తెలుస్తుంది. 'కానుక - కిన్క, కానుక — కాన్క, కాలువ—కాల్వ, పెరుగు—పెర్గు, కలికి—కల్కి మొదలైనవి. [ఛందస్సు సౌకర్యంకూడా] అనుక, లేక ఆనక అనేదాన్లో సౌకర్యంకోసం పదమధ్య నకారంలోని అచ్చు లోపించగా 'ఆన్క' ఔతుంది. 'పోయినాన్క, వచ్చినాన్క'అనే రూపాలు గ్రామీణ ప్రాంతాల్లో బాహాటంగా ప్రచారంలో వున్నాయి.

నకారానికి బదులు బిందువు రావడంకూడా ఉచ్చారణకు చాలా అనుకూలం. 'ఆన్క' అనేది 'ఆంక'గా మారగా ఏర్పడే, 'వచ్చినాంక, పోయినాంక' వంటివి తెలంగాణంలో శిష్టజన ప్రయోగంలోకూడా ఉన్నాయి. దీర్ఘముమీద సాధ్యపూర్ణము లేకపోయినా, 'ఆంక'అనేది నిత్యవ్యవహారంలోవుంది. మాంగాయి, గోంగూర, ఆంబోతు లాగా.

ఇక, అంట, ఇంక,చూడు శబ్దాల్లో తప్ప నుడి తొలిహ్రస్వంమీద ఖండబిందువు లేదనే నియమం ఉన్నా వ్యాకరణ నియమానికి లొంగని వ్యవహారంలో 'ఆఁక' కాస్తా 'ఆఁక'కాక తప్పదు. మనకు ప్రయోగమే ప్రమాణంకదా! ['ప్రయోగశరణాః వైయాకరణాః'. వ్యావహారికభాషా వ్యాకర్తలనుకూడా వైయాకరణులని పిలువవచ్చునుకుంటాను]. 'వెళ్ళినాఁక, వచ్చినాఁక' అనే రూపాల్లోని అర్ధబిందువుయొక్క అనునాసికోచ్చారణతోసహా వాడుకవుంది మరి.

ఈ అనునాసికత్వం పోవడానికెంతసేపు పడుతుంది? ఉచ్చరించేవాళ్ళకి జలుబు, పడిశంలాటివి వచ్చినా, తెలుగు వ్యవహారంలో అర్ధానుస్వారానికిచ్చే విలువ ఇచ్చినా [అంటే ఉచ్చారణ విలువ ఇవ్వక

పోవడం] 'ఆఁక'లోని అర్ధానుస్వారం కాస్తా తప్పుకొని లచ్చమైన 'ఆక' మిగులుతుంది.

ధాతువుయొక్క క్రియాజన్య విశేషణం [భూతకాలికం] మీదనే ఇది ప్రయుక్తమౌతుంది. క్త్వార్థం మీదనో, మఱి దేనిమీదనో కాదు. ఇతరమైన ఆనంతర్యార్థ బోధకములగు పిదప, పిమ్మట, తరువాత మొదలైనవి ఏ రూపంమీద ప్రయోగింపబడతాయో 'ఆక' కూడా అంతే. చూచి వచ్చి, పోయి, మున్నగు క్త్వార్థములమీద అనుప్రయుక్తం కావడానికి అభ్యంతరం లేకపోయినప్పటికీ, 'తిని, కని, విని, పడి, చెడి' మొదలగు వానిమీద ప్రయోగించినప్పుడు, 'తినాక' కనాక' లాటి అనిష్టరూపాలు సిద్ధంకావడం చేత అవ్యాప్తిదోషం పడుతుంది. తినిన+ఆక—తిన్నాక. అనిన, తినిన, కనిన మొదలగు వాని మధ్యగల ఇత్వానికి ఉచ్చారణ వశాత్తుగా లోపం రాగా అత్వ సంధితో [చింతాకు లాగ] అన్నాక, తిన్నాక ఏర్పడతాయి. చెడిన, పడిన ఇత్యాదుల ఇనకు డాదేశమై చెడ్డాక. పడ్డాక ఏర్పడతాయి.

ఆనాక, ఆనిక్కి. అనక్కి అనేవన్నీ 'ఆనక' యొక్క వెకిలి రూపాలే. సర్పూరిశ్రీగారు చూపిన ఆన+ఆక, ఆని+ఆక, అను+ఆక అనే ప్రకియలర్థవంతములుగా తోచవు.

ఇంతా చేస్తే 'వెనుక'అనే మాట స్థలవాచకమా? సమయవాచకమా? అని సందేహం కలగవచ్చు. రెండూనూ. మనకు కావలసిన పశ్చాదర్థం ఇటు వాడుకలోనూ అటు నిఘంటువుల్లోనూ వుంది.

'నేను చెప్పవలసినదంతా చెప్పాను. ఆ వెనుక నీ యిష్టం. ముందువెనక లాలోచించి (పౌర్వాపర్యములు) పనిచేయాలి.' ఇత్యాది ప్రయోగాలున్నాయి.

'పేళ్ళు పశ్చాత్తనుటకు జెల్లువెనుకఁ
బిదపఁ దర్వాతఁ బదపడి పిమ్మటనఁ'

అని ఆంధ్రనామసంగ్రహం.

'పిమ్మటఁ దరువాతఁ బిదప వెన్క వెనుక
ననఁగఁ బశ్చాదభిఖ్యలు చెలఁగు'

అని సాంబనిఘంటువు.

'ఆ వెనుక' అనేది 'ఆక'గా మారడానికి జరిగిన ప్రక్రియ అంతా సమంజసమైనదేనా? అని ఎవరేనా ప్రశ్నించవచ్చు. తెలుగు సమాసాలు-అసలు లాక్షణిక సమ్మతమైనవే ఒక నిర్దిష్ట క్రమానికీ, ఇదమిత్థమైన పద్ధతికీ కట్టుబడి ఉన్నట్లు కనబడవు. అంత+దాక, అందాక, అవు+తోక—అందోక, నిడుద+మోము—నిడుమోము; ముందు+కలను—ముంగల—ఇట్లెన్నయినా ఉన్నాయి.

'అచ్చిక సమాసంబుల దఱచుగ వర్ణలోపాగమాదేశ వికారంబులు నిత్యవైకల్పికముగఁ బెక్కులు గానంబడియెడి' ప్రౌఢవ్యాకర్త చెప్పినట్లుగా లాక్షణిక ప్రయోగాల్లోనే పద్ధతికి లొంగని వికారాలు కనబడుతున్నప్పుడు ఇక వ్యవహారం సంగతి చెప్పే దేముంటుంది.?

శ్రీ ఉమాపతి పద్మనాభశర్మ.

---

# గ్రంథ విమర్శలు

## స్వారోచిష మనుసంభవః: ఆంధ్ర కావ్యానువాదః

(అనువదితా : కుణ్టిమద్ది శేషశర్మా; ప్రకాశకులు : ఆంధ్రప్రదేశ సాహిత్యఅకాడెమీ, కలాభవన్, హైదరాబాదు – 4. డెమీ 1/8 పు. 150 లు: పూర్తి కాలికోబైండు: వెల రు. 3—50 లు.)

మంచిగ్రంథాలు సమీక్షచేయడము ఆనందకరము. పెద్దన మనుచరిత్రమునకు శ్రీ శేషశర్మ చేసిన ఈ సంస్కృతానువాదము సర్వవిధాలా శ్లాఘ్యతరంగా ఉన్నది. ఇంతమంచి సంస్కృతానువాదము మా దృష్టిలో ఇంతవరకు పడలేదు. మూలగ్రంథము చదివినప్పుడు కలిగే ఆనందానికి సన్నిహితమైన ఆనందము ప్రసిద్ధకావ్యాల అనువాదపఠనమువల్ల కలిగినప్పుడే అనువాదము సఫలమైనట్లు. అట్టి సాఫల్య మీ అనువాదము సాధించినది.

**అందుకు ప్రధాన హేతువులు మూడు :**

(1) మూలములోని సంస్కృత పదాలను సమాసాలను చేతనైనంతవరకు అనువాదములో తీసుకొన్నారు.

(2) సంస్కృతభాషలో వాడుకలోలేని సీసము, తేటగీతము, ఉత్పలమాల, చంపకమాల, మత్తేభము వంటి ఛందస్సులను చాలా వాడినారు. కందపద్యము లనువదించుటలో, ఆ ఛందస్సుకు సంస్కృతమూలములూ సన్నిహితములూ ఐన ఆర్యాగీతి, ఉద్గీతి, ఆర్య, గీతిఛందస్సులు సాధారణముగా ఉపయోగించినారు, వచనభాగములు తరుచుగా వచనముగానే ఉంచినారు. ఈ విధముగా సంస్కృతానువాదములో ఆంధ్రచ్ఛందోవాసనను కూడా కల్పించినారు.

(3) శ్రీ శర్మగారికి సంస్కృత భాషా, ఛందస్సూ వాచోవిధేయంగా ఉండడంవల్ల, రచన నిపుణుడైన స్వర్ణకారుని చేతిలో తప్తకాంచనమువలె సాగినది. అందువల్ల మూలములోని సంస్కృతమయ భాగములేకాక ఇతర భాగములు కూడా అనువాదములో సంస్కృతపు పలుకుబళ్లతో రాణించేట్లు చేయ గలిగినారు.

ఈ క్రింది ఉదాహరణములు మా మాటలను సమర్థింపగలవు. అవి దిఙ్మాత్ర ప్రదర్శనములే. గ్రంథమంతా అట్టివే ఉన్నవి.

మూలము :

'ఉల్లల దలకా జలకణ
పల్లవిత కదంబ ముకుళ పరిమళ లహరీ
హల్లోహల మదబంభర
మల్లధ్వను లెసగ విసరె మరుదంకురముల్.'

అనువాదము :

'ఉల్లల దలకాజలకణ
పల్లవిత కదంబగంధితే వహతి
పంకజ మధుమద బంభర
ఝంకార విసారకే మరుత్పోతే.'

మూలము :

'మృగమద సౌరభ విభవ
ద్విగుణితఘన సారసాంద్రవీటీ గంధ
స్థగితేతర పరిమళమై
మగువ పొలుపు దెలుపు నొక్కమారుత
మొలసెన్.'

అనువాదము :

'మృగమద సౌరభ విభవ
ద్విగుణిత ఘనసారవీటికా గంధైః
స్థగియ న్నితర పరిమలం
ఏవో మరుత్కోఽపి కామినీపిశునః.'

పై అనువాదములో చివరిపాదము ఎంత రమ్యముగా అనువదింపబడినదో గమనార్హము!

మూ ల ము :

అమల మణిమయ నిజమంది రాంగణస్థ
తరుణ సహకారమూల నితర్దిమీద
శీతలానిల మొలయు సపీఠ్యమైన
యన్నిలిం పాబ్జముఖియు వయ్యవసరమున.

అ ను వా ద ము :

అమలమణిమయ నిజమందిరాంగణస్థ
తరుణ సహకారవేదికాస్థా సుఖేన
శీతలానిల సంసేవ్య మాననాక
పుల్ల సరసీజలోచనా త్రత సాఽపి.

పై మూలమూ అనువాదమూ తేటగీతులే.

మూలము : 'ఇంతలు కన్నులుండ తెరువెవ్వరి వేడెదు భూసురేంద్ర' ఇత్యాది ప్రసిద్ధపద్యమును, చక్కని తెలుగు నుడికారము కలదానిని, ఎంతచక్కగా అనువదించినారో చూడండి!

అ ను వా ద ము :

అకర్ణాంత విశాలలోచన యుగే
సత్యప్యహో విప్ర కామ్,
మార్గం పృచ్ఛసి? కింత్వయా
న విదితో యే, నాగమో? యకౌవతవ్
వ్యాజేనాలపితుం మిథః స్మిత
మిదం ధైర్యం కియత్తావకమ్?
కిం తావ ల్లఘవో వయం తవదృశోః?
కిం జల్పితైర్నైకక్కైః?

చివరి పాదములోని 'ఇంత భయంబులేక ఇట నెల్లిదమైతిమి మాటలేటికిన్' అని మూలములోని బహువచనముతోసహా రమ్యముగా అనువదింపబడినది.

దానికంటెకూడా ప్రసిద్ధమైన 'పాటున కింతులోర్తురె కృపారహితాత్మక' ఇత్యాదిగా గల ఏడవపు పద్యము అనువాద మిట్లా ఉన్నది.

పాతుం కిన్ను సహేయు రేవ మబలాః?
క్రూరోఽసి పశ్యాఽత్రతే
ధార్ష్ట్యం చ్ఛాత నఖాంకురక్షతి మితి
ద్రాగ్ధర్శయంతీ ముహుః
బాధా కైతవతో మనోజ్ఞ నినదం
చక్రంద చంద్రాననా
తృట్య న్నిష్ఠుర పీవరస్తన
పత ల్లోలాంబుధారాకులా'

ప్రవరుడు అగ్నిహోత్రుణ్ణి ప్రార్థించిన 'దాన జపాగ్నిహోత్ర పరతంత్రుడనేని' ఇత్యాది పద్యమున కనువాదము.

'దాన స్నాన జపాగ్నిహోత్ర నిరత
స్వాత్మాద పంకేరుహ
ధ్యానానంద పరశ్చ నాన్యవనితా
విత్తావనీ లాలసః
స్యాంచే న్మామయి హవ్యవాహ,
కరుణాసింధో, జగద్బాంధవోఽ
వాచీ దిగ్ధరణీ ధరాగ్ర గమనా
త్ప్రాఙ్ మద్గృహం ప్రాపయ'

సూర్యాస్తమయ వర్ణనలోని సీసములో మొదటి రెండు పాదాలూ, వాటి సీసానువాదమూ :

మూ ల ము :

'ఉరుదరీ కుహర సుప్తోత్థ శార్దూలముల్
ఝరవారి శోణిత శంక ద్రావ
వనకుంజ మధ్య శాద్వల చరన్మృగపంక్తి
దావపావకభీతి దల్లడిల్ల......'

అ ను వా ద ము :

'ఉరుదరీకుహర సుప్తోత్థ శార్దూలేషు
ఝరవారి శోణిత మితి పిబత్సు
వనకుంజ శాద్వలతల చరేషు మృగేషు
ధావత్సు కాననదవభయేన......'

పుష్పాపచయపురగడకూడా రగడగానే అనువదించారు.

మూలము :

'సర్పుమై నల్లని యది నెరుల దొలుపూమదిమె
దర్పకున కర్పింపదలప దెంతటి పెరియ?'

అనువాదము :

'సాందిలూనం సుమం వరౌల మారోపయుత్
కీదృశం చామలం? మన్మథ- నార్పయత్.'

చివరివరకూ ఇట్లాగే మూలానుసరణము సాగినందుకు షష్ఠాశ్వాసములోని స్వరోచిభోగము వర్ణించు సీసములోని మొదటి రెండు పాదాలూ అనువాదమూ ఉదాహరిస్తున్నాము :

మూలము :

'గంగాతరంగిణీరంగ త్తరంగ శీ
కర శీత సైకతోత్కరములందు
మందారమాకంద మకరంద తుందిలేం
దిందిరానందకృ న్నందనముల......'

అనువాదము :

'గంగాతరంగిణీ రంగత్తరంగోర్మి
శీకరశీతలసైకతేషు
మందారమాకంద మకరంద తుందిలేం
దిందిరానందకృన్నందనేషు......'

అనువాదము అంతా మూలానుసారముగానే ఉన్నది కాని రెండు చోట్లమాత్రము అనువాదకులు స్వతంత్రించి మార్పులు చేసినారు.

(1) సిద్ధుడు తాను తీర్థయాత్ర చేసినది వర్ణించిన 'కేవారేశు భజించితిన్...' పద్యములో శ్రీ శేషశైల వేంకటేశ్వరుడు లేడు. అనువాదకులు, 'బదరీనాథ మైక్షే' తర్వాత 'శేషాచల భూషాం వెంకటేశం స్తుతి కుసుమ శతైరార్చిషం విప్రవరాశే' అని చేర్చినందుకు చిరునవ్వు రాక మానదు. శ్రీ రంగనాథునికూడా తీసుకొని రాలేదు.

(2) ఆ మందిడి యత డరిగిన భూమీ సురు డరిగె...' అనే పద్యాన్ని పట్టుకొని మన విమర్శకులు కేవల శుష్కతర్కబుద్ధితో పెద్దనకు అనౌచిత్యదోష మారోపిస్తున్నారు. దానిని నివారించడానికి అనువాదకులు సిద్ధుడు పాదలేపమిచ్చిపోగా, మరునాటి ఉదయమున ప్రవరుడు తానే పాదలేపము రాచుకొని బయలుదేరినట్లు మార్పు చేసినారు.

మనుచరిత్ర అవతారికా పద్యాలూ, ఆశ్వాసాద్యంతపద్యాలూ గ్రంథభాగము కాదు కాబట్టి వాటి నన్నిటిని వదలివేసినారు. 'శ్రీ వక్షోజ కురంగనాభ మెదపై...' అన్న పద్యాన్ని. ప్రార్థనా పద్యాన్ని అనువాదము చేసి కవి తనకు శ్రేయస్సు లిచ్చుగాక అని మార్పు చేశారు.

ఆ రాశ్వాసాలూ ఆరు సర్గలు చేశారుగాని, ద్వితీయాశ్వాసములో పాదలేపము కరిగి ప్రవరుడు చింతించేటంతవరకూ ఉన్న భాగాన్ని మొదటి సర్గలో చేర్చి దానికి 'హిమాచలాలోకనోనామ' అని నామకరణము చేసినారు. అట్లే తక్కిన సర్గలకు కూడా గద్యలలో వరూధినీ సల్లాపోనామ, నిర్జరీసంగమోనామ, గంధర్వశాప పరివర్జనంనామ, మనోరమోపయమోనామ, స్వారోచిషమనుసంభవోనామ — అని ఆయాకథాభాగాలకు ఉచితముగా నామకరణములు చేసినారు.

ముందు ఆంధ్రములోని ఉద్గ్రంథాలను సంస్కృతానువాదములు చేయబోయే కవులకు ఈ అనువాదము మార్గదర్శకముగా ఉండగలదు.

సంస్కృతశబ్దాలు భారతీయ భాషలన్నీ వాడుకుంటున్నా కించిదర్థభేదాలు ఉంటున్నవి. ఈ విధంగానే ఇతర భాషలలోని ఉద్గ్రంథాలకు సంస్కృతానువాదాలుచేస్తే, భారతీయ భాగాలవారి పరస్పరావగాహనకు ఎక్కువ దోహదము చేయడమేకాక, సంస్కృత భాషకూడా వృద్ధిపొంది సంపన్నతరము కాగలదు.

ఇంత మంచి సంస్కృతానువాదము చేసిన గ్రంథకర్తనూ, ఎంతో అందంగా చౌకగా అందేట్లు ప్రకటించిన ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడెమీ వారిని హృదయ పూర్వకముగా అభినందిస్తున్నాము.

దేవనాగరలిపిలో అచ్చొత్తించిన ఈ గ్రంథము ఇతర రాష్ట్రాలకూ ఇతర దేశాలకూ వ్యాపించేట్లు కృషికూడా దీక్షగాచేసినప్పుడే, ఇట్టి ప్రచురణ ఆశయము సిద్ధింపగలదని సూచిస్తున్నాము

## అమరవాణీ ప్రసారములు

(సంకలనము, పీఠిక : శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి; ప్రకాశకులు : ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడెమీ, కళాభవన్, సైఫాబాదు, హైదరాబాదు 4; పోఫ్ కాలికోబైండు 1/8 డెమీ పే. 324 లు వెల రు. 5/లు.)

ఆంధ్ర భాషకు సంస్కృతముతో విడదీయరాని సంబంధమున్నది. అందువలన ఆం. ప్ర. సాహిత్య అకాడెమీవారు ఆంధ్రులు రచించిన సంస్కృత గ్రంథములను ప్రచారించుచున్నట్లు, విజయవాడ ఆకాశవాణి ప్రసారము చేసిన అమరవాణి కార్యక్రమములను కొన్నిటిని సేకరింపజేసి ప్రచురించుట ప్రమోదావహము. సేకరించుటయందును, ఎన్నుకొనుటయందును శ్రద్ధను యుక్తవిచక్షణను ప్రదర్శించిన శ్రీ సుబ్బరామశాస్త్రిగారిని ప్రచురించిన అకాడమీవారిని హృదయ పూర్వకముగా అభినందించుచున్నాము.

ఇందున్న 20 ప్రసంగములలో 4 సంస్కృతమందును, తక్కినవి ఆంధ్రమందును గలవు. వీనిలో ఎనిమిది ప్రసిద్ధ విద్వాంసులగు శ్రీ సూరి రామకోటిశాస్త్రిగారివి, ఐదు శ్రీ అప్పల్ల సోమేశ్వరశర్మగారివి, తక్కినవి ఇతరులవి. ఈ భాషణముల పఠించుటచే కావ్యాత్మనుగూర్చిన వివిధ సిద్ధాంతములలో ప్రధానమైనదియు, వేదాంత మతమును స్థూలముగా విదితము కాగలదు పూర్వాంధ్ర పండితులలో జగత్పూజ్యులైన అన్నంభట్టు, అప్పయ దీక్షితులనుగూర్చి శ్రీ రామకోటి శాస్త్రిగారి ప్రసంగములును, సంస్కృతములోని సాంఘిక రూపకాలు, ఉపహాసకావ్యాలనుగూర్చి శ్రీ సోమేశ్వరశర్మగారి ప్రసంగములును, నాట్యశాస్త్రము—ఆంధ్రుల సేవనుగూర్చి డా॥ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి చేసిన ప్రసంగమును ప్రత్యేకముగా అభినందనార్హములుగా ఉన్నవి. సంకలితప్రసంగములన్నియు సంస్కృతములోగల శాస్త్రములలోను సాహిత్యమందును సామాన్యప్రజానీకమునకు ప్రవేశము కలిగించి అధ్యయనము చేయుటకు ఔత్సుక్యము కలిగించునవిగా ఉన్నవి.

గ్రంథము మొత్తములో ప్రసారభాగము 118 పేజీలుకాగా, శ్రీ శాస్త్రిగారి సింహావలోకనము 205 పేజీలు, దాదాపు రెండింతలు ఉన్నది. అందులో 2—20 ప్రసంగముల పరిచయము. 17 పేజీలు మాత్రమే. 'భారతీయ సంస్కృతే రేకత్వమ్' అను మొదటి ప్రసంగమునకు పరిచయమను మిషతో 117 పేజీలు సీకాగ్రంథము నడచినది. తక్కిన 70 పేజీలతో సంస్కృతభాష విశిష్టత, దానిని అనుసంధానభాషగా చేయవలసిన అవసరము, దానికి ప్రస్తుతము లభ్యమగుతున్న ప్రచారాదులు వివరింపబడినది.

మొదటి ప్రసంగమునకు పరిచయముగాను ఉన్న బృహద్భాగము శ్రీ శాస్త్రిగారికి భారతదేశమందును భారతీయ సంస్కృతియందునుగల అభిమానాతిశయము సువ్యక్తము చేయుచున్నది. వారు ముఖ్యముగా బిషపు కాల్డ్వెలు ద్రావిడభాషా సిద్ధాంతముతో ఆర్యద్రావిడ జాతిభేద మేర్పడి అవిచ్ఛిన్నమైన భరతభూమిని ఆంతరద్వేషముతో విచ్ఛిన్నముచేయు ప్రమాదస్థాయికి వచ్చుచున్నదనుచు, అది అప్పటి విదేశపరిపాలకులు దేశమును బలహీనపరచుటకు చేసిన అనేకప్రయత్నములలో భాగమని నిరూపించుటకు చేసిన ప్రయత్నము బుద్ధిమంతులను సద్భావముల వంకకు ప్రేరేపించునదిగా ఉన్నది.

ఇక మానవజాతి కంతటికి భారతదేశమే జన్మస్థానమనియు, ప్రపంచ ప్రజలందరు భారతదేశమునుండి వెళ్ళినవారనియు, సంస్కృతమే సర్వప్రపంచ భాషలకు మూలమనియు, చేసిన ప్రతిపాదనలు వారి విపరీతదేశాభిమానమును ప్రదర్శించుచున్నవి.

శ్రీ శాస్త్రిగారికి కొన్నివిషయములలో కొన్ని విశిష్టభావములున్నవి. వానిని సిద్ధాంతములుగా చూపుటకుముందు, వానికి ఆధారములైన సాక్ష్యసాధనములను నిష్కృష్టముగా ప్రదర్శించి, ఆ పిమ్మట అందుకు ఉపోద్బలకముగా ఇతరుల అభిప్రాయములను చూపినచో విశ్వాసపాత్రములగునుగాని పీఠికలో అందుకు విరుద్ధమైనమార్గ మవలంబింపబడినది. పీఠికాకర్త తన యభిప్రాయములను నిరూపించుటకు, ఎవరో ఒకరి యభిప్రాయములను వరుసగా 'కోటు' చేయుటతో తృప్తిపడినందున వారి భావములు సిద్ధాంతములుగా నిరూపితములు కాలేదు. ఈ 'కొటేషన్సు' వలననే పీఠిక అతిభారమైపోయి బుద్ధిమంతులకు వారి భావములు బలహీనములను సంశయము కలిగించుటే కాక పాఠకులకు తీవ్రముగా విసుగు పుట్టించునదిగా ఉన్నది; శ్రీ శాస్త్రిగారి ఉత్సాహము ఔచిత్యమును ఉజ్జగింపజేసినది. ఇంతటి దీర్ఘ పీఠికలో ఎక్కడో సకృత్తుగాతప్ప మెరుపులు గోచరింపలేదు.

ఇట్లే హైదరాబాదునుండియు ఇతర రాష్ట్రీయ కేంద్రములనుండియు ప్రచారమవుచున్న అమరవాణీ ప్రసారములను విచక్షణతో సేకరించి, ప్రచురించినచో, సాహిత్య అకాడమీవారు భారత సంస్కృతికి విశేషసేవ చేసిన వారవుదురని సూచించుచున్నాము. సంస్కృతభాషా ప్రసంగములే సేకరించి దేవనాగరిలిపిలో ప్రచురించినచో దేశములో జాతీయ భావమును పెంపొందించిన ప్రశంసకును పాత్రులు కాగలరు.

శ్రీ నోరి నరసింహశాస్త్రి.

## తలపుల దుమారము

మూలం—కీర్తిశేషుడు మౌలానా అబుల్ కలాం ఆజాద్. అనువాదం—శ్రీ దేవులపల్లి రామానుజరావు. పుటలు — 182. వెల 8 — 00. ప్రాప్తిస్థానం — సాహిత్య అకాడెమీ, రవీంద్రభవన్, న్యూఢిల్లీ—1.

స్వాతంత్ర్యోద్యమ సమయంలో మౌలానా అబుల్ కలాం ఆజాద్ అహమద్‌నగర్‌కోటలో నిర్బంధంలో వున్నప్పుడు ఉరుదులో వ్రాసిన లేఖలు 'గుబారే ఖాతిర్' అనే పేరుతో పుస్తకరూపంతో ముద్రించబడ్డాయి, అవి పెక్కుసార్లు పునర్ముద్రణ పొందాయి. ఈ లేఖలు మౌలానా ఉరుదూ, ఫార్సీ కవితా వైదుష్యాలకు నమూనాగా పేరుపొందాయి. వాటిని ఆ శైలిలోనే శ్రీ దేవులపల్లి రామానుజరావు ఈ అనువాదంతో ఆంధ్రులకు అందజేశారు.

## శ్రీ కృష్ణలీలాతరంగిణి

శ్రీ నారాయణతీర్థులవారు (నారాయణానంద తీర్థయతీంద్రులవారు) రచించిన దీనిని శ్రీ నోరి నరసింహశాస్త్రి విపులాంగ్ల పీఠికతోను, శ్రీ శివశంకర స్వామి సంస్కృత 'నివేదనమ్'తోను, శ్రీ భీమసేన్ 'నిర్మల్' వ్రాసిన ఉత్తమవాగ్గేయకార్ అనే హిందీ పరిచయవ్యాసంతోను రేపల్లె సాహితీసమితి ప్రచురించింది; దేవనాగరీలిపిలో ప్రచురించడంవల్ల ఆంధ్రేతరులూ చదువుతారు. పుటలు-238. వెల-6-00. ప్రాప్తిస్థానం—సాహితీసమితి, రేపల్లె, గుంటూరు జిల్లా.

## శ్రీ నటరాజస్య ఆనంద తాండవ దర్శనం

చిదంబర మాహాత్మ్యంలోని నటరాజానంద తాండవాన్ని శాస్త్రాచార్య పండితరాజ, శ్రీ సోమశేఖరదీక్షితార్ దేవనాగరలిపిలో విడిగా ప్రచురించినట్టిది. పుటలు—32. వెల—తెలియదు. ప్రాప్తిస్థానం—శ్రీ సోమశేఖరదీక్షితార్, ట్రస్టీ. నటరాజ టెంపిల్. చిదంబరం.

## అతికని బ్రతుకులు

సాంఘిక నాటకం. రచయిత—శ్రీ ప్రయాగ రంగశర్మ. పుటలు — 170. వెల —2—50. ప్రాప్తిస్థానం—శ్రీ శ్రీనివాసా పబ్లికేషన్స్, అనకాపల్లి (విశాఖజిల్లా)

### శ్రీమాత

శతకం. రచయిత—శ్రీ ముదిగొండ జ్వాలా పతిలింగశాస్త్రి అయ్యవారు. పుటలు—32. వెల 0—30 పై. ప్రాప్తిస్థానం—రచయిత, ఈమని, తెనాలి తాలూకా. ఈ శతకం చివర లలితా చూర్ణిక (సంస్కృతం) ఉన్నది.

### జీవచ్ఛవం

నాటకం. మూలం—టాల్‌స్టాయి. అనువాదం శ్రీ, సి. వి. ఎస్. నారాయణరావు ఇది 'లైఫ్ కార్ప్స్' నాటకానికి అనువాదం. పుటలు - 100. వెల 2—00. ప్రాప్తిస్థానం — మందర పబ్లికేషన్స్, ఫ్రేజర్ పేట్, కాకినాడ--1.

### బుద్ధిమంతుడు

సినిమా నవల రచయిత—శ్రీ ముళ్ళపూడి వెంకటరమణ. పుటలు—84, వెల—2—00. ప్రాప్తిస్థానం—ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, రాష్ట్రపతిరోడ్, సికిందరాబాద్.

### ఆత్మీయులు

సినిమా నవల రచయిత్రి—శ్రీమతి యద్దనపూడి సులోచనారాణి. పుటలు—168. వెల 2—00. ప్రాప్తిస్థానం — ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్. రాష్ట్రపతిరోడ్డు. సికింద్రాబాద్.

---

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-1. Editor : S. Sambhu Prasad.